# తెలుఁగు మెఱుఁగులు

## [వ్యాస సంపుటి]

రచయిత:

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి



ప్రకాశకులు:

ఆంధ్రగ్రంథమాల

తపాలాపెట్టె 212

మద్రాసు.

[వెల. 2/-

# తొలిపలుకు

---

జీవితమెల్ల స్వీకరించుకొని యనుభూతివిశేష మొకటి యమృతమధురమై యాస్వాద్యమై యుండుటచే నేఁడు నాకు సాహిత్యరసాస్వాద ముప్పనచప్పనగాఁ దోఁచుచు నుత్సాహము గొల్పుచున్నది. నే నిట్లుండఁగా ఎప్పుడెప్పుడో పత్రికలలోను (భారతి, వేంకటేశ్వర ప్రాచ్యవిద్యాపరిషత్సంచిక, గృహలక్ష్మి), రేడియోలోను ప్రకటితములు, అప్రకటితములు నగు నా వ్యాసములను, ఇతరరచనములను కొన్నింటి నేని గ్రంథరూపమున ముద్రణమునకుఁ దెత్తుముగాక యని పూని చిరంజీవులు రామచంద్ర కోదండరామాదులు మదీయులు కావించిన కార్య మిది.

వారు నాతో యోచించియే ఏవో కొన్ని విభాగములు కల్పించి వ్యాసములను వేర్వేఱుగా సంకలనము చేసి సాహిత్యప్రసక్తములను గొన్నింటిని మాత్రమే యిప్పుడిట్లు ముద్రణమున కిచ్చిరి.

అంతలో - అమాంతముగా - పురుషోత్తమవియోగ దుర్యోగమున భావనమెల్ల నల్లకల్లోలము కాఁగా నిరుత్సాహనిహతుఁడనై యారంభించిన ఈభాగము ముద్రణము పారము ముట్టుచున్నను నేను దానివంకకైనఁ గన్నువాల్పనయితిని.

ఇందు అప్పటప్పట నా పునఃపర్యాలోకనము లేకపోవుటచేఁ గలిగినచ్యుతులను పరిశిష్టముగా తుదికి జతకూర్చితిని.

ఆప్తుల యౌత్సుక్యమునకు లోఁగి కావించిన నా యీ ముద్రణయత్నము సప్రయోజనమో, కాదో నిర్ణయింప సహృదయలోకము ప్రమాణము.

నాయెడ, సాహిత్యగురువర్యులగు శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల దివ్యప్రతిభానుగ్రహమును, ప్రాచ్యలిఖిత పుస్తకశాలయాశ్రయానుగ్రహమును సదా సాహిత్య జ్యోతులు గొల్పు జగాదివ్వటీలు! వానిని బురస్కరించుకొనియే నా సాహిత్యయాత్ర సాగెను. ఆ యుభయమునకు జే! జే!

తిరుపతి,
1948 జూన్ 29

వేటూరి ప్రభాకరశాస్త్రి.

# పీఠిక

మా గ్రంథమాలలో క్రొత్త పుస్తకములను ప్రకటించి చిరకాల మైనది. దానికి గల కారణములు అందరు ఎరిగినవే. ఆ కారణములు ఇప్పుడు కొంతకుకొంత తొలగినవి కాబట్టి తిరిగి యథాప్రకారముగా క్రొత్తక్రొత్త పుస్తకములను అవకాశము కలిగినప్పుడెల్ల వరుసగా ప్రకటించవలె నన్న తలంపు కలిగినది. తత్ఫలమే ఇప్పుడీ పుస్తకము. ఆంధ్రమహాజనులు మా ఆశయమునకు తప్పక దోహద మిత్తు రని నమ్ముచున్నాము.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆంధ్ర సంప్రదాయములను, ఆంధ్రభాషను, ఆంధ్రవాఙ్మయమును తరచి తరచి, అందలి నిగ్గులు లెస్సగా తేల్చినవారు. భాషలోను, వాఙ్మయములోను పరమప్రామాణికులు. జీవితమెల్ల సారస్వతసేవకై అంకితముచేసినవారు. అటువంటివారు అపారపరిశ్రమ చేసి, అప్పుడప్పుడు పత్రికలలో చెల్లాచెదరుగా ప్రకటించిన కొన్ని తెలుగుమెఱుగులను ఈ వ్యాస సంపుటిలో ఒక్కటిగా కూర్చి తెలుగువారి కందించు

చున్నారు. ఈ వ్యాసములు ఆంధ్రసారస్వతప్రియులకును, కళాశాలావిద్యార్థులకును మిక్కిలి ఉపయోగపడి వారిలో ఆంధ్రాభిమానమును వృద్ధిచేయుటకు తప్పక తోడ్పడగల వని నమ్ముచున్నాము. సహృదయులందరును దీనిని ఆదరింతు రనియే విశ్వసించుచున్నాము.

దీనిని మా గ్రంథమాలలో ఒక కుసుమముగా జేర్చి ప్రకటించుటకు అనుమతించినందులకు శాస్త్రిగారికి మేము మిగుల కృతజ్ఞులము.

ప్రకాశకులు.



# విషయానుక్రమణిక

# తెలుఁగు వెలుఁగులు

---

## ౧

## తెలుఁగుదనము - తెలుఁగు సంప్రదాయము

తెలుఁగువారన్నను, ఆంధ్రులన్నను ఒకరే అన్న యెఱుకతో మాటాడుచున్నాను. తెలుఁగు సంప్రదాయ మన్నను తెలుఁగుతనమన్నను, ఆంధ్రసంప్రదాయమన్నను ఆంధ్రత్వమన్నను ఒకటే అని నా తలఁపు.

"ఆంధ్రద్రవిడకర్ణాటా మహారాష్ట్రాశ్చ గుర్జరాః"- ఈ అయిదు జాతులవారును పంచద్రావిడులని ప్రాచీనులు పేర్కొన్నారు. ప్రాచీనకాలమునందు, ఇప్పటికిఁగూడ, ఈ యయిదుజాతులవారికిని ఆచారవ్యవహారములు, ఆహార విహారములు, కవితాగానములు, కులమర్యాదలు కొంత కొంత సరిపోలుచునే ఉన్నవి. ఔత్తరాహులయిన పంచ గౌడులకు"సారస్వతాః కాన్యకుబ్జా గౌడా ఉత్కలమైథిలాః" అని పేళ్లు. వారు చాలవిధములందు పంచద్రావిడులతో భేదింతురు. పంచద్రావిడులలో నేఁడు, ఆంధ్ర ద్రవిడ కర్ణా టులుమాత్రమే అత్యధికసంబంధముగలవారుగా ఉన్నారు.

కాని, ప్రాచీనకాలమున, అనఁగా రెండువేలయేండ్లకు ముందు, సాతవాహనులును ఇక్ష్వాకులును పాలించిననాళ్లలో మహారాష్ట్రులు, గుర్జరులు కూడ ఈ మూఁడుజాతులతో చాల సన్నిహితసంబంధముగలవారై యుండెడివారు. ఆంధ్రుల నేఁటి యాహారసంప్రదాయమే పంచద్రావిడులయు నాహారసంప్రదాయమని శంకరాచార్యాదులు రచించిన పూజాస్తోత్రములలోని నైవేద్యక్రమవర్ణనశ్లోకములనుబట్టి గుర్తింపనచ్చును. శాల్యన్నము, నెయ్యి, పప్పు, కూరలు, పచ్చళ్లు, దప్పళము, పెరుగు ప్రధానాహారపదార్థములుగా శ్లోకము లున్నవి. ఇప్పటికిని ఆంధ్రుల యాహారపద్ధతి ఇదే కదా.

ప్రాచీనకాలమున తెలుఁగువారికి పైఁటలు లేవు. అవి మహారాష్ట్ర గుర్జరుల సంబంధమున, అప్పటి ఆంధ్ర రాజధాని యయిన ప్రతిష్ఠానము (పైఠాణ్)నుండి నాగరకతతో వ్యాపించినవి. పైఠాణ్ పదభవమే పైఁట. ఆంధ్ర స్త్రీవర్ణనము సాతవాహనసప్తశతిలోను, ఇతరసంస్కృత కావ్యములందును కుచసౌభాగ్యము ప్రధానముగా వర్ణితమగును. మంకుకుని కావ్యమీమాంసలో ఆంధ్రస్త్రీలను గూర్చి యీ శ్లోక మున్నది:

"కేశాః సపుష్పగండూషా జఘనే మణిమేఖలా,
హారో రక్తోఽంశుకం శుభ్రం వేషః స్యాదంధ్రయోషితామ్."

సదుక్తి కర్ణామృతాదులలోఁగూడ ఆంధ్రస్త్రీవర్ణనము లున్నవి.*

పుష్పాలను పుక్కిలించు కొప్పు, మణిమయమయిన యొడ్డాణము, రక్తహారము, తెల్లచీర ఇది తెలుఁగు నెలఁత వేషము అని పైశ్లోకమున కర్థము. భర్తృమేంఠాది సంస్కృత కవులు ఆంధ్రులను గూర్చి చెప్పిన శ్లోకములకు ఆంధ్ర స్త్రీలు సౌందర్యవతులని, నృత్యగానప్రియలని, అమాయికలని అర్థసారము. ఆంధ్రుల సంగీతసాహిత్యములతో తొలుత మహారాష్ట్ర కర్ణాటకుల కధికసంబంధ ముండెడిది.

---

*సదుక్తి కర్ణామృతమునుండి-

వాచో మాధుర్యవర్షిణ్యో నాధయః శిథిలాంశుకాః, [మేంఠస్య)
దృష్టయశ్చ చలద్భ్రూకా మండనా న్యన్ధ్రయోషితామ్. (భర్తృ)
ఆమూలతో వలితకున్తలచారుచూడః
చూర్ణాలకప్రకరలాంఛితభాలభాగః
కక్షానివేశనిబిడీకృతనీవి రేష
వేష శ్చిరం జయతు కున్తలకామినీనామ్. (రాజశేఖరస్య)
వాక్సత్త్వాంగసముద్భవై రభినయై ర్నిత్యం రసోల్లాసతో
వామాంగ్యః ప్రణయన్తి యత్ర మదనక్రీడామహానాటకమ్,
అత్రాన్ధ్రాస్తవ దక్షిణేన త ఇమే గోదావరీస్రోతసాం [రస్య)
సప్తానామపి వార్ధిప్రణయినాం ద్వీపాన్తరాళశ్రియః. (రాజశేఖ

మానసోల్లాసమునుండి——

కాశ్చి త్కున్తలకామిన్యః ఘటీకృతకున్తలాః,
కాశ్చి ద్ద్రావిడకామిన్యః ప్రకాశితపయోధరాః
మహారాష్ట్రస్త్రియః కాశ్చిత్ లంబలోలకభూషితాః
అంధ్రనార్యో వరాః కాశ్చి దపసవ్యోత్తరీయకాః
గుర్జర్యో వనితాః కాశ్చి దాపాణికృతకంచుకాః.

సంగీతమున ఆంధ్రదేశి సంప్రదాయభేదములు కొన్ని మతం గుని, బృహద్దేశిలో వివరింపఁబడినవి. తెలుఁగువారిలో వివాహములందు మంగళసూత్రము కట్టుట అనాది యాచారము. ఈ యాచారము ఉత్తరదేశీయులకు లేదు. ఆర్యుల గృహ్యసూత్ర గ్రంథములలో లేనేలేదు. ప్రాచీనకాలమున నుండి ఆంధ్రస్త్రీలకు వివాహములందు తాటియాకును చుట్టగాఁ జుట్టి పసుపుపూసి నూలిచాందుతో కట్టి వధువుకంఠమున వరునిచే మూఁడుముళ్లు వేయించుట యాచారము. కనుకనే దానికి తాళిబొట్టని పేరయ్యెను. తాళి యనఁగా తాడియే. అట్లే ఆంధ్రస్త్రీలు చెవులకు కమ్మలను, అనఁగా తాటి యాకులనే చుట్టిపెట్టుకొనుట యాచారము. 'తాటాకు' పదమే సంస్కృతమున తాటంకమయినది. దానికి తెలుఁగున 'చెవాకు' అనికూడ పేరున్నది. తాటియాకులను చెవుల కమ్మలని ధరించుట, తాళిబొట్టు కట్టుకొనుట తెలుఁగువారి నుండి కడమ ద్రావిడులకు సంక్రమించినవి. ఇట్లనుటకు తాళి, తాటంక, కమ్మ, చెవాకు పదములే సాధకములు. తాడి కమ్మ తాటాకులు తెలుఁగు పదములే కదా. తెలుఁగు వారికి తాడిచెట్టు కల్పవృక్షము! తెలుఁగువారిలో మాలలు, మాదిఁగలు, రెడ్లు, వెలమలు, కమ్మలు, కాపులు, కోమట్లు, రాచవారు, వెలనాట్లు, వేఁగినాట్లు, తెలుగాణ్యులు, నియోగులు మొదలయిన యంతర్విభాగములు గల యష్టాదశ జాతుల ప్రజలలో సామాన్యధర్మములుగా నీ క్రిందివి కానవచ్చును.

"ఆతిథ్యగౌరవంబును,
స్వాతంత్ర్యప్రియత, స్వల్పసంతోషము, దు
ర్నీతివిహీనత, నైచ్యా
పేతత్వము సంధ్రులందు పేర్పడు గుణముల్.

ఓర్వరు మాయామర్మము స
    ముజ్జ్వల ధీమహిమంబు పేర్పడఁగ
నేర్వరుగాక విద్దియలు,
    నెయ్యము తియ్యము చూచుకొంద్రు, లో
గర్వము తక్కువే, యయిన
    గంద్రతనంబునఁ గానవత్తు, రా
యుర్వపురుజ్జ్వలుల్ బలస
    మున్నతు లెన్నఁగ నాంధ్రపుత్రకుల్."

తెలుఁగువారి స్వరూపస్వభావములతోపాటు భాషా కవితా గాన రీతులలోని ప్రత్యేక లక్షణములుగూడ పేర్కొనఁదగినవి. తెలుఁగువారి శబ్దోచ్చారము తక్కిన ద్రావిడుల యుచ్చారముకంటె సుందరమయినది. కనుకనే "తెలుఁగు తేట" అన్న నానుడి యేర్పడినది. తెలుఁగుదేశపు శీతోష్ణస్థితులు మంచివగుటచే తెలుఁగువారి ముఖముద్ర స్పష్టవికాసము గలది. వారి ఆహారవిహారములు బలిష్ఠము లగుటచే దృఢగంభీరరీతులు గలది వారి యుచ్చారము. వేదోచ్చారమున నాంధ్రద్రవిడులే భారతదేశమంతటికిని ప్రఖ్యాతిగన్నవారు. తెలుఁగుభాష కున్నన్ని యక్షరములు

తక్కిన యే ద్రవిడభాషకుఁగాని లేవు. తెలుఁగుపలుకులు ప్రాయికముగా అజంతము లగుటచే ప్రతిపదము విభిన్నముగా వ్యవహరింప వీలగును. ద్రుతపుచ్ఛము కొన్ని పదములకుండుటచే నది తర్వాతి యజాదిపదములతో సుఖసంధ్యుచ్చారము గూర్చునదై హృద్యతను గొల్పుచున్నది. గసడదవాదేశము, సరళాదేశము శబ్దముల సరళోచ్చారమును దొలఁగించుచున్నది. ద్రవిడపదములు యెచ్చు మెత్తదనముగాని, సంస్కృతపదముల ప్రౌఢ గాఢ క్లిష్ట వాక్చారములుగాని లేక, యెరవమెత్తదనమును, సంస్కృతపు బింకమును గొంతకొంత కూర్చుకొని, దేశీ తత్సమ తద్భవ పద పౌష్కల్యముతో తెలుఁగుబాస ద్రావిడభాషా కుటుంబములో లేఁబ్రాయపు బిలిబిలిపలుకుల పొలఁతియై వన్నెకెక్కినది. ఇటువంటి భాషాపరికరముగల తెలుఁగువారి కవితయు కొంత విశిష్టలక్షణములు గలది. తెలుఁగుకవిత ప్రాయికముగా సంస్కృతానుకారియేయైనను నందులో నెంతో విశిష్టతకూడ కలదు. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన యను కవిత్రయము గోదావరి, కృష్ణ, పినాకిని యను నదీత్రయము వలె తెలుఁగువారికి జీవనాధారమయినది. గోదావర్యాది నదీత్రయము శాఖోపశాఖలతో కాల్వలై పాయలై పాఱి తెలుఁగునేలనెల్ల పాడిపంటలతో సుక్షేత్రపఱిచినట్లు, కవిత్రయకవిత శ్రీనాథ పోతనాది సర్వాంధ్రకవి పరంపర యొక్కయు హృదయక్షేత్రములందు రసధార పాఱించి దివ్యకావ్యసస్యములను పండించినది; నేటి నవకవిహృదయ

క్షేత్రములందును వాఙ్మయము పండించుచున్నది. కవిత్రయము వారు వైదికభక్తులు, సదాచారులు, ఉత్తమపండితులు. వారి రచనలలో జుగుప్సితము, నీతిదూరము నగు కూర్పుతీరు కానరాదు. వారి దర్శనాదర్శములు సర్వాంధ్రకవులకు మాదిరికిని మేలుబంతియై సత్కావ్య సంప్రదాయము కొనసాగించు చున్నది. నన్నయ ధర్మోపాఖ్యానములు, నన్నిచోడని దేశి మఱుంగులు తెఱంగులు, తిక్కన మర్మకవితలు ఎఱ్ఱన కృష్ణ బాలక్రీడాది వర్ణనసౌభాగ్యములు, పోతన భక్తిరసామృత ధారలు, శ్రీనాథుని సుప్రౌఢపేశల రససౌందర్య వర్ణనా, శయ్యా సౌభాగ్య కల్పనా విధములు, పెద్దనతిమ్మనల మనోజ్ఞ ప్రబంధసృష్టులు, సూరన రామకృష్ణుల నవీన నిగమశర్మాది కథాకల్పనా విశేషములు, సోమ రంగనాథ గౌరనల ద్విపద రచనా సాహిత్యములు, సుమతి భాస్కర వేణుగోపాలాది శతకకవుల చమత్కారములు, వేమన్న వినోదవిమర్శపు చాటువెన్నెలలు తెలుంగువారికి నిస్సామాన్య సాహిత్య భాండాగారములు. తెలుంగువారి భక్తిమయ జీవితమునకు పోతరాజు, త్యాగరాజు, గోపరాజులు జీవగఱ్ఱలగు త్రిమూర్తులు. ఈ త్రిమూర్తులలో కడపటి యిద్దఱి గేయములు తెలుంగువారికమృతధారలు. తెలుంగు కవులలో ప్రాచీనులు కొందఱు తెలుంగుదేశముయొక్కయు, తెలుంగు ప్రజలయొక్కయు విశిష్టతను వర్ణించిరి. ప్రధానముగా శ్రీనాథుండు కాశీ భీమఖండములలోను, జక్కన విక్రమార్కచరిత్రలోను, సోమనాథుండు పండితారాధ్య

చరిత్రలోను, అజ్జరపు పేరయ ఉడయనంబి విలాసములోను ఆంధ్ర దేశ సౌభాగ్యమును వర్ణించినారు. అజ్జరపు పేరయకవి ఉడయనంబి విలాసములో ఆంధ్రప్రజలను గూర్చి వర్ణించిన వర్ణనలే కొన్ని యిప్పుడు వినిపించుచున్నాను—

"భామ విను శ్రీమదాంధ్రభూభాగమనెడు
తారహారంబునకు సొంపు దనరుచున్న
మధ్యమణి చందమున మహామహిమదాల్చె
భూరి విభవంబు బెజవాడ పురవరంబు.

క్రొత్తబియ్యము కాయగూర లొబ్బట్లు పై
దంపు బూరెలు పంచదార తోలలు
వడలు నల్లంబు మీఁగడల తియ్యని పెర్గు
కమ్మని సిరివాలు గసగసాలు
చిఱుసెనగపప్పును తఱచు పీడ్యంబులు
కంబళ్లు నంబళ్లు కంచుకములు
ఇంగువ జిలకఱ్ఱ నెనసిన మిరియంబు
మంచివాసన నెయ్యి మాటదురుసు
తఱచు రణశీల, మొప్పు గంధాక్షతములు
నంద మింపొందు శిఖలు, నొయ్యారి నడలు
కలిగి కాంతలు పురుషులు కలసి సిరుల
చెలఁగు నయ్యాంధ్రదేశంబు చెలువుగాంచె.

కదళీఫలంబులు ఖండశర్కరయును
పెనుపచ్చిపోకలు పనసతొలలు

మామిడిపండ్లు కమ్మని గోఘృతమ్మును
వంకాయ బెంకాయ వలుపు పప్పు
బహువిధభక్ష్యముల్ పరమాన్నమును బైల్లు
కంద పెండలములు కాయగూర
లమృతోపమానంబు లైన రసావళుల్
శాల్యోదనము పెర్వు సకల రుచులు
గలుగు నూరుఁగాయలు బానకములు నప్ప
డములు వరుగులు వడియముల్ శ్రమముదీర
ననుభవించిరి వేదశాస్త్రార్థవాద
ములకు నలరుచు కోనభూస్థలమునందు."

తెనుఁగుతనమును గూర్చి నా చిన్ని పద్దెము:

" ఆంధ్రభాష యమృత మాంధ్రాక్షరంబులు
మురువులొలుకు గుండ్రని ముత్తియములు
ఆంధ్ర దేశ మాయురారోగ్యవర్ధకం
బాంధ్రజాతి నీతి ననుచరించు."

౨

# ఆంధ్రభాషావతారము

అఖండస్ఫోటమై వెలయు శబ్దబ్రహ్మము ధ్వనితాదాత్మ్యధ్యాసచే నానా దేశములందు, నానా జాతి జనులందు బహుభాషలుగా, బహ్వర్థములతోఁ బరిస్ఫురించుచున్నది. ఆకసమునుండి మేఘ మతినిర్మలమైన యంబువును వర్షింపఁగా నది యుప్పఁబఱ్ఱులందు, రేవడి చెలికలందు, మహాషధీమయములగు నరణ్యములందు, రసధాతుభరితములగు పర్వతములందును బడి తత్తాదాత్మ్యముతోఁ భిన్నరూపములను, భిన్నరుచులను బొందుచు జాలువాఱి కోళ్లై, సెలయేళ్లై, వంకలై, వాగులై, నదులై, మహానదులై ప్రవాహములైన భేదములఁ బడయుచున్నది. భాషల పుట్టుపూర్వోత్తరములు గూడ నిట్టివే.

సహ్యపర్వతమునఁ దొలుత జాలువాఱుటలో సమాన లక్షణములు గలవై యున్నను కృష్ణా కావేరీ నదులు ఆంధ్ర దేశమునకును, అఱవ దేశమునకును సాగను సాగను విభిన్న లక్షణముల వెలసి వెలసి వేఱువేఱు తీరులను, పేరులను బడసినట్లుగా ఆంధ్ర ద్రవిడ కర్ణాట భాషలు తొలుత (ఆంధ్ర ద్రవిడ కర్ణాటులని నేఁడు విభిన్నులుగా నున్నవారొకప్పు డొక్కచోట నొక్క సంఘముగానుండి వెడలి వేఱు

పడినవారే యని నా నమ్మకము.) నొక్కటిగానే యుండి కాలక్రమమున భిన్నభిన్న దేశములం జెంది భిన్నభిన్నత్వములం బడసినవి. ఆంధ్రద్రవిడకర్ణాటభాషలు నేంటి స్వరూపము లెంత భిన్నములుగా నున్నను, పూర్వపూర్వమును బరిశోధించుచుం బోవనుబోవను వాని భేదములును దక్కువతక్కువ లగుచుండుట తెలియనగును. ఇట్లు చూడంగా రెండువేల యేండ్లకుం బూర్వ మీ భాషలు పృథగ్భావము విస్పష్టలక్షణములతో వెలసియుండక పోవుట గోచరించును.

వర్షోదకము నేలపైం బడినప్పుడు మట్టితోం గలసి వండువాఱి తేటదనము, తెలికదనము లేక కలుషమై, యస్వరసమై యుండునట్లు భాషకూడం దొలుత గ్రామ్యోచ్చారణాదులందుం దేటదనము, తెలికదనము, హృద్యత లేక క్లిష్టమై యుండును. కాలక్రమమున నా నీరు పల్లములోం గోళ్ళలోం బడి నదులై ప్రవహించుచుం దేటవాఱి నడుమ నడుమ గుంటలలోం గోనేళ్ళలో నిలుకడయందుట ప్రసన్నమై రుచ్యమై యొప్పును. అట్లు భాషకూడం గాలక్రమమున సాధూచ్చారసంస్కారమంది, అందందు గ్రంథములందు నిబద్ధమై నిలుకడమంది, స్వచ్ఛమై, యాస్వాద్యమై వెలయుచుండును. వ్యవహారప్రవాహమున భాష నడివడిగాం బరిణామ మందుచుండును గాని యట గ్రంథనిబంధము నందిన పిదపం గొంత కట్టుదిట్టమునుబడసి నిలుకడం జెందును. ఆవలం దత్పరిణామము పూర్వమంత త్వరగా సాగదు. ఆంధ్రద్రవిడ

కర్ణాటభాషల యారంభ మొక్కటియే యైనను, సంస్కృత ప్రాకృతసంబంధ మల్పముగాఁ బడసి గ్రంథములందు నిబద్ధమై నిలువరమంది లక్షణపరిష్కారములను బడయుటలో నఱవము మొదటి దయినది. ఆ నిలువరముమీఁదను, ఆ లక్షణపరిష్కారములమీఁదను నాఁగక ఇంకను గొంత యుచ్చారవ్యవహారముసఁ బరిణామమును బొందిపొంది సంస్కృతప్రాకృతముల సాహాయ్యము నధికముగాఁ జెంది చెంది పెంపొంది గ్రంథములందు నిబద్ధమైనది కన్నడము. ఈ రెండింటికింకను దర్వాత నీ రెండింటి లక్షణ పరిష్కారములతో నిల్వక యింకను నుచ్చారసంస్కారములఁ బడసి, నవరనయి యందచందముల నంది సంస్కృత ప్రాకృతముల పరసహాయ్యమున సభ్యచ్ఛ్రియముఁ గాంచి గ్రంథములందు నిబద్ధమైనది తెలుఁగు. దక్షిణహిందూదేశ సమష్టి దేశభాషావధూటి పసిప్రాయపుఁబలుకు లఱవము; ఎలప్రాయపుఁ బలుకులు కన్నడము; నెఱతనపుఁ బలుకులు తెలుఁగు. ద్రవిడ కన్నడములు తెలుఁగుకంటె వయసునఁ బెద్దవేకాని చిన్నదయినను తెలుఁగుభాషాకన్య కందచందములు, పలుకు పొంకములు హెచ్చు. అఱవ పదములకును దత్ప్రత్యయములకును, కర్ణాట పదములకును దత్ప్రత్యయములకును నుచ్చారణమునఁ దోఁచు కార్కశ్యము నాఁటనాఁటఁ దొలఁగి తొలఁగి సవరనయిన యుచ్చారణమును బడసిపడసి తెలుఁగు పదములును, బ్రత్యయములును వెలసినవి. ఉచ్చారణ సుందరములయిన తెలుఁగుపలుకుల పూర్వ పూర్వ పరి

ణామ క్రమదశలలో ద్రవిడకర్ణాటపదరూపములు రెండును గాని, రెండింట నేదే నొక్కటి గాని పొందియుండుట పెక్కు చోట్లఁ గాననగును.

పై యుభయ భాషా సంబంధము లేనివి యచ్చపుఁ దెలుఁగుఁబలుకులు, ప్రత్యయములు గొన్ని యున్నవి. ఇవియే కాక, సంస్కృతప్రాకృతోభయ భాషోచ్చారణ క్రమపరిణామములఁ బొందినవియు, ప్రాకృతమాత్రోచ్చారణ క్రమపరిణామములఁ బొందినవియుఁ గూడఁ బెక్కుపలుకులు, ప్రత్యయములు తెలుఁగునఁగలవు. ఇట్టివెల్లను గూడి సుకుమారోచ్చార సంస్కారములను బడసిపడసి వానికంటె వైలక్షణ్యమును బొంది మన తెలుఁగు వెలుఁగొందుచున్నది. మీఁదఁ బేర్కొన్న విషయమున కుదాహరణముగా నొక పదమును బరిశోధించి చూపుదును.

'నూనె'—ఈ పదము 'నూవు', 'నెయి' అను పదములల సమాసము. 'నూవులనెయి'—అనఁగా 'నూవుల సారము' అని అర్థము. ఇందు 'నూవు' అను పదము ద్రవిడ కర్ణాట భాషల సంబంధ మేమాత్రమును లేని యచ్చపుఁ దెలుఁగుఁబలుకు. నూవులకు అఱవమునను, గన్నడమునను 'ఎళ్' అని పేరు. 'నెయ్' అను పదము ద్రవిడమునను, కర్ణాటకమునను గూడఁ గలదు. కాని యది కర్ణాటకమున 'నే 'నేయ్' ఇత్యాది రూపములఁ గూడఁ బొందియున్నది. తెలుఁగున ఉచ్చారణపరిణామములలో నసుందరమయిన హాలంత

త్వము దొలఁగిపోయి 'నెయి', 'నెయ్యి', 'నేయి', 'నేయు', 'నై', 'నే' అను రూపములు వెలసినవి. 'నెయ్' అను రూపమునకంటె నీ రూపము లుచ్చారణ సుందరములు. తెలుఁగు భాష హలంతత్వము నేనగించును గాన 'నెయ్'ని అజంతముగాఁ జేసికొనుటలో 'ఇ'ని జేర్చుకొనఁగా 'నెయి' అయ్యెను. 'నెయ్' పదము అజాదిపదములు పరమయినపుడు 'నెయది' అను రూపము ఉచ్చారణసహముగాదు గాన, 'నన్ + అది = నన్నది', 'అన్ + అతఁడు = అన్నతఁడు' అను రూపము లందినట్లు, 'నెయ్యది' ఇత్యాది రూపములు నంది, అట్టి సంధినుండి పదచ్ఛేదముఁ బడయుటలో 'నెయ్యి' అను రూపమును బొందెను. ఏకలఘుపూర్వక హల్మాత్రము గల శబ్దములు ఉచ్చారణపుష్టి గలిగియుండవు గావున హలుచ్చారణబలము పూర్వహ్రస్వమునకుఁ దన్ని దానిని గురువునుగాఁ జేసి యంతలోఁ దాను గరఁగిపోనఁగా 'నే' అను రూప మేర్పడెను. ఆ కరఁగిన హల్మాత్ర యకారము అజాది పదములు పరమగునపుడు వానితోఁగలసి యకారముగా నిలువఁగల్గుచున్నది గాన దానిపై నజంతత్వపుఁ జికిలి జరగఁగా కొంత దుర్బలమయిన యుచ్చారముగల యకారముతో 'నేయు', 'నేయి' అను రూపము లేర్పడెను. హల్మాత్రమగు యకారము దుర్బలమగుటచేతనే 'నెయ్యి' అను రూప మేర్పడినట్లు 'నేయ్యి' అను రూపము పుట్టఁజాలక పోయెను. 'నెయ్'లోని 'య్' 'ఇ' గా మాఱఁగా 'నై' అను రూపము పుట్టెను. పైరూపములందు 'నేయి', 'నై' రూపము

లర్వాచీనములు. ఇట్లు 'నేయ్' శబ్దముపై నేర్పడిన బహు సుందరపరిణామము లెల్ల మన తెలుఁగునఁ గలవు. 'చెయ్, వెయ్' మొదలగు శబ్దములు గూడ నిట్టి పరిణామములఁ బొందెను. శబ్దముల ప్రాచీనరూపములకుఁ దాఁతలనాఁటివన్నె గౌరవముండఁగా నర్వాచీనరూపములకు హృద్య సంస్కారముల ననేకములఁ బడసి వెలసినవన్నె వేఱొక గౌరవ విశేషము గలదు. ఆంధ్రుల కాచారవ్యవహార స్వరూపస్వభావాహారదేశ లక్షణాది బహుకారణములచేఁ గల్గిన భిన్న భిన్న లక్షణముల కనుగుణముగా నేర్పడిన శబ్దరూపములను మీఁదఁ జూపితిని. 'నెయ్' శబ్దము తెలుఁగులో నిన్ని హృద్య రూపముల నందినది గాని యిది 'నూవు' శబ్దముతో సమాసమందినప్పుడు కొన్ని ప్రాకృతభాషాసంబంధ సంభవములైన వికారములకుఁ గూడఁ బాల్పడెను. 'నూవు' శబ్దము తొలుత 'నూవ్' అను రూపము గలది. తెలుఁగు హలంతత్వము నేవగించుకొనును గాన నది 'నూవు' అను రూపమును బడసెను. ఆ హల్మాత్రము కరఁగిపోవుటచే 'నూ' అను రూప మేర్పడెను. కరఁగిపోయిన యా హల్మాత్రమయిన 'వ్' అచ్చుపర మయినప్పుడు మరలఁ గానవచ్చును. 'నూ + నెయ్' పదములు రెండును సమసింపఁగా, 'నెయ్' పద మెన్ని రూపములతో నున్నదో, అన్ని రూపములతోను ఆ సమాసముండుట న్యాయ్యము. అనఁగా 'నూనెయి', 'నూనెయ్యి', 'నూనే', 'నూనేయి', 'నూనేయు', 'నూనై' అను రూపములు గూడ నుండవలెననుట. కాని యట్టిరూపములు తెలుఁగున

పుట్టలేదు. దానికిఁ గారణ మేమనఁగా: 'నూనె'యను సమాస పదము 'నెయ్' పదము మీఁదఁ జేర్కొన్న పరిణామముల నెల్లఁ బడయుటకుఁ బూర్వమే పుట్టి రూఢమైనది. అప్పుడు 'నూ + నెయ్' అని యుండి తెలుఁగునకుఁ బ్రియముకాని కడపటి హల్మాత్రము లోపింపఁగా సమాసదశలో నాపదము గురులఘు ఘటితమగుటచే 'నెయ్' 'నే' రూపమును బడయ నక్కఱలేకపోఁగా 'నూనె' అయ్యెను. కరఁగిపోయిన కడ పటి హల్మాత్రపు 'య్' అచ్చుపర మయినపుడు మరలఁ గానవచ్చెను గాన 'నూనె' + 'అది' కలసినపుడు 'నూనె యది' అయ్యెను. ఇట్టి యకారమునే తెలుఁగువైయాకరణులు 'యడాగమ' మని పేర్కొనిరి. ఇట్లు 'యడాగమ' మని పేర్కొనఁబడుచున్న స్థలము లనేకము లట్టి పదాంత యకార హల్మాత్రము ద్రవించిపోఁగా నచ్చు పరమయినపుడు మరలఁ గానవచ్చుటను బట్టి యేర్పడినవే. అట్టి దేశి శబ్దముల రూప సాజాత్యమును బట్టి యకారపుచ్ఛము లేనివయినను తెలుఁగునఁ జేరిన సంస్కృతప్రాకృత శబ్దములకును నట్టి యడాగమము పుట్టెను: 'రమ + అది = రమ యది' ఇత్యాదులు.

పైనిఁ జేర్కొన్నవిధమున నూనె పదము తెలుఁగు సంప్రదాయపరిణామమును బట్టి పుట్టియుండఁగా దాని మీఁద 'నూనియ' అను రూపము ప్రాకృతభాషా సంప్రదాయమునుబట్టి పుట్టెను. 'కన్నియ' 'వన్నియ' 'దీవియ'

మొదలయిన శబ్దములు కన్యకా, వర్ణక, దీపికా శబ్దాదుల నుండి ప్రాకృత సంప్రదాయమును బట్టి పుట్టి తెలుఁగునఁ జేరినవి. వీనికి 'కన్నె' 'వన్నె' 'దీవె' రూపములును గలవు. వీని పోలికనుబట్టి 'నూనె' శబ్దమునకుఁగూడ 'నూనియ'అను రూపము వచ్చెను. నూనె,నూనియ శబ్దములు పుట్టినతర్వాత వాని సాదృశ్యముచే 'తేన్' అని యఱవమున రూపముగల 'మధు' వాచక శబ్దము తెలుఁగున 'తేనె', 'తేనియ' అను రూపములఁ జెందెను.

ద్రవిడ కర్ణాట ప్రాకృత భాషల పలుకుబడి నూనె శబ్దముమీఁద నెంత చెల్లెనో పై పరిశీలనమువలనఁ దెలియ వచ్చెను. కాని యిందు సంస్కృతపు పలుకుబడి కూడ హెచ్చుగాఁ గలదు. ఎట్లనఁగా 'నెయ్' అను పదము దేశి పదమని కొందఱన్నను 'స్నేహ' మను సంస్కృతపదము నకు వికృతియని కొందఱందురు.

ద్రవిడ భాషలో 'నెయ్' పదము 'సారము' అని యర్థముగలది. క్షీరములనుండి యెత్తిన సారమగు ఘృతము నకే తర్వాత నది రూఢమయినది. 'నూనె' యను సమాస మునఁ జేరుటచే నెయ్ 'స్నేహ' వాచకమైనది కాని యది స్నేహశబ్ద వికృతికాక దేశిపదమే యగునని కొందఱు.

మఱియు, నూనె యను నర్థముననే సంస్కృతమున 'తైల' పదము గలదు. తైల పదము శబ్ద నిష్పత్తిని బట్టి నూవుల సారమునకే వాచకమయినను స్నేహసామాన్యము

నకును చెల్లుచున్నది. తిలతైల, ఐరండతైల, భల్లాతక తైలాదులు చూడఁదగును. నూనెపదము గూడ నిట్లే తిల స్నేహవాచకమే యయినను, స్నేహసామాన్యమునకును జెల్లుచున్నది.

నూవులనూనె, కొబ్బరినూనె, వలిసెలనూనె ఇత్యాదులు చూడఁదగును. అఱవమునఁ గూడ నూనెకు 'ఎళ్నెయ్' 'ఎణ్ణెయ్' అని పేరు. అదికూడ స్నేహసామాన్యవాచకమే. 'తేఙ్గాయెణ్ణెయ్' ఇత్యాదులు చూడఁ దగును. నూనెపదము తైలపదమువలె తిలస్నేహ వాచకముగానే పుట్టుట, అది స్నేహసామాన్యమునకు వాచకమగుట సంస్కృతభాషా వ్యవహార సంప్రదాయ సంస్కారమును దెలుపుచున్నది.

# 3
# ఆంధ్రకల్పవృక్షము

నా చిన్ననాఁటి మాట. మా గ్రామమున ఒక సంపన్న గృహస్థుఁడు తన గొప్ప తాటితోఁటను నఱికించి, ఆ తోఁటభూమికి కృష్యనుకూలత కల్పించినాఁడు. ఏమి కర్మమో కాని కొలఁదికాలమునకే యాతని యింట నమంగళము లనేకములు కలిగినవి. ఊరి పెద్దలందఱు "తాటిచెట్టనఁగా భూలోక కల్పవృక్షము. అట్టి తాటిచెట్లను ఎన్నింటినో, ఎన్ని తరాలనాఁడు నాటినవానినో నఱికించినాఁడు; చెడినాఁడు" అన్నారు. నేను పదేండ్ల బాలుఁడను. మా నాయనగారిని "ఇంకను కొబ్బరి చెట్టునో, మామిడి చెట్టునో అంటే అనవచ్చునేమో కాని తాటి చెట్టును 'భూలోక కల్పవృక్ష' మనుట యేమిటి" అని అడిగినాను. ఆనాఁడు వారు చెప్పిన విషయమునే ప్రధానపఱుచుకొని, యిటీవల దానికి ప్రోద్బలకముగా నాకు గోచరించిన విషయములను కూడ చేర్చుకొని యీ వ్యాసము రచించుచున్నాను.

పూర్వము ఆంధ్రదేశమున ప్రతిగ్రామమునను తాటితోఁపులు ధర్మార్థము తప్పకుండ నాటు సంప్రదాయ ముండెడిది. ఊరి పెద్దలు ఎనుబది తొంబది యేండ్ల ముసలిప్రాయము కలవానిని వెదకి పట్టుకొని వానిచే తాటిగింజలు నాటించువారు. ఆ నాటినవాఁడు నాటిన త్రాడి కాపుపట్టులోఁగా

తప్పక చనిపోవుననిప్రతీతి. నాటిన తాటిచెట్టు ఇర్వదైదేండ్లకుఁ గాని కాపు పట్టదు. నాటినవాఁ డంతదాఁక జీవింప వీలులేని వాఁడు గావుట కంత ముసలివానిని వెదకువారు. "ముత్తాడి" అనఁగా మూఁడు తాటిచెట్ల తరములు చూచినవాఁడు. వాఁడు దీర్ఘాయుష్మంతుఁడు. తన మొలకలో నాటిన తాటి మొలక పెరిగి, పండ్లు పండి, ఆ పండ్ల గింజలను మరల నాటి, అవి పెరిగి పండ్లు పండి, వాని పిత్తనములను మరల నాటి అవి పెరిగి పండ్లు పండుటకు, వాని ననుభవించుటకు మను ష్యుఁడు దీర్ఘాయుష్మంతుఁడు కావలెను. మంచిపంటలు పండని, నీటివసతి లేని మెగుమదిగుడు నేలలుకూడ తాటితోఁపులకు పనికివచ్చును. నాటిన తాటిమొలకలకు నీళ్లు పోయనక్కఱ లేదు. మొక్క లెదుగుదాఁకనైన కాపు కాయనక్కఱలేదు. తక్కువ నేలలోనే దగ్గఱదగ్గఱగా ఎక్కువ మొక్కలు నాటవచ్చును. పిత్తనము నాటినది మొదలుగా కాపుపట్టిన దాఁక కూడ వానికై ధనవ్యయము ఏమియు చేయనక్కఱ లేదు. నాటిన తర్వాత రెండుమూఁడేండ్ల నుండి ఆకులు, మట్టలు మొదలగువాని వలని యుపయోగము లుండును. పూర్వకాలమున నొక గృహస్థుఁడు కొన్ని తాటి చెట్లు కల వాఁడైతే కట్టు బట్టతప్ప తక్కిన జీవితావశ్యక వస్తువు లన్నియు తాటిచెట్లనుండి సేకరించుకొని జీవయాత్ర గడపుకోఁ గలుగువాఁడు. కాపురమునకు నిట్రాడుగుడిసె వేసికొన్నచో తాడి దూలము నిట్రాడవును! గోడలు పెట్టి కట్టు ఇల్లైనచో తనాబీలు, దూలములు, స్తంభములు, కొమరులు, గుజ్జులు,

వాసాలు, పెండెలు అన్నింటికి తాటిమ్రాను పనికివచ్చును. పైకప్పుకు తాటియాకులు పనికివచ్చును. కట్లు కట్టుటకు తాటినార పనికివచ్చును. ఇంట పఱచుకొనుటకు తాటి యాకు చాపలు, సామానులు నిలువచేసికొనుటకు నానా రకాల పెట్టెలు, బుట్టలు తాటియాకులతో చేయవచ్చును. నీళ్లు చేదుకొనుటకు తాటియాకుతో బొక్కెనలను చేయ వచ్చును. తాటినార చేత్రాళ్లు మొదలగు త్రాళ్లు పేనుట కుపయోగపడును. తాటి మ్రాకులను రెండుగా చీల్చి నీళ్ళు పాఱుటకు దోనెలుగా చేయవచ్చును. ఈనెలు తీసి కోసి కుట్టిన యాకులు విస్తళ్లుగా నుపయోగింపవచ్చును. తాటి ముంజెలు, తాటి పండ్లు, తాటి (నిలువచేసిన పేసము) చాప, బుర్ర గుంజు, తాటి తేగలు, తాటి బెల్లము, తాటి కల్కండ, తాటి పానకము, తాటి కల్లు ఆహార పానీయములక్రింద పనికి వచ్చును. తాటిపండ్లు శిష్టులు ఆహారముగా నుపయోగింప రాదని నేఁటివారు కొందఱందురు. కాని దానికి ప్రమా ణము నే నెఱుఁగను. మున్యాశ్రమములలో మునులు తాటి పండ్లను ఫలాహారముగా నుపయోగించువారనుటను కాదం బరిలోని యీ క్రిందివాక్యము నిరూపించుచున్నది. జాబాలి మహర్షి యాశ్రమవర్ణనమున "ఉటజాజిరప్రకీర్ణ శుష్యచ్ఛ్యా మాక ముపసంగృహీతామలక, లవలీ, లవంగ, కర్కంధూ, కదళీ, లికుచ, చూత, పనస, తాళఫల మధ్యయనముఖర వటుజన" మిత్యాది.

తాటిమ్రానిి తుండ్లు అటిటోళ్ళపై కుందులుగా నుప యోగపడును. తాటియాకులతో గొడుగులు గావింతురు. తాటి యీనెలు, జవటలు, జీబులు చీపుళ్ళగును. గులక చండ్లు, ఎండు మట్టలు, జీబులు మొదలగునవి యెల్ల వంట చెఱకున కుపయోగపడును. ఈ పేర్కొన్న యుపయోగము లెల్ల పామరనాగరకసాధారణ మైనవి.

ఇఁక తాటిచెట్టు ప్రాచీనాంధ్రుల నాగరకతకు జీవ రక్ష. ఆంధ్రుల విద్యావిజ్ఞానములెల్ల తాళపత్రగ్రంథ రక్షిత ములై యున్నవి. తాటియాకులను చక్కఁగా నీనెలు తీసి చుట్టలు చుట్టి పేడనీళ్లలో తేలికగా నుడుకనిచ్చి నీడనార్చి నేఁడు కాగితముల రీములు నిల్వ చేసికొన్నట్లు పూర్వులు గ్రంథములు వ్రాసికొనుటకై ' అలేఖము ' లను పేర నిలువ చేసికొనెడివారు. జాబులను, భారతభాగవతాది గ్రంథము లను వ్రాయుటకు నీ తాటియాకుల నుపయోగించువారు. శతాబ్దములదాఁక నీ తాటాకు గ్రంథములు చెడిపోక యుండె డివి. 'జాబు'కు 'కమ్మ' అను పేరు తాటియాకునుబట్టి వచ్చి నదే. ఈ తాటాకులను స్త్రీలు కర్ణాభరణములుగాను, కంఠా భరణములుగాను (మంగళసూత్రము), చేతులలోను జబ్బల లోను మంత్రాక్షరములు గల రక్షాబంధములుగాను పూర్వు ముపయోగించువారు. 'తాటంక' పదమునకు పాణిని సూత్రములలో నిష్పత్తిలేదు. తర్వాత'ఉణాది'సూత్రములలో దానికి వింతగా నిష్పత్తి కల్పింపఁబడినది. తిరుపతిలో కపిల

తీర్థాది పుణ్యతీర్థములందు సువాసినులకు మూసివాయనము లిచ్చునపుడు ఆ మూసివాయనపు సామగ్రిలో తాటియాకుల చుట్టలనుగూడ ఉంచుదురట! ఆ చుట్టలు కంఠ, కర్ణాభరణ స్థానీయములు.

ఇవి గాక యింక నెన్నెని ప్రయోజనములను మన పూర్వులు తాటిచెట్టువల్ల పడయువారు. తాటిచెట్టు (నేడు కాకపోవచ్చుఁగాక) పూర్వకాలమున తెలుఁగువారికి కల్ప వృక్ష మనుట సంగతమే కాదా ?

ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశములో తాటిచెట్టు నిట్లు వర్ణించినాఁడు.

"వ. అప్పుడు—

శా. కాలాహుల్ బుజుతావిచిత్రయగు భో
గశ్రేణి శోభిల్లఁ బా
తాళం బాక్కట నిర్గమించి వికస
ద్దర్వీవికాసంబుతోఁ
గేళిం గ్రాలెడినో యనంగఁ దనువుల్
గృష్ణంబులై యొప్పఁగా
ఖేలన్మూర్ధము లైన తాళతరువుల్
కృష్ణుండు వీక్షించుచున్.

మ. క్రమపాకంబునఁ గెంపుతోడి నలుపై
కన్నిక్కుటంబైన గం

థము దిక్కుల్ సురభీకరింప రస మం
తర్గామియయ్యు న్వెలిం
గమియం గాఱుచునున్న చొద్పున విలో
కప్రీతి గావింప హ్యా
ద్యములై యున్నవి చూచితే ఫలము లీ
తాళద్రుమశ్రేణులన్.

తే. వీని నింపార గోవులు నేను గూడి
మెలమి యొలయ నాస్వాదింతు మెంత యేని
వేడ్క యయ్యెడు రాల్పుము వేగవేగఁ
బ్రాఁకి నీ లావు వెరవును భాసితముగ.

క. ఎక్కఁ దడవు తాడుల మొద
లక్కజముగఁ బట్టి యూఁతు నవె యేఱికొనుం
డెక్కుడుగఁ బండ్లు మీ రొ
క్కొక్కని గుడువంగఁ జనుచు నుద్ధతలీలన్.

తే. ఒక్క తరవాయి దొరఁకొని యొకటి నొకటిఁ
బృథుభుజాదండములఁ బట్టి పెలుచ నూఁచెఁ
బెలుక విఱువను నొల్లక యులుక వన్య
హస్తి నిజహస్తమునఁ జెరలాడునట్లు."

తాటిపంటిని గూర్చి శ్రీనాథుని పద్యమొక్కటి—

గీ. "సంజకెంపును దిమిరపుంజంపు నలుపు
గమియ బ్రహ్మాండభాండంబు గరము మెఱసె

పరమపరిపాకదశ వృంతబంధ మెడలి
పతనమగు తాటిపంటితోఁ బ్రతిఘటించి."

తాటితోఁపుల వెలయించుట మహాపుణ్యకార్యముగా ప్రాచీనులు తలఁచిరనుటకు ఆర్యూ రేండ్లనాఁటి శాసనములు రెండు :—

(దక్షిణహిందూదేశ శాసనముల ౬-వ వాల్యూంలో ౨౫౮ పేజీ).

౬౭౮ నెం. పిఠాపురము శాసనము:—

"...తల్లి ధరణి, మొదలుగాన యీ తాటి యెవ్వరు నాంటిరి వారు భూమి ప్రజలకు బుద్ధిన్ని మతివిశేషమున్ను ధర్మమున్ను చెలుకుదురుగాను యీ తాడాకులనే పంచాంగములు, పురాణములు, శాస్త్రములు ధర్మకర్తలు వ్రాసి చదువంగాను అందున్నుండుంగాని బుద్ధిమాంటలం జెప్పరాదు గాన సకళధర్మాలకున్ను తాంటివృక్షమే మూలము."

(అదే పేజీలో ౬౭౫ నెం. శాసనము)

"సీ. నిండె నెవ్వనికీర్తి నిఖిలలోకంబులఁ
జంద్రికా విస్ఫార సాంద్రగరిమ
ఉండె నెవ్వనియింటఁ బుండరీకాక్షుని
ప్రాణవల్లభమైన పద్మనయన
పండె నెవ్వని కృపాపాథోధి నిలయెల్ల
ధాన్యసంపూర్ణ వదాన్యయగుచు

మండె నెవ్వాని కోపమహిమానలంబుచే
    నరివీరగేహంబు లక్షణంబు

అనుచుఁ గొనియాడుదురు నిన్ను నఖిల సభల
వేమభూపాల కారుణ్య విమలపాత్ర
ప్రబల కర తేజ వాసయ ప్రభూతనూజ
మనుజదేవేంద్ర పోతకుమారచంద్ర!

సౌమ్య సంవత్సరం మొదలుగాను పిఠాపురపు (సీ) మ [అ?] రస్తున్ను కుక్కుటేశ్వరంవాడ గయపట్టుగాన యిది పుణ్యభూమి అని "చత్వారి పుణ్యతీర్థాని దుర్లభాని దురాత్మనామ్, కేదార మర్కటీర్థంచ ప్రయాగః కుక్కుటే శ్వరః" ఈ పుణ్యస్థలమందును [శివ] లింగమున్ను సూర్య దేవ...యాగలింగమున్ను వారణాసి విశ్వేశ్వరలింగమున్ను గవిరి దేవ [త]ను సహితమైన ప్రతిష్ఠలు అయిదు చేయించి ఆళ్ళు కట్టించెను. ద్వాపరయుగమునాండు గొంతిదేవి ప్రతిష్ఠగాన మాధవయ్య నగరు సున్నము చేయించెను. లక్ష్మి దేవమ్మను ప్రతిష్ఠచేయించి ఆనగరు కట్టించెను. నాలుగు లక్షలున్ను అఱువై వేలు తాళ్లు నాటించెను. ఇటు వంటి ప్రతిష్ఠలున్ను, విష్ణుప్రతిష్ఠలున్ను చేయించిన పుణ్య పురుషుడు గాన వాసిరెడ్డి పోతినేండు జేయును (జ) దేవేం ద్రుండవును——        మంగళమహా శ్రీ శ్రీ."

# ౪

# ప్రాచీన గ్రంథముల పలుకుబడికి మనపై చెల్లుబడి

కవిత్వము, సంగీతము, నృత్యము, చిత్రరచన ఏ దేశములో ఏజాతిలో పెంపొందుచుండునో ఆ దేశము, ఆ జాతి పాపప్రవృత్తులకు దూరమై ఉండునని, భగవదనుభూతికిఁ దగిన పరిపాకముగలదై ఉండునని విజ్ఞులందురు. తెలుఁగుజాతి, తెలుఁగు దేశము పై కళలలో ముందడుగు వేయుచున్నదనియే నా నమ్మకము.

భారతదేశములోని అన్ని దేశభాషల సాహిత్యములును సంస్కృతభాషాసాహిత్యసంపద నాస్వాదించి జీర్ణించుకొని పుట్టి పెరిగినవే. మన తెనుఁగు సాహిత్యవాహినిలో కూడ తెలుఁగునాటి వారి పలుకుల తీరులు, తలఁపుల తీరులు, కూర్పుల తీరులు, ఫణితుల తీరులు ఊటలూరఁగాఊరఁగా స్వతంత్రరచన లను సొనయేళ్లు కొన్ని జాలువాఱుచున్నను, సంస్కృతసాహిత్య ప్రవాహముకూడ అందులో ప్రధానముగా సాగుచునే ఉన్నది; నేఁటికిని, రేపటికిని ఉండఁగలదు.

'వెన్నవలెం గరంగు సుకవిత్వము' చెప్పినవారు శ్రీ శివశంకరశాస్త్రిగారు 'వకుళమాల' అని హృద్యకావ్యము

నొకదానిని కూర్చినారు. ఆ వకుళమాలలోఁగూడ భట్టు మూర్తిగారి యీక్రిందిపద్యపు సువాసనగుబాళించుచున్నది.

కమనీయద్యుతిధామమా విమలముక్తాదామమా సేమమా
కమలామోదకు, తత్సఖీసమితికిం గల్యాణమా తన్మరా
ళ మయూరీ శుకశాబశారికల కెల్లన్ భద్రమా తెల్పుమా
ప్రమదారత్నము పేరుగా నెద నిన్నున్ బాటించి ప్రార్థించెదన్.

కాళిదాసకవి మేఘసందేశమని క్రొత్తతీరు కావ్యము రచింపఁగా, హనుమత్సందేశమును మనసులో ఉంచుకొని రచించె నన్నారఁట నాఁటి విద్వాంసులు.

నన్నయభట్టుగారు మొదలుకొని చిన్నయసూరిగారి దాఁక ఎన్నికగన్న ఆంధ్రకవులు రచించిన ప్రబంధముల పలుకుబడి విద్యావివేకములు గల యాంధ్రప్రజల హృదయములపై విశేషముగా సాగుచున్నది.

రాములు, లక్ష్మణులు, భరతులు, రావణులు, విభీష ణులు, సీతలు, కౌసల్యలు, కైకలు, మందరలు, ధర్మరాజులు, ఉత్తర కుమారులు, ప్రహ్లాదులు, హిరణ్యకశిపులు, గుణ నిధులు, నిగమశర్మలు, వరూధినీప్రవరులు, కరటకదమనకులు, సుగాత్రీశాలీనులు, ఆషాఢభూతులు, కీలోత్పాటులు మొద లగువారు పురాణపురుషులు, ప్రబంధపురుషులు నేఁడును అనేక స్థలములలో అనేకులు గుర్తింపఁబడుచున్నారు.

సామెతలు గ్రంథములలోని కెక్కినట్లు గ్రంథముల లోని పద్యములుకూడ లోకవ్యవహారములలోని కెక్కినవి.

అసలు ఆంధ్రప్రజల నిత్యవ్యవహారములలోనే కవిత్వగానములు కలగలుపైయున్నవి. ఆంధ్రభాష పుట్టుకయే కవితాగానాత్మకము.

వినాయకచతుర్థి, నవరాత్రములు అను పండుగ నాళ్ళలో బాలకులచే పద్యములు పాడించుట, ప్రబంధములు చేతఁబట్టించుట నే నెఱుఁగుదును.

ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయములెల్ల వందిగణమై బ్రహ్మాండ మాగారమై
సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై
వరుసన్ నీ ఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా.

ఇత్యాది పద్యములు నేను చాల పసిప్రాయమున నేర్చుకొన్నవి. వివాహములలో రుక్మిణీకల్యాణ పద్యములను ముత్తయిదువలు ఆనందభైరవిరాగములో నాలాపించుచుండుట అనేకు లెఱుఁగుదురు. బడిపిల్లలు వాటపద్యాలు, ఆటవిడుపు పద్యాలు అను పేర ప్రబంధ పద్యములు వల్లించుట పల్లెటూళ్లలో పరిపాటి. పెళ్ళిళ్ళలో వరునిచేత తాటాకుల మీఁద, ఇటీవల కాగితాల మీఁద 'శ్రీయును కులమును రూపము ప్రాయము శుభలక్షణంబు'—ఇత్యాది పద్యములను వ్రాయించుట ఆచారము. తెల్లవాఱుగట్ల ప్రబంధముల లోని దశావతారపద్యములను పలువురు పల్లెటూళ్ళలో పారాయణము చేయుచుందురు. రంగనాథ రామాయణద్విపదలే రామాయణపు బొమ్మలాటలలో తోలుబొమ్మలాట వారు

పాడు పాటలు; కనుకనే పల్లెటూళ్ళలోవారు రంగనాథ రామాయణమును బొమ్మలాటరామాయణ మనుచుందురు. శైవులు శుభాశుభ సమయములలో బసవపురాణమును పారాయణ చేయుదురు. వానలులేనప్పు డూరిపెద్దలు విరాట పర్వమును పురాణము చెప్పింతురు. ఇవి సాహిత్యప్రయో జనములకే కాక మతసంప్రదాయ వ్యవహారప్రయోజన మునకై కూడ ఏర్పడిన ఆచారములు.

పాత్రసంశుద్ధి కాజ్యంబు పరిస్తరించి
యూరకుండిరి యిది యేమియొక్కొ వీరు
కానరా విఘ్న శాకపాకములు నేదుర
మనకు నిజమయ్యె నల చందమామఘుటిక.

శ్రీనాథుని భీమఖండములోని పయి పద్యము 'చంద మామ రావే, జాబిల్లి రావే' అన్న పసిబాలకుల పాటనుబట్టి పుట్టినది.

బాలకుల పాటతో పై పద్యార్థము మిళితమై ఉన్నది.

నా చిన్ననాఁటి ముచ్చట ఒకటి: ఏదో అల్లరి చేయఁగా మాయమ్మ నన్ను గట్టిగా కొట్టినది. నేను ఎక్క డనో ఉన్న మా నాయనగారిదగ్గఱ కేద్చుచు వెళ్ళితిని. నా గోడవ వెళ్లబోసికొంటిని. నే నిఁక ఇంటికి రావంటిని. 'అమ్మ ముఖము చూడనంటిని.' కాశీఖండములోని గుణనిధి కథ చెప్పి మా నాయనగారు అందలి పద్య మిది చదివి వినిపించి అర్థము చెప్పిరి.

అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం బొడతేర గిన్నెలో
పెరుగును వంటకంబు వడపిందెలునుం గుడువంగఁ బెట్టు ని
ర్భరకరుణాధురీణ యగు ప్రాణము ప్రాణము తల్లి యున్నదే
హారహార యెవ్వరింకఁ గడుపారసి పెట్టెద రీప్సితాన్నముల్.

అమ్మప్రేమ ఆకళింపునకు రాఁగా తలగోఁకుకొనుచు ఏడుపు దిగమ్రింగుకొని నే నింటికి వచ్చితిని.

తెలుఁగు రచన అనఁగా చిన్ననాఁటనుండియు నాకు బులుపాటము. తెలుఁగు పద్యములు వినుటకై చెవి కోసికొనువాఁడను. గుజ్జనగూళ్లతోఁ పాటు తెలుఁగురచనల తీయఁదనమునుగూడ మా నాయనగారు నన్నాస్వాదింపించినారు. మా తోఁబుట్టువును అత్తవారింటికి అనిపిన సందర్భమున ఒకనాఁడు శ్రీనాథుని శృంగారనైషధములోని ఈ క్రింది పద్యము చదివి అర్థము చెప్పినారు:

ఉభయవంశలలామ మయ్యుత్పలాక్షి
అత్తవారింటి కరిగెడు నవసరమున
మాతృజనక సఖీజన భ్రాతృవిరహ
మధిపతిప్రేమ జలరాశి కౌర్వమయ్యె.

అర్థ మాలోచించినకొలఁది ఈ పద్యము నా కానందము గొల్పసాగినది. శ్రీనాథుని రచనలమీఁద నాకు చిన్ననాఁటనుండియు ఆదర మిట్టి పద్యములు వినుటచేత నే.

ఈనడుమ మా యింట నొక వివాహము జరిగినది. భోజన సమయమున నసాళమంటు తాళింపు పొగరుగల పెరుగు పచ్చడిని ఆస్వాదించి సవ్యాంధ్రకవిమిత్రు లొకరు చదివినా రీ శృంగారనైషధపద్యమును:

మిసిమిగల పుల్లఁబెరుగుతో మిళితములగు
నావపచ్చళ్లు చవిసూచి రాదరమున
చుఱ్ఱుమని మూర్ధములు దాఁకి యొఱ్ఱఁదనము
పొగలు వెడలింప నాసికాపుటములందు.

ఇరువది యేండ్ల క్రిందట ప్రాచీనగ్రంథ సంపాదనకై తెలుఁగుదేశము ఊరూర 'టూరు' చేయుచు చాలకాలము విద్వద్గోష్ఠి జరిపినవాఁడను గనుక, ప్రాచీన గ్రంథార్థముల పలుకుబడి పల్లెటూళ్లలో ఎంత చెల్లుబడిఅగుచు ఉన్నదో నేను ఎఱుఁగఁగల్గినాను. కొన్ని యెఱుకలు వివరింతును.

ఒక సంపన్నగృహస్థునియింట ప్రాచీన గ్రంథములున్నవని విని అడిగి ఆహూతుఁడనై వారియింటికి వెళ్ళితిని. ఆ యింటి యజమానునికి ధర్మపత్ని సమానురాలు, కళావంతురాలు, ప్రేయసి ఇంటనే ఉన్నది. నే నక్కడికి వెళ్ళఁగానే ఆమె మనుచరిత్రలోని యీ క్రింది పద్యమును సాదరముగా, సంగీతముతో, సముచితహస్తాభినయముతో చదివినది.

వానిది భాగ్యవైభవము,
వానిది పుణ్యవిశేష, మెమ్మెయిన్
వాని దవంధ్యజీవనము,
వానిది జన్మము వేలుసేయ కొ
వ్వాని గృహాంతరంబున భ
వాదృశ యోగిజనంబు పావన
స్నానవిధాన్న పానముల
నంతసమందుచుఁ బోవు నిచ్చలున్.

నే నన్నాను: "తల్లీ నన్నొక యోగిని జేసితివి. తంటాలేదుగాని, నీ వల్లభుని వాస్తవప్రవరునిగాఁ జేయుట సందర్భపడలేదమ్మా! —"

ఆమె అన్నది: "అయ్యగారూ! నేను ప్రేమించినది వాస్తవముగా వాస్తవప్రవరునివంటివారినే. నా యేకాంత ప్రేమకు వశ్యులయిన యీ సహృదయులుకూడ వాస్తవ ప్రవరులనియే అనుకొనుచున్నాను. అయ్యో! పాపము! వరూథిని మాయాప్రవరుని ఎఱుఁగనే యెఱుఁగదు గాదండీ! ఎంత ద్రోహము!

అయ్యా, ఇది చిత్తగించండి!

సీతాదేవిని రావణాసురుఁడు రామవేషము వేసి కొనివచ్చి అమాంగళ్యపఱిచినట్లు ఏ కవి అయినను కథ కట్టి నచో విజ్ఞుల కందరికిని వెఱ్ఱులు, వేకులు ఎత్తవండీ! అంత

రోతగానేకాదండీ ఉన్నది యిక్కడి సందర్భమూను! ప్రవరుని మీఁదనే ప్రాణములూర్చించి ఉన్న వరూధినిని, అంతకుముం దామెను ప్రేమించి ఆమెచే ఛీఛీ అని చీవాట్లుతిన్న దొంగ ప్రవరవేషముతో వచ్చి చేటుకూర్చుట చండాలముగా లేదండీ! వరూధిని వెలయాలందురు! ఆమె ప్రవరుని ఏమి వెలకయి ప్రేమించినది! వేషధారి ప్రవరుఁడు ఏమి వెల యిచ్చి ఆమెను కొనుక్కొన్నాఁడు! ఆంధ్రకవితాపితా మహుని అనుగ్రహము ఆట్లున్నదే!" అన్నది.

నేను "చాల చుఱుకుగా ఉన్నదే సల్లాపము" అనుకొనుచు, "సంస్కృతము బాగుగా చదువుకొన్న ట్టున్నావమ్మా" అన్నాను.

"మా నాయనగారు విద్వాంసులు. వారు నేర్పఁగా కావ్య నాటకములు కొన్ని చదువుకొన్నానండీ!" అనుచు నామె కాళిదాసు కవీంద్రునిమీఁదకూడ కంకరరాళ్లు విసర సాగినది.

"చూడండి! శాకుంతలములో దుష్యంతునికి రంగ ప్రవేశము ఎంత సంతాపజనకముగా ఉన్నదో.

"తానేదో వేఁటకువచ్చినాఁడు. ఆశ్రమమున కణ్వ మహర్షి లేఁడు. ముగ్ధలు ఋషికన్యలు చెట్లకు నీళ్లుపోయు చున్నారు. అక్రమముగా ఆశ్రమప్రాంతమునకు వెళ్ళి, ధీరో దాత్తుఁడుగా పొగడ్తగాంచవలసిన మహారాజు దొంగ

చాటుగా నక్కి ఉండి ఆకన్యలను తొంగిచూచుట, 'సతాంహి సందేహపదేషు' అని తన తప్పును ఒప్పునుగా తానే పొగడు కొనుట మర్యాదగా ఉన్నదండీ! శకుంతల ముఖాన తుమ్మెద వ్రాలఁగా ఆపన్నురాలిని రక్షించి రాజధర్మము నెఱపఁ బోవుచున్నట్లు దర్పాలు పలుకుకొనుచు వంకరతలఁపుతో రంగప్రవేశము చేయుట బాగుగా ఉన్నదండీ?" అన్నది.

నే నిఁక శ్రుతి మించుచున్నది అనుకొని నంస్కృతాంధ్ర రచనలలో ఆమెకుఁగల సాహిత్యచాతుర్యమునకు సంతోషము వెల్లడించి వచ్చినాను.

ఇంకొక ముచ్చట.

ఒక పూరియిల్లు; చిన్నది; తలుపు ఓరవాకిలిగా వేసి ఉన్నది. లోపల ముసలమ్మ వడ్లు దంచుచున్నది. రోఁకటి పోటుతో పాటు,

"ఓరామ ఓరామ ఒయ్యారిరామ!
ఓరామ! ఓరామ!
ఓరామ! ఓరామ!"

అనుచు ఉచ్ఛ్వాసనిశ్వాసములతో రామనామస్మరణ జోడించుచున్నది. మధ్యాహ్నము ఒంటిగంట వేళ. ఇంట నామె ఒక్కర్తె యే. తాటాకు పుస్తకా లేవో ఉన్నవనఁగా చూడవెళ్ళినాను. ఇంటిలోనికి అడుగు సాగక వాకిటనే ఉన్నాను. కొంత సేపటికి దంపుడుముగియఁగా చేటలో దంచిన

బియ్యము చేర్చుకొని చెఱుగఁబోవుచు ఈ క్రిందిపద్యము చదివినది:

కలఁడందురు దీనులయెడఁ
గలఁడందురు పరమయోగిగణముల పాలన్
గలఁడందు రన్ని దెసలను
కలఁడు కలండనెడువాఁడు కలఁడో లేఁడో!

నాలుగవ చరణము గద్దించుచు మఱి మఱిమ్మాఱు చదివినది. ఇదేసందర్భమురా అనుకొని 'ఉన్నాఁడమ్మా' అనుచు నేను లోపలికి వెళ్ళినాను. ఆమె ఆ బియ్యములో అటుతర్వాత వంట చేసికొని భోజనము చేయఁబోవును. ఇట్లను కొన్నాను: "ఆహా! పోతరాజుగా రెంత పుణ్యాత్ములు. భాగవత మెందఱినో పవిత్రాత్ములనుగాఁ జేయుచున్నదిగదా!"

బ్రౌనుదొరగారి కెవఁడో దీనుఁడు ఈ క్రింది పద్యమును అర్జీగా వ్రాసి పంపుకొన్నాఁడట.

లా వొక్కింతయు లేదు, ధైర్యము విలో
లంబయ్యెఁ, బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛ వచ్చెఁ, దనువున్
డస్సెన్, శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరంబెఱుఁగ మ
న్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సం
రక్షింపు భద్రాత్మకా!

బ్రౌనుదొరగారా దీనుని కేదో కొంత సొమ్ముతో పాటు ఆ యర్జీమీఁదనే 'ఎండార్సుమెంటు' గా ఈ క్రింది పద్యమును వ్రాసి పంపినారట:

ఏను మృతుండ నౌదు నని
యింత భయంబు మనంబులోఁ పల్క
మానుము సంభవంబు గల
మానవకోట్లకు చావు నిక్కమౌఁ
గాన హరిం దలంపు మిఁకఁ
గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ! చెందెదవు
మాధవలోకనివాససౌఖ్యముల్.

బ్రౌనుదొరగారికి కూడ భాగవత మింత పరిచిత మయినది!

ఇన్ని ఉదాహరణములను ఎందుకు చెప్పినాననఁగా, మన తండ్రితాతల పోలికచాలికలు మనలో ఏవిధముగా అనుగతములై వచ్చుచున్నవో—మనము వేషభాష లెంత మార్చినప్పటికిని — మన పూర్వుల గ్రంథములలోని భావములు, సంప్రదాయములు, రచనలు—మన మెంత క్రొత్తత్రోవలు త్రొక్కఁజూచుచున్నప్పటికిని-మనలో ఎట్లు కుదుర్కొన్నవో తెలుపుటకే. వానిని మనము విడనాడ లేము; విడనాడనూ కూడదు అని యెఱిఁగించుటకే.

౫

# తెనుఁగు తేటదనము

తేటతెనుఁగును గూర్చి కొంచెమంత తెలుపుచున్నాను. ఆంధ్ర ద్రవిడ కర్ణాట భాషలలో తెనుఁగుమాట ప్రసన్నమయి నదిగా ఉండుటచేత 'తెనుఁగు తేట' అనియు, 'తేటతెనుఁగు' అనియు, 'తెనుఁగుతేనె' అనియు, 'దేశభాషలందు తెలుఁగు లెస్స' అనియు నానుడ్లు పుట్టినవి. తెనుఁగుకీ తేటదనము, లెస్సదనములు సంస్కృతప్రాకృతముల పాళ్లు సమరసముగా కలియుటవల్లను, ద్రవిడ కర్ణాటకములకంటె తెలుఁగు మాట మార్దవ, సౌలభ్యములు కలదగుటవల్లను ఏర్పడినవి. ఈ తేట తెలుఁగు చచ్చుడివాని దగ్గఱనుండి జగద్గురువుదాఁక, ఉగ్గు పాలనాఁటి నుండి ఉసురుడుగు దాఁక, బాలశిక్షదగ్గఱ నుండి మోక్షవిద్యదాఁక అన్ని జాతులలో, అన్ని దశలలో, అన్ని విద్యలలో, క్షణక్షణపరిణామముతో, నవనవవికాసముతో కల కలలాడుచుఁ, దొలఁకులాడుచు నున్నది. హెచ్చుకాలము లిపిరూపము పొంది నిలిచియుండ నక్కఱలేని సంభాషణా దులు, నవ్వులాటలు, తగవులు మొదలయిన వాగ్వ్యాపార ములను విడిచిపెట్టినప్పటికిని లిపిరూపము పొంది కొన్ని పురు షాంతరములదాఁక ఉండవలసిన వర్తకము, దేశపాలనము, ఆచారవ్యవహారములు, దస్తావేజులు, రాజశాసనములు,

దానశాసనములు మొదలయినవానిలోను, దేశము, భాష ఉన్నంతకాలము ఉండవలసిన కథలు, కళలు, పాటలు, పదాలు, నాటకములు, నానా శాస్త్రములు, కావ్యములు మొదలయినవానిలోను భాషాప్రవాహము పాయలువాఱి పాఱుచు, మాఱుచు, తేఱుచు కావ్యసరస్సులలో నిండార్లుగా నెలకొనుచు నుండును. భాష కున్న ప్రయోజనము లన్నింటిలోను ప్రౌఢకావ్యరచన పరమప్రయోజన మన వచ్చును. భాష చెందు క్రమపరిణామపు మెట్లలో ఉత్తమ కావ్యరచన కడపటి మెట్టు. వాడుక భాష అను మడిసరకు నుండి ఉత్తమకావ్య మను సున్నితపు మేల్మిసరకు తయారవుచుండును. అయినను భాషాప్రయోజనము లన్నింటికిని ఈ మేలిమిసరకు ఉపయోగపడదు. వాడుకభాష మంచినీటి వలె బహు ప్రయోజనము కలది; కావ్య భాష పంచదార పానకమువలె పరిమితప్రయోజనము గలది.

ప్రౌఢకావ్యప్రయోజన మొకటి విడనాడినచోఁ దక్కిన భాషాప్రయోజనము లన్నిటిలోను వాడుకభాషయే ఓలలాడుచు నున్నది. కొందఱు సంస్కృతాంధ్ర కవీశ్వరులు శాసనకావ్యమను పేరుతో ప్రౌఢగద్యపద్యరచనలలో వెలయించినను ప్రాచీనశాసనము లెన్నియో వాడుక భాషలో నున్నవి.

ఇంకను ప్రాచీనకావ్యవ్యాఖ్యానములు, కథలు, శాస్త్రగ్రంథములు, వ్యవహార గ్రంథములు, దేశ చరిత్రలు చాల

చాలా వాడుక భాషలోనే ఉన్నవి. వాని నన్నిటిని ఉదాహ
రించుట కిక్కడ చోటు చాలదు. శ్రీ గిడుగు రామ
మూర్తి పంతులుగారి గద్యచింతామణిలో చూచుకో
వచ్చును. ఇంకను పద్యగంధులయిన బాలకథలు, పొడుపు
కథలు, నానుడ్లు, పలుకుబడ్లు, సామెతలు, స్త్రీల పాటలు
పదాలు, పనిపాటులవారి పాటలు పదాలు, వృద్ధుల
వేదాంత వైరాగ్యపు పాటలు పదాలు, ఎఱ్ఱగొల్లలు, పిచ్చు
కుంట్లు, పంబవారు మొదలగువారు పాడు దేశికథారచనలు
—అన్నియు వాడుకభాషలోనే ఉన్నవి. ఇవికూడ వాఙ్మ
యములో చేరునా అని పండితులు కొందఱు పరిహసించు
చుందురుగాక! వాని రుచిని గుర్తింపఁగల్గుటకుఁ గూడ నొక
యనుభావవిశేష ముండవలెను. ఒక్క తార్కాణ చూపు
చున్నాను. చల్లపల్లి జమీందారుగారి పట్టాభిషేకోత్సవపు
నాళ్ళలో వారి కోటలో రాత్రులు నాటకములు, పాటకచ్చే
రీలు, భోగమాటలును సాగుచుండెడివి. కోటవెలుపల మాల
దాసరుల వీధినాటకములు, తోలుబొమ్మలాటలు సాగుచుం
డెడివి. వచ్చిన పండితులందఱును కోటలోని ఆటలు, పాటలు,
నాటకములు చూడఁబోవుచుండెడివారు. మా గురువులు
శ్రీ చెళ్ళపిళ్ళశాస్త్రులు గారు కోటవెలుపల మాలదాసర్ల వీధి
నాటకములు చూడఁబోవువారు. రాత్రి తా మాస్వాదించిన
రసానుభవమును మర్నాఁడు పునశ్చరణ చేయుచు ఆనందిం
చుచు మాకు వినిపించి మమ్ము ఆనందింపఁ జేసెడివారు.
వారు గుర్తించి చెప్పినప్పుడే వాని రుచి ననేకులు గ్రహింపఁ

గలిగెడివారు. వారి మధ్య పత్రికలలో లోకాభిరామాయణములను మంచి వాడుక పలుకుబళ్లతో ముంచెత్తినారు.

ఆంధ్రభాషలో ఆదికాలమునాఁటి కావ్యరచన మూడి సరకుభాషతో, దేశిచ్ఛందో రచనతో ప్రజాసామాన్యమునకు సులభముగా ఉండెడిదనియు, అదియే ఇప్పటి పాటలుపదాల వాడుక భాష అనియు నా నమ్మకము. నన్నయభట్టారకునికి పూర్వము శాసనములలో సీసగీతమధ్యాక్కరపద్యములు కనఁబడుచున్నవి. వానిలో మధ్యాక్కరను నన్నయాదులయిన ఆదికాలపు ప్రౌఢకవులు కొందఱే కొంచెముగా పాటించినారు. ఆదికాలపు మధ్యాక్కర ఒకటి ఉదాహరించుచున్నాను:

> "స్వస్తి నృపాంకుశాత్యంతవత్సలసత్యత్రినేత్ర
> విస్తరశ్రీయుద్ధమల్లుఁ డనవద్యవిఖ్యాతకీర్తి
> ప్రస్తుతరాజాశ్రయుండు త్రిభువనాభరణుండు సకల
> వస్తుసమేతుండు రాజసల్కిభూవల్లభుం డద్ది."

ఇందులో కొన్ని యక్షరములను జేర్చినను తీసివేసినను పద్యము పద్యముగానే ఉండునట్లు రచన ఉన్నది. పఠన ఫణితి తాళగతి కలదిగా గోచరించుట లేదు. సంగీతరుచి గుర్తించిన తెలుఁగుకవులు ఈ పద్యమును ఎందుకు పాటించినారా అని సందేహించుచుండువాఁడను. అర్వాచీనకవులు దీనిని అందుకనియే విడిచిపెట్టినారు కాఁబోలును. ఒకనాఁడు మాయింటిలో మా అమ్మగారు ప్రాఁతకాలపుపాట లేవో

పాడుచుండఁగా వినుచున్న నాకు అం దొక పాటఘణితి చాల ఆనందజనక మయినది. నేఁటి కావ్యరచనల కనుకూలింపఁ జేసికొందమని గణవిభజన చేసి చూతునుకదా అది మధ్యాక్కర లక్షణము కలదయి యున్నది. మధ్యాక్కర పఠనఘణితి నాకపుడు తెలియవచ్చినది. దానిమాదిరి చూపుచున్నాను, చూడుఁడు:

"అంతట రాములవారూ - అంగన సీతను గూడీ
వంతసమందుచు వేగా-స్వపురమునకు చనుదెంచీ
తమ్ములతోడను గలసీ-నెమ్మది రాజ్యము లేలే
ధర్మముతో ప్రజలెల్లా-తామరతంపరలైరీ."

ఇందు రెండు ఇంద్రగణములు, ఒక సూర్యగణము, రెండు ఇంద్రగణములు, ఒక సూర్యగణము-వెరసి ఆఱు గణములు కలది ఒక చరణము. మూఁడవ గణము కడపట సీస చరణాదళమువలె మధ్యాక్కరచరణము మధ్యకు విఱుగును. ఆదికాలపు కవులు పాటించిన సీస ద్విపద గీత పద్యములు కొంచెము మార్పులు చెందియు, చెందకయుకూడ స్త్రీబాల పామరాదులు పాడు పాటలలో, పదాలలో కానవచ్చుచున్నవి. స్త్రీలు పాడు శ్రావణమంగళవారపు పాట సీస పద్యమే.

"శ్రావణామాసాన శుద్ధపాడ్యమినాఁడు
మహాలక్ష్మి ముత్యాల చీర గట్టి"

అని దాని మొదటి చరణము. మఱియు ద్విపద అను ఆదికాలపు రచన అనేక ఫణితిప్రభేదాలతో పాటఁలో, పదాలలో చేరిఉన్నది. ఒకటి రెండు ద్విపదఫణితిప్రభేద ములు చూపుచున్నాను:

"ఒకరూ కట్టిన చీరా ఒకరూ కట్టారూ
ఒకరూ తొడిగిన రైకా ఒకరూ తొడగారూ
ఒకరూ పెట్టిన నగలూ ఒకరూ పెట్టారూ
వార్కి పొసగింపా నా వశమూ కాదనేనూ."

ఇది ద్విపదవికారమే.

"వెన్నెలబైలనే వేలసంఖ్యలనూ
పందిళ్లు వేయించీ పరమాపావనులూ"

ఇదియు ద్విపదయే.

ఇట్లు ఒక ద్విపదయే పలురసములలో, పలుఫణితు లలో వాడుకభాషలో పలు పాటలుగా వెలసినది.

ఆదికాలమునాఁటి పాటల ప్రభేదములను కొన్నింటిని పాల్కురికి సోమనాథుఁడు పేర్కొన్నాఁడు. వాని నన్నింటిని ఇక్కడ వివరింపఁగుదురదు.

సంస్కృతాంధ్రములలో ప్రౌఢభాషామయములైన భారతరామాయణాదులను చదివి తత్కథాప్రయోజనము ననుభవించువారికంటె వాడుకభాషలో పాటలు పదాలుగా

నున్న భారత రామాయణ కథలను బొమ్మలాటలలో, వీధి నాటకములలో వినియు, చూచియు ఆ ప్రయోజనము ననుభవించు ప్రజలు దేశములో చాల హెచ్చు. పైతీరున లోక సామాన్యమునకు అర్థముకాఁదగినదియు, తేట తెలుఁగని, దేశి తెలుఁగని, జాను తెలుఁగని, అచ్చ తెలుఁగని ప్రాచీనులు పలు తెలుఁగులతో పేర్కొన్నదియు అయిన వాడుక భాషలో ఉన్న యందచందములు వ్యాకరణముతో దిద్ది తీర్చిన ప్రౌఢ గ్రాంథిక భాషలో పనుపడ వని ప్రాచీనులే పేర్కొన్నారు. తిరుపతిలో ౧౫, ౧౬ శతాబ్దులలో ప్రఖ్యాత కవీశ్వరులై సంకీర్తనాచార్యు లనఁబరగిన తాళ్ళపాకవారు వందల కొలఁది పాటలను, పదాలను వాడుక భాషలోనే రచించినారు. పాటలు, పదాలలో వాడుకభాషయే యుండఁదగినదనియు, దానిని ప్రౌఢవ్యాకరణప్రకారము దిద్దితీర్చుట పువ్వును నలిపి వాసన చూపించుటవంటి దనియు 'సంకీర్తనలక్షణ' మను లక్షణగ్రంథములో వా రిట్లు చెప్పినారు:

> "పల్లవనారీమ్లేచ్ఛా
> ద్యుల్లాసమనోజ్ఞ బంధురోక్తులు చవులై
> చెల్లును గ్రామ్యము లైనను
> వాల్మీకముఖ్యనాటకాదికఫణితిన్.
> జగతిఁగల చెల్లుబల్లై
> నగినగి భాషించునట్టి నానుడిపలుకుల్
> తగ దన రహి చెడుఁ బువ్వుల
> సొగసుమురగన్ బిసిగి కంపు చూపినభంగిన్."

ఈలక్షణముచొప్పున యక్షగానములను నాటక ప్రభేదములలో ఉండు దేశిచ్ఛందోరచనావిశేషములను పేర్కొనుట కిక్కడ చోటు చాలదు. ఇంకను వాడుకభాషలో, ద్విపదలలో కాటమరాజుకథ, పల్నాటికథ, కుమారరాముని కథ, మఱీ క్రొత్తతరపుఁబదములయిన బొబ్బిలికథ, దేశింగు రాజుకథ, లంకాసారథి మొదలయిన రసవద్రచనలు ఎన్నియో ఉన్నవి.

దేశము నలుగడలను గాలించి మంచిమంచి పలుకుబళ్ళను, కథలను, సామెతలను, పాటలను, పదాలను, వింతశబ్దజాలములను సేకరించవలెను. అచ్చు రాకముందు అన్నిరకాల రచనలు తాటాకులమీఁదను, నోటివాడుకల మీఁదను నెలకొనిఉండెడివి. అచ్చువచ్చిన తరువాత ప్రాయికముగా ప్రౌఢకావ్యరచనకే పరిపోషము కలుగుటచేత, ప్రాఁతకాలపు దేశిరచన లెన్నో అడగారిపోఁజొచ్చినవి. ఆంధ్రభాష యందచందములు సరిగా గుర్తించుటకు వీని సర్వే యత్యావశ్యకము.

౬

# ఆంధ్రకవిత - పురాణయుగము

## నన్నయ తిక్కనలు

పురాణముల రచనము, ఆ రచనముల చెల్లుబడి ప్రబలముగా సాగిన కాలఖండమును పురాణయుగమని వర్తమానులు వ్యవహరించుచున్నారు. అటువంటి కాల ఖండములను యుగములనుటకంటె శకములనుట వ్యవహారార్థానుగుణ మనుకొందును. ఇట్లు మార్చిన పురాణశకము, ప్రబంధశకము అని కాని, మఱొకవిధమున కవులనుబట్టి పేర్కొన్న నన్నయశకము, తిక్కనశకము అని కాని అనుట యవును. అందఱును ఇప్పుడు 'యుగ' మనియే వ్యవహరించుచున్నారు గాన నేనును అలాగే అనుచున్నాను. ఆంధ్రపురాణరచన సంస్కృతపురాణరచనానుసారిగా సాగినది గాన ఆంధ్ర రచనా పద్ధతిని వివరించుటకు ముందు సంస్కృతసంప్రదాయానుస్మరణము కొంత ఆవశ్యకమే అవును. సంస్కృతపురాణములు తద్రచనాకాలమునాఁటి విద్వద్విజ్ఞానమునకు సర్వస్వములు. వేదములలో సర్వవిద్యలును అంకురప్రాయములుగా ఉండఁగా పురాణములలో అవి కొంతకొంత విరివిగా వెలసె ననవచ్చును. "సర్గశ్చ

ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ, వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్" అని సృష్టివిధము, ప్రళయముల తీరు, రాజవంశముల చరిత్రలు, మన్వంతరకథలు, మహాత్ముల చరిత్రలు మొదలగువానితో పురాణము లుండునని లక్షణము ఉన్నను, పురాణములలో ఇంకనుఎన్నో దేశచరిత్రలు, వైద్యము, జ్యోతిషము, నీతి, ధర్మ కామశాస్త్రములు, వ్యాకరణాలంకారసాహిత్యాది శాస్త్రసంప్రదాయములు మొదలయినవి కొంతకొంత సంగ్రహముగాను, కొన్నిచోట్ల విరివిగాను కూడ వర్ణితములై ఉన్నవి. అగ్నిపురాణములో వ్యాకరణము, వైద్యము, జ్యోతిషము మొదలయిన వెన్నియో ఉన్నవి.

ఇట్టి పురాణములు సంస్కృతభాషామాత్ర పరిజ్ఞానముగల జనసామాన్యమునకు కూడ అర్థము కాదగినట్లు సులభభాషలో, ప్రాయికముగా సులభమైన అనుష్టుప్ఛందస్సులో తేలిక వాక్యాన్వయములతో తేటగా ఉండును. వ్యాసులవారి రచనలలో తఱచుగా 'చ, వై, తు, హి' అని పాదపూరణపు పొల్లుపదము లున్నవి అనికూడ పండిత పరిహాస మున్నది. పురాణ సామాన్యరచన ఇట్లు ఉండుననుట సంగతమేకాని, కొన్నిపట్లు పురాణములలోనివే, సంప్రదాయ పరిజ్ఞానము లేనిచో ప్రౌఢపండితులకు కూడ కొఱకరాని కొయ్యలు, ఉక్కుసెనగలు అనదగినవిగా ఉన్నవి. పురాణములలోనికెల్ల భారత భాగవతములు,

రామాయణము ప్రధానమయినవి. రామాయణ భారత ములు కావ్యేతిహాసము లనఁబడినను, పురాణములనికూడ సామాన్యవ్యవహారమున్నది. తెలుఁగున అవి పురాణములే అనుచున్నాము. ఉక్కుసెనగలు పై మూఁడు గ్రంథముల లోను, అందులో మఱీ భారతమున ఉన్నవి. భారతములోని ఉక్కుసెనగలకు వ్యాసఘట్టములని పేరు. మచ్చు చూపు చున్నాను:

పశ్యః పశ్యతి పశ్యన్త మపశ్యన్తంచ పశ్యతి,
అపశ్య స్తావ (త్వాద?) చతుష్ట్వాత్ పశ్యాపశ్యా న పశ్యతః.
చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభి రేవచ,
హూయతేచ పునర్ద్వాభ్యాం స మే విష్ణుః ప్రసీదతు.

ఈ విధముగా పురాణములు వివిధవిషయములతో, వివిధ రచనలతో అరణ్యములవంటివై ఉండును. అర్వాచీన ములయిన కావ్యనాటక ప్రబంధాదిరచనలు పురాణారణ్యము లనుండి ఉద్ధరించి సేకరించి తీర్చి దిద్ది నాటిన యుద్యానముల వంటి వనఁదగును. పురాణములలో కావ్యనాటక ప్రబంధాది రచనల పోలుపులు సుకుమారదృశ్యములై ఉండునుగాని, కావ్య నాటకాదులలో పురాణరచనములలోని శాస్త్రాంశ భీకర దృశ్యము లుండవు. ఇటువంటి సంస్కృత పురాణ శక్తి ననుసరించి తెలుఁగు పురాణరచన వెలసినది. నన్నయ మొదలుకొని శ్రీనాథునిదాఁకఁగల కవుల యాంధ్రగ్రంథ రచన పురాణయుగరచన యనఁదగినది. ఆకాలమున

ప్రాయికముగా ఆంధ్రమున పురాణరచనలే వెలసినవి. కవిత్రయము, మారన, పాల్కురికి సోమనాథుఁడు, భాస్కరాదులు, నాచనసోమన, శ్రీనాథుఁడు, పోతన, సింగన పురాణకవులలో ప్రధానులు. పురాణకవిరచనలను గూర్చి ప్రసంగించునప్పుడీ యందఱివిషయమును రావలసినదే అయినను ముందు ముఖ్యులయిన భారత కవిత్రయము వారిని గూర్చి మాత్రమే యిప్పటి నా ప్రశంస.

కవిత్రయమువారు శైవభక్తులు, సదాచారులు, ఉత్తమ పండితులు. కవితాతపస్సు చేసి వారు కాంతితార్థములను అంతర్వాణియుద్బోధములతో నందుకొని కావ్యరచన కావించినారు. తర్వాతి సర్వాంధ్ర కవి కుటుంబములకు వారి పవిత్రవాక్కులు నిక్షేపములయి దొరకిన బంగారు నక్కులు. ఆ ముప్వుర రచనములతో తెలుఁగున వెలసిన మహాగ్రంథము భారతము. దాని మూలగ్రంథము అయిదు వేలయేండ్లనాఁటి భారతీయ చరిత్రాంశములు గల ప్రాఁత గ్రంథమే అయినను సర్వప్రపంచమునను దాని పలుకుబడి చెల్లుబడి అగుచునే యున్నది.

వ్యాసకృతిని మహాభారతమును నన్నయ యిన్ని లక్షణములు గలదానినిగా వర్ణించినాఁడు:

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్య మనియు

లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు
పరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁగొనియాడుచుండ

వివిధవేదత త్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు."

ఇట్టి సంస్కృత భారతమును,

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తిలో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచనబంధురుఁడయ్యె జగద్ధితంబుగాన్."

నన్నయ పై తీరున సర్వశాస్త్రార్థ కలితముగానే కాక భారతమును ప్రసన్న రచనతో మహాకావ్య లక్ష్యముగాఁగూడ తెనిఁగించిన ట్లేర్పడును. కనుకనే యాతనికి వాగనుశాసన బిరుదము కల్గెను. సంస్కృతమున పురాణములు, కావ్యనాటకాదులు అన్నియు వెలసినపిదప ఉపక్రమించిన దగుటచేత తెలుఁగుపురాణరచన తనలోనే సంస్కృత సర్వకావ్య రచనా చమత్కారములను ఇముడ్చుకోవలెనను యత్నముతో సాగినది. ప్రాచీనుఁడు గణ

పతిదేవుఁడను కవి "ఆంధ్రకావ్యపథము దీర్చిన నన్నయ భట్టుఁ గొలుతు" నన్నాఁడు. నన్నయభారతము చదివినచో అందులో భాషాకవితాలక్షణపరిష్కారములను ప్రయత్న పూర్వకముగా నన్నయ లక్ష్యీకరించినట్లు కానవగును.

"పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా
రాయణు నట్లు వాణసధరామరవంశ విభూషణంబు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁ డీ కృతి కిష్టుఁడుణ్ సహా
ధ్యాయుఁడునైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వ
[హింపఁగాణ్."

ఈ పద్యము ద్వితీయ తృతీయ చరణములందు నారా యణ పదము "ర" యతి ఖండాఖండములుగా స్వరవ్యంజన ములతో రెండు దెఱఁగుల నుంచుట లక్షణ విశేష నిరూప ణార్థముగదా! ఇట్టి వెన్నేని విశేషాంశములను నన్నయ రచ నలో చూపవచ్చును.

శరత్సమయమున సరాళముగా సమప్రదేశమున ప్రవ హించు తెలినీటి తేటవాకవలె నన్నయరచన సుప్రసన్నమై, చాటుమాటులు లేనిదై, కరతలామలకముగా తనలోఁగల సర్వార్థములను ప్రవ్యక్తముగా గుర్తింపనిచ్చునదై, సుఖప్రవే శమై, సుస్వాద్యమై నిర్వక్రగతితో నెగడుచుండును. వ్యాస భారత రచనలో 'చ, వై, తు, హు' లున్నట్లు అక్కడ క్కడ నన్నయరచనలో 'మానుగ, పాయక, పర్వగ, ఇమ్ములు' మొదలగు పాదపూరణపు పొల్లు పదములుండును

గ్రంథగ్రంథులు నన్నయరచనలో నుండవు. నన్నయ్యశయ్య వంటి పురాణశయ్య - కావ్యగౌరవముకలది - భాగవతకర్త కొక్కనికేతక్క మఱి యితర పురాణయుగాంధ్రకవుల కెవ్వరికి దక్కలేదు. నన్నయ్య పురాణ శయ్యా సౌభాగ్య మునకు లక్ష్యము నొక్క గీతపద్యమున గుర్తింపవచ్చును:

"ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు
బేల నీకుఁ దెలుప నేల వలసె?
చిఱుతవాని కింత దఱుసంటి పలుకులు
సన్నె వృద్ధజనము లున్నచోట?"

రాజసూయమహాధ్వరము జరుగునపుడు భీష్ముఁడు ధర్మరాజుతో 'నఖిలలోకపూజ్యు నచ్యుతుఁ బూజింపు' మనఁగా శిశుపాలుఁ డుపాలంభనపరుండయి యధోక్షజు నాక్షేపించుచు ధర్మరాజు కిట్లనుచున్నాఁడు:

"అవనీనాథు లనేకు లుండఁగ విశిష్టాచార్యులార్యుల్ మహీ
దివిజుల్ పూజ్యులు పల్వు రుండఁగ ధరిత్రీనాథ! గాంగేయ దు
ర్వ్యవసాయంబునఁ గృష్ణుఁ గష్టచరితుం గా వార్ష్ణేయుఁ బూజించి నీ
యవివేకం బెఱిఁగించి తిందఱకు దాశార్హుండు పూజార్హుఁడే?"

ఈ పద్యమున ననుప్రాసము, నక్షరసౌభాగ్యము, శయ్యయొయ్యారమునుమాత్రమే కాక దాశార్హుఁడు = పల్లెలు బోయలు మొదలగువారికిఁ దగినవాఁడు, వారిలో విహరింపఁదగినవాఁడు, లేక భృత్యులకు, నౌకరీకి తగిన

వాఁడు శ్రీకృష్ణుఁడు పూజార్హుఁడగునా యనియు నాక్షే
పము. దాశార్హ పదమునకు రెం డర్థము లున్నవి. పల్లెకారీ
లకుఁ దగినవాఁడనియు, నౌకరీకిఁ దగినవాఁడనియుఁ జెడ్డ
యర్థము. దశార్హదేశభవుఁడని మంచి యర్థము.

"ఇతనికిఁ గూర్తురేని ధన మిత్తు రభీష్టములైన కార్యముల్
మతి నొనరింతు రిష్టుఁడని మంతురు గాక మహాత్ములైనభూ
పతులయు విప్రముఖ్యుల సభన్ విధిదృష్టవిశిష్టపూజనా
యతికి ననర్హు నర్హుఁడని యచ్యుతు నర్చితుఁ జేయఁ బాడియే?"

ఇక్కడ ధర్మరాజుతో భీష్ముఁడు అచ్యుతుఁ బూజింపు
మనునప్పు డుపయోగించిన యచ్యుతపదమునే శిశు
పాలుఁడు వెక్కిరింపుగా నర్థాంతరమునఁ బునఃప్రయోగము
చేసినట్లు నన్నయభట్టు రచించి గంభీరభావము గల్పించి
నాఁడు.) అతఁడు విధిదృష్టవిశిష్టపూజనాయతికి ననర్హుఁడు.
ఇట్టి యాయచ్యుతుని నర్చితునిఁ జేయుట పాడిగాదు అని శిశు
పాలుని భావము. (భీష్ముని పలుకులలోని యచ్యుతపదము
నకు ఆ చ్యుతుఁడు అని యర్థాంతరము గలుగుట ప్రాచీన
వ్యాకరణసంప్రదాయసమ్మతము. ఈ పద్యమునఁగూడ
నక్షరరమ్యత, యనుప్రాసచమత్కృతి దైవాఱియున్నవి.
ఈ శిశుపాలకథాఘట్టమెల్ల శబ్దార్థగాంభీర్య కలితమై రసోత్త
రమై యున్నది.)

"అవమాన్యుల్ సభలోన మాన్యుఁడని సౌహార్దంబునం గౌరవ
స్థవిరప్రేరణ నిన్నుఁ బాండుతనయుల్ తప్పంగఁ బూజించి ర

య్యవివేకాస్పదులైనపాండవులుమోహాంధుండుభీష్ముండుఁ గే
శవ! నీవుం గడగుండు నాకునెదురై సంగ్రామరంగంబునన్."

ఇందు నాల్గవచరణమున 'కే' యని కేక, 'శవ నీవుం గడగుండు' అని నింద. ఇట్టిచోట్లనెల్లఁ బలుకుబడిలోనే యర్థ విశేషములు పదచ్ఛేదభేదముచేఁగల్పించి గంభీర భావ భేదములకు ఝడితిస్ఫూర్తి గూర్చుట నన్నయనైపుణ్యము. కారకాన్వయ కౌటిల్యముతో నర్థవిశేషములను సాధించుట నన్నయతీరుకాదు.

భారతకథోపాఖ్యానాదులలోని పాత్రములభావములు, సంభాషణములు చాల ప్రాఁతకాలపువి గావునఁ గొన్నిచోట్ల వ్యంగ్యవక్రోక్త్యాదికవితాకౌటిల్యములు లేనివిగా, నమాయికములుగా నున్నవి. అట్టివానిని తెలిఁగించుటలో నన్నయ తిక్కనలు విభిన్నరీతుల నాశ్రయించిరి. నన్నయ తననాఁటికే వెల్లివిరిసియున్నవయినను కావ్యాలంకారశాస్త్రసంప్రదాయముల నంతగాఁ జొప్పింపక మూలగ్రంథముగ్ధతామాధుర్యములఁ గాపాడినాఁడు. తిక్కన యాయాపాత్రములఁ దననాఁటి వానినిగా గొన్నిచోట్లఁ గావ్యౌచితీనిర్వహణార్థమై మార్చుకొని తన నాఁటి కావ్యాలంకారశాస్త్రసంప్రదాయముల కనుగుణముగాఁ గథానిర్వహణము కావించినాఁడు.) నన్నయ రచన మూలానుసారియై, మౌగ్ధ్యమాధుర్యమనోజ్ఞమై, యార్షమై యున్నదనుట కొకటిరెండుదాహరణములు :

నన్నయశకుంతలోపాఖ్యానరచన కావ్యాలంకారౌచితీరీతినిఁజూడఁగా గ్రామ్యతాదోషజుష్ట మనఁదగియుండును.

వ్యాసుఁడే దాని నిట్లు రచియించినాఁడు. అమాయికములైన
సత్యకాలపు మునిపల్లెల పిల్లల ముగ్ధమధురసంభాషణములను
మూలానుసారముగా తెలిఁగించుటే లగ్గని నన్నయ భావించి
యట్లు రచించియుండును. తిక్కన యగుచో నాపట్టుల వ్యంగ్య
వక్రోక్తికల్పనాశిల్పముల నెట్టుకొల్పి నవ్యకాలికరీతిని
కావ్యశయ్యతో కల్పించి యుండెడివాఁడేమో! నాటక
రూపమున నా కథ నట్లే కాళిదాసు మార్చివేసినాఁడుకదా!

"ఏను కచుం డనువాఁడ మహానీమసమన్వితుఁడ
బృహస్పతిసుతుఁడన్" అని చెప్పుకొని శుక్రుని శుశ్రూషించిన
కచుని శుక్రపుత్రియైన దేవయాని ప్రేమించి యిట్లు కోరినది:

"నీవును బ్రహ్మచారివి వినీతుఁడ వేనును గన్యకన్ మహీ
దేవకులావతంస రవితేజ వివాహము మీకు నాకు మున్
భావజశక్తి నైనయది పన్నుగ నన్ను బరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రు దయజేయుము నాకుఁ బ్రియంబునావుడున్"

అని కోరి కచునిచే నిరాకృతయైన దేవయాని దైవ
కృతముగాఁ బిదప యయాతిమహారాజుపాణిగ్రహణము
గావింపఁగా నన్న తీరు మౌగ్ధ్యమాధుర్యభాసురమే కాని
నవ్యకావ్యోచితరీతిని రోతగొల్పునదే. ఇట్టి సందర్భముననే,
అనఁగా మాయావటుఁడు పార్వతిని భార్యవు గమ్మని కోరు
సందర్భమున శృంగారరసభావశ్లేషచమత్కారగర్భితముగా-

"కియచ్చిరం శ్రామ్యసి గౌరి, విద్యతే
మమాపి పూర్వాశ్రమసంచితం తపః,

తదర్ధభాగేన లభస్వ కాంక్షితం
వరం త మిచ్ఛామి చ సాధు వేదితుమ్"

అని కాళిదాసు రచన కావించినాఁడు. శ్రీనాథుఁడు దానిని దెలిఁగించుటలో కాళిదాసుమార్గమును వీడనాడి అలంకారశాస్త్రసంప్రదాయవాసనల నెఱుఁగనివారినిగానే పార్వతీవటులను భావించి నన్నయచ్ఛాయనే అనుగమించి నాఁడు.

"ఏనును బ్రహ్మచారిఁ దరళేక్షణ నీవును గన్య వెంతకా
లానకు నీకుఁ బెండ్లియె ఫలంబగునేని విచారమేల స
మ్మానముతోడ నన్నుమునిమాన్యవివాహముగమ్ము లెమ్మికా
దేని తపంబులోని సగమిచ్చెద మాను తపోభిమానముల్."

నన్నయ భారతభాష నాగమసూత్రస్మృతిభాషనుగా భావించుచోఁ దిక్కనభాషను గాళిదాసకావ్యభాషనుగాఁ బరిగణింపవచ్చును. నన్నయ దోక ఋషిమార్గము. తిక్కన దోక రసమార్గము.

"విలువిద్య నోరులు నీ క
గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదు నని మున్
బలికితిరి నాకకా దీ
త్రిలోకముల కధికుఁ జూచితిమి యొకయెఱుకన్.

ఈ పద్యమున నాల్గవ చరణము తొల్త జగణపు టుయ్యాల యూపులో తర్వాతికవు లనేకులు హాయిగా

ఊఁగసాగినారు. ఈ యూపులో పింగళి సూరన్న ఎట్లూఁగి నాఁడో గుర్తింపుఁడు:

"అపు డించుక తడ వన్యో
న్యపాణి సంస్పర్శ సంభృతానంద స్వా
భపరీతాత్మత నుండిరి;
ప్రపంచమంతయును మఱచి ప్రతియున్ సతియున్"

శ్రీనాథ పెద్దనాది కవీశ్వరులు చంపకోత్పలాది పద్యములలో మూఁడు నాల్గు చరణముల నొక సంస్కృతసమాసపు జాడింపున జాడించి హాయిహాయి మనిపించారు. ఈ హృద్య పద్యవిద్యకు నన్నయ ఆద్యగురువు.

"అలయకధర్మశాస్త్రములయందుఁ బురాణములందుఁ జెప్ప నుత్పలదళనేత్ర విందుమ యపత్యము మేలని కావునక్ యశోనిలయులఁ బుత్రులం బడయు నీ కొనరించెద సంగతాంగుళీదళవిలసన్మదీయ కరతామరసద్వయ యోజితాంజలిన్"

"అనుపమ కార్ముకాది వివిధాయుధ విద్యలయందు గోవిదుండనఁగ నజయ్యుఁడై పరగు నర్జునుఁ బోలఁగ నన్యు లెందు లే రను జనఘోష ముచ్చరితమయ్యె మరుచ్చలితోచ్చవీచి నిస్వనముఖరాబ్ధివేష్టితవిశాలమహీవలయాంతరంబునన్"

"అతులవిభూతితో మణిమయాభరణద్యుతు లొప్పఁగా శతక్రతుఁడు శచీసమేతుఁడయి కాంచనచారువిమానమాలికా

గతదివిజోత్తముల్ గొలువఁగా గొలువుండు వరాప్సరోంగనా
యుతవిలసత్కటాక్షకుసుమార్చితసుందరవక్త్రచంద్రుఁడై"

రసము, భావము, రీతి అనునవి మూఁడును ముప్పిరిగొని, జిగిబిగులతో ముచ్చట్లుగొల్పు పద్యములు ఇవి మూఁడును చూఁడుడు:

"ప్రకటితకోపవేగమునఁ బద్మదళాయతనేత్రముల్ భయానకతరలీలఁ దాల్చి నరుణద్యుతి నుద్యతమై త్రిశాఖమై
భ్రుకుటిలలాటదేశమునఁ బొల్చె త్రికూటతట త్రిమార్గగా
నుకృతి ప్రభంజనప్రియతనూజున కంతకమూర్తి కచ్చటన్"

"ధారుణి రాజ్యసంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యుగ్రరాత్ముదు
ర్వారమదీయబాహుపరివర్తితచండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్"

"పిలువంగఁబడక సభలకు,
బలిమిం జని పలుకు పాపభాగుల లోకం
బులకు జనవేడి పలికెదు;
పలువా! యెఱుఁగవు పరాత్మపరిమాణంబుల్"

ఈ క్రింది పద్యపు కడపటిచరణములో విశేషణములు విశేష్యమునకుతర్వాత నుండి ఒకదానికంటె నొకటిగా గుణోత్తరములై అవిమృష్టవిధేయాంశమనియు, పతత్ప్రకర్ష మనియు నెన్నికగన్న కావ్యదోషములకు వ్యతిరేకముగా కావ్యగుణోదాహరణతను కల్పించుచున్నవి.

"సుతజననోత్సవంబున విశుద్ధయశుండు యుధిష్ఠిరుండు సం
భృతహృదయప్రమోదుఁడయి పెంపున నిచ్చె సువర్ణభూషణ
ప్రతతులు గోధనాయుతము బ్రాహ్మణముఖ్యులకున్ నిరంతర
వ్రతులకు వేద వేదులకు వారిజసంభవునట్టివారికిన్"

ఈవిధముగా నన్నయరచనలలో పలుపోకల గుణ విశేషములను పరిగణింపవచ్చును. ఆయనరచన రసధారల యూటపట్టు. ఆంధ్రకవుల కాతఁడు "మధుమయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః!"

నన్నిచోడాదికవీశ్వరు లాయనరచనల నెన్నిటినో పుడికిపుచ్చుకొన్నారు. నన్నయ నన్నిచోడుల పద్యము లివి రెండు చదువుఁడు :

"తడబడబడియెడు రవమును
బడి కాలెడు రవము గాలిపలుదెఱగుల ప్ర
స్పెదురవమును దిగ్వలయము
గదుకొని ప్రమోయించె నురగకాయోత్థితమై"

"గిరిసుతమై కామాగ్నియు ;
హరుమై రోషాగ్నియుం దదంగజుమై ను
ద్ధురకాలాగ్నియు రతిమై ;
నురుశోకాగ్నియును దగిలి నొక్కట నెగసెన్"

తిక్కన, శ్రీనాథుఁడు, పోతన, పెద్దన మొదలగు మహాకవులు నన్నయరచనములలోని పల్కు పొలుపులను పెక్కింటిని బరిగ్రహించినారు. నన్నయరచన ధర్మోదాత్తము.

కర్ణాటకములోని జైనభారతపుటలజడి తెలిసినవాఁడుగనుక తెలుఁగునాఁటిలో వ్యాసభారత ధర్మవిశేషములను వెల యింపఁ గోరి అతఁడు కావ్యరచనకు కడఁగినాఁడు.

భారతము నీతిశాస్త్రగ్రంథమని ప్రఖ్యాతి గన్నది. నన్నయ భారతభాగములోని నీతిపద్యములు రీతి హృద్య ములు; సౌలభ్యసుందరములు. తెలుఁగు కవులందరిలో వచన రచన నన్నయ చేసినట్లు మరి యే కవియు చేయలేకపోయి నాఁడు. ఆ వచనరచనలో పలుకుబడి బహుమనోహరము. వాక్యములు సులభమయినవి. అనుప్రాసపు ధట్టింపు లందుండవు. వచనఖండముల పరిమాణము మితమై పులకండ ములఁ బోలియుండును. ప్రపంచభాషలలో ఆంధ్రభాషకు, ప్రపంచ కవితలలో ఆంధ్రకవితకు ఏదేని అర్హస్థానము అబ్బఁ దగిన యోగ్యత కలదేని ఆ యోగ్యతావిస్తర భార మెల్ల నన్నయ భారతభాగమే మోయవలసిన దగును. ఆ పుణ్య మూర్తికి వందనము. ఆయన కాశ్రయమిచ్చి పోషించిన చాళుక్యరాజరాజు కీర్తిపతాక చిరస్థాయి!

"మదమాతంగతురంగముఖ్యపదసంపన్నుండు నన్నయ్య తో మ్మిదినూర్లేండ్లకు ముందుజూపెకవితోన్మేషంబునర్వాంధ్రసం పద పెంపొంద చళుక్యవల్లభుఁడు సామ్రాజ్యాభిషిక్తుండుగా నది నాబోటికిఁ నేఁటికబ్బునటె వ్యాఖ్యానింప నాఖ్యానముల్."

(నన్నయ్యతర్వాత భారత రచనమును బూరించిన తిక్కన సోమయాజి నన్నయరచనమును దిన్నగా నెఱిఁగిన

వాఁడే అయినను నన్నయ్య శయ్యాసౌభాగ్యమును, ప్రసన్నతను పాటింపక, సంస్కృతభారతపు వ్యాసఘట్టములను బోలిన గ్రంథగ్రంథుల నధికముగాఁగూర్చి కవితామర్మముల నధికముగాఁ జొప్పించి పురాణరచనాసౌలభ్యమును గోల్పడినాఁడు. వర్షాసమయమున నొడుదుడుకు నేలలనుండి సుడులు దిరుగుచు మడుగులు మాటులుగలిగి లోఁతు తెలియనీయని కలక నీటిపోటుతో ప్రతి పదమును జాగ్రత్త వహించినఁ గాని దాఁట వీలుగొల్పని వక్రగతులతో సాగు గంభీర నదీ ప్రవాహమువలె తిక్కనరచన మప్రసన్నమై వెనుకకు ముందుకుఁ దిరుగు వాక్యోపవాక్యములయు, కారకాన్వయములయు కౌటిల్యముతో ఇంక నిందేమి విశేషము గలదో యని సహృదయులు ప్రతిపదము సందేహముతో ఆచియాచి చూచిచూచి మఱీ చదువవలసిన తీరున చిక్కులుగొల్పుచు జిగిబిగితోనుండును. ఇది పురాణ ఫక్కి కాదు. మఱి దివ్యకావ్యఫక్కి. కవితామర్మ మిం దెక్కువ. వక్రోక్తులు, అర్థాలంకారములు, వ్యంగ్యము నిం దధికముగానుండును. ఇందుకు లక్ష్యము నొక్క గీతపద్యము నుదాహరించుచున్నాను. విరాటపర్వ ద్వితీయాశ్వాసమున కీచకుఁడు ద్రౌపదిపై తమక మాఁపుకొనలేక నీచవాంఛను వావిడిచి వెల్లడించినాఁడు. అప్పు "డబ్బోటి కలుషించియు దుర్వారంబైన పరిభవవికారంబు దోఁపనీయక వెరవుతోడన తప్పించుకొనవలయునని" యిట్లన్నది:

"చనునె యిమ్మాటలాడ సజ్జనుల కాఁడుఁ
బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ
వట్లుఁ గాకయు హీనవంశాభిజాత
నైన పతివత్ని నగు నన్ను నడుగఁదగునె ?"

—"అన్నా ! కీచకా! సత్పురుషులు పరస్త్రీల నిట్లు కోరవచ్చునా? అంతేకాక ఆఁడుతోఁడుగలవాఁడు మఱీ జాగ్రత్తగా నుండవలెనుగదా ! నీవు సజ్జనుఁడవు, సుదేష్ణవంటి యాఁడుతోఁడుగలవాఁడవు, నీవిట్టి చెట్టపలుకులు పలుకరాదే! ఇట్లు కోరఁగూడమికి నీ యోగ్యతాంశము లివి రెండే కాదు. మఱి నా యయోగ్యతాంశములును రెం డున్నవి. నేను హీనవంశసంజాతను, మగనాలను; ఉన్నత వంశము గర్హించుననియు, ఆఁడుతోఁడు చెడనాడు ననియు, అక్కడ కూడ నీగతి పట్టవచ్చుననియు, నీ విషయమున నీవు వెఱవవలెను. నావిషయమునఁగూడ, నీచజాతిదని, మగఁ డెఱిఁగిన దండించునని నీవు వెఱవవలెను." అని సామాన్యముగా తోఁచు బాహ్యార్థము. ఇక్కడ లోఁతయిన యర్థాంతరము నున్నది:

"సజ్జనుఁడు, ఆఁడుతోఁడుగలవాఁడు ఇట్టి మాట లాడఁడు. ఇట్టి చెట్టలాడుచున్నావు గాన నీవట్లుగాక దుర్జనుఁడవు, ఆఁడుతోఁడులేనివాఁడవు నయితివి! 'నాకు సజ్జనతాపేక్షలేదు, ఆఁడుతోఁడుకలిమి నేను పాటించువాఁడను గాను!' అందువేమో! (సుదేష్ణ నీనికి తగిన యాఁడుతోఁడే; తన

పాడునడత కామెనుగూడ తోడుపఱుచుకొన్నాఁడుగదా!) అయితే నీవట్లగుదువుగాక! హీన! ఓరి నీచుఁడా! వంశాభిజాతను! పవిత్ర క్షత్త్రియవంశజాతను! యజ్ఞాగ్నిసంభూతను! అయినపతివత్నిని, అఖండపరాక్రమములయిన భర్తలుగలదానను! నన్ను నటరా నీవు కోరునది! నావంశపు యోగ్యతను, భర్తలయోగ్యతను దెలియక వదరుచున్నావు. ఈ రెండు యోగ్యతలు నిన్ను నాశపఱుపఁగలవురా" అని యర్థాంతరము!

పాఠకులు పై రెండర్థములలో కీచక సైరంధ్రీపాత్రములను జూచి సాధారణముగా తొలి సువ్యక్తార్థమును సైరంధ్రిలో డాఁగియున్న ద్రౌపదీ పాత్రమును గుర్తించి లోఁతుగా రెండవ యంతరార్థమును గ్రహింపఁ గల్గుదురు. లోఁతుగా యోచింపఁ జాలనివారు తొలియర్థమునే గ్రహింతురు. కీచకుఁడు మదనపిశాచగ్రస్తుఁడై యాత్రపాటుతో నున్నాఁడు గాన తొలియర్థమునే గ్రహింపఁగల్గెను. ద్రౌపది తాను భావించునది రెండవ గంభీరార్థమునే! తిక్కన యీ రెండర్థముల ననుగతపఱిచి శ్లేష ధ్వన్యర్థ చమత్కారముతో పద్యమును గూర్చినాఁడు. పయి పద్యమున 'అయిన పతివత్ని' ననుచోటను, 'అడుగఁదగునె' అనుచోటను అర్థ విశేషములున్నవి. ('అయిన యింటివారు' ఇత్యాదులు చూచునది) అయిన = చెల్లివచ్చిన, ప్రఖ్యాతిగాంచిన—భర్తలుగలదాననని (అటువంటివారి విషయమై

అడిగేదేమిటి — ఇత్యాదులుచూచునది.), ప్రశ్నస్మరణమే చేయువానివానననిఅర్థవిశేషములు. ముద్రణములం దీపద్య మిట్లున్నదిగాని యిందు తిక్కనకూర్పు కొంత మార్పు చెందియుండు ననుకొనుచున్నాను. 'అట్లుఁగాకయు' అనుచోట అట్లుతర్వాతి సముచ్చయపు టరసున్న-'కాకయు' అను చోటి 'యు'స్వారస్యమును సంపాదింపఁగల్గియే యున్నది. ఇఁక 'యు' వ్యర్థము. తిక్కన "అట్లుఁగాకయో హీన" అని రచన చేసియుండును. తొలి యర్థమున "అట్లుఁగాక-అయో-హీనవంశాభిజాతను అనియు, రెండవ యర్థమున అట్లుఁ గాక—ఓహీన" అనియు ఛేదము నసిపడును.

> "అని పిడుఁగుఁ బల్కిన న
> మ్మనుజాధముఁ డంతఁ బోక మదనోన్మాదం
> బునఁ దన్ను నెదిరి నెఱుఁగక
> ననితకు నిట్టనియెఁ గారవంపుఁ బలుకులన్."

తర్వాతి యుపపద్యములోఁ దన్ను నెదిరిని—పాద ప్రహారముచేయువానిని ద్రౌపదినిఅనియు కవిపొసగించినాఁడు. ఇట్లు తిక్కన భారతపురాణరచనమున ప్రబంధ శక్తితో వక్రోక్తిచమత్కృతులు, శ్లేషభంగులు, అనన్వయాభాస ములు, గడుసు పొసగింపు కూర్పుతీర్పులు లెక్కకు మిక్కిలి యయియున్నవి. అత్యంతశ్రద్ధతో పరిశీలింపఁగా ఒక్క విరాటపర్వ ద్వితీయాశ్వాసముననే ఎన్నో శబ్దార్థచమత్కా

రములు ప్రస్తుతపు ముద్రణములలో, వ్రాఁతలలో అపరిశీలిత ములుగా చెడిపోయినవి, చక్కఁబఱుపవలసినవి, గానవచ్చినవి.

తిక్కన దేసిపలుకుల మెలపులతోఁ గవితామర్మములతో సంస్కృతమున వ్యాసుఁడు చొప్పించినట్లు పెక్కుచోట్ల గ్రంథ గ్రంథులను చేర్చినాఁడు.

"గురుని మాట సరకుగొనమి దుశ్శీలత
పిట్టఁ బుడుక గోరుఁ బిసుకఁ ద్రుంపఁ
గరవ మరుగు టుదయకాలాస్తమయ సమ
యముల భానుఁ జూచు టాయువడఁచు."

ఈ పద్యమునఁ గవితామర్మమున్నది. క్రొత్తవారీపద్యమునర్థమును గుర్తింపఁజాలరు. వృద్ధ విద్వాంసుల మూలముననో, సంస్కృతమూలము మూలముననో గుర్తింపవలసినది దీనియర్థము. 'లోష్టమర్దీ తృణచ్ఛేదీ నఖఖాదీ చ యో నరః' అను మూలమున కిది తెనుఁగు. పిట్ట, పుడుక, గోరు అనఁగా లోష్టము, తృణము, నఖము అనువానిని పిసుకుటకును, త్రుంపుటకును, కఱచుటకును అలవాటుపడుట ఆయువును హరించునని యర్థము. తిక్కన దీనిని 'బెడ్డ చిదుప, పుడుక విరువ, గోరుగరవ, మరుగు టుదయ' అని సులువుగాఁ గూర్పవచ్చును. అయినను నిందు యథాసంఖ్యాలంకారము చేర్చి పిట్ట పుడుక గోరు అనుచోఁ బిట్టను బట్టుకొనఁగోరునట్టి యని యనన్వితార్థాభాసచిత్ర

మును గల్పించి పాఠకులను లోఁతుయోచనకుఁ బాల్పఱచి నాఁడు.) మఱియు,

> "అనిన నలు గాలివాన గోవును నశేష
> శబ్దముల మంత్రమును లోహజాతిఁ గాంచ
> నమును మనుజుల విప్రుండు సమధికత్వ
> భాజనము లండ్రు వేదప్రపంచవిదులు."

తెలుఁగుకూర్పుమఱుఁగు లెఱుఁగనివారైన ప్రౌఢ సంస్కృత పండితులు సైతము ఈ పద్యమున నలుఁ డేమిటి, గాలివాన యేమిటి అనన్వితముగా నున్నవే యని యంగలార్తురు. తిక్కన యిక్కడఁ జతుష్పాత్తులని కాని, నాలుగుకాళ్ల జంతువులని కాని సులువుగా ననలేఁడా? అనఁ గలఁడు కాని నలుఁడు, గాలివాన అన్న ప్రసిద్ధ పదముల ఝుడితిస్ఫూర్తి కలిగి పాఠకుల కనన్వయము తోఁచి లోఁతైన యోచనతో తదాభాసచిత్రము గోచరించునట్లు కవితా మర్మ మిక్కడఁ గల్పించినాఁడు.

సంస్కృత భాగవతమును బలుతూరులు పురాణము చెప్పిన యొక ప్రౌఢ సంస్కృత పండితుఁడు ఆంధ్రభాగవత మును గూడఁ బురాణము చెప్పుచు 'ఓదముత్రవ్వి జీవనపు టోలమునంబడి ' అన్న పోతన్నపద్యమున కర్థము చెప్పఁ గుదురక "యిక్కడఁ బుటోల శబ్దమున కర్థము తెలియలేదు. సంస్కృతాంధ్ర నిఘంటువులలోఁ బటోలపద మున్నదికాని పుటోలపదము లేదు. ఇందేదో తప్పున్నది" అని చెప్పెనఁట! తెలుఁగు మఱుఁగు లెఱిఁగిన సహృదయుఁ డొకఁడు "మదపు

తేనుఁగువంటి దీపదము. మదము, ఏనుఁగు సమసించినట్లు జీవనము, ఓలము అను పదములు సమసించినవి. ఓల మనఁగా నర్థ మిది" యని చెప్పి యా సంస్కృత పండితునకు సహాయ పడెనఁట! ఇది యెనుబది యేండ్లక్రిందట నిజముగా జరిగిన కథ! మా నాయనగారు చెప్పఁగా విన్నాను.

"సీతలపేను గంటి నొకనేర్పున శౌరికి లంచమిచ్చి సం
ప్రీతుని జేసి కార్యగతి భేదము సేయఁగఁ జూచె, దింత బే
లైతిగదే సుమేరు సదృశార్థముఁ జూచియుఁబార్థుఁ బాయునే
యాతఁడు క్రీడి భక్తియును నచ్యుతు పెంపును నీ వెఱుంగవే?"

శ్రీకృష్ణుఁడు రాయబారము వచ్చినపుడు విదురుఁడు ధృతరాష్ట్రునితో సంభాషించు సందర్భములోని పద్యమిది. ఇచ్చట సీతలఁపును నేనెఱుఁగుదును అను ముఖ్యార్థమే కాక అది సీతలలోని పేనువంటిదిసుమా అను నర్థాంతరము కూడ నున్నది. ఇక్కడఁ దిక్కన యెఱిఁగియే తలపేను శబ్దచిత్రమును గూర్చినాఁడు. ఇటువంటి శబ్దార్థచిత్రములను దిక్కన్నరచనమున నెన్నింటినేని లెక్కింపవచ్చును. ఆమధ్య నెల్లూరు తిక్కన వర్ధంతిసభలోఁ దిక్కన రచనా విశేషములను గూర్చి చర్చ జరిగినట్లు పత్రికలలోఁ జదివితిని. విరాట ద్వితీయాశ్వాసమున సైరంధ్రినిగూర్చి కీచకుని ప్రలాపములలోఁ దిక్కన యశ్లీలార్థదూషితముగా 'దీనిఁ బొందఁ గాంచు తెఱఁగు నాకెయ్యది యొక్కొ' అని కూర్చెననియు, నది కీచకపాత్రోచితమని యొకరును, 'దీనిఁబొంద' యనుచో నశ్లీలార్థము పరిగణింప నక్కరలేదని మఱికొందఱు

ననిరఁట! ఇప్పుడు ప్రచారములో నున్న తిక్కన విరాటపర్వ ముద్రణము లాతేడింటలోఁ బాఠ మిట్లే ముద్రితమై యుండుటచే నీ యనర్థము వచ్చినది. తిక్కనరచన మిట్లుండదు. ఈ పద్యము పై నాలుగు సీసచరణములందును దీని జన్మంబున, దీని వల్లభుఁడు, దీని నామాకృతి, దీని వసించుట యని సైరంధ్రీవాచక సర్వనామము షష్ఠీసమాసగతమైయుండఁగూర్చి గీతిలో మాత్రము 'దీనిఁబొంద' అని వ్యస్తముగా, నప్రక్రమముగా, నశ్లీలస్ఫోరకముగాఁ దిక్కన కూర్చఁడు. కాన ఇక్కడఁగూడ "దీనిపొందుఁ గాంచు తెలుఁగు నా కెయ్యది యొక్కొ" అనియే యుండవలెను. విరాట పర్వ ముద్రాపకులెల్లరును "దీనిఁబొంద" యనియే గ్రహించుట యనుశోచనీయము. తిక్కన బొందను ప్రయోగింపలేదు. లేఖకులు, ముద్రాపకులు ప్రమాదపుబొందఁబడిరి. విరాటపర్వ ద్వితీయాశ్వాసముననే తిక్కన కవితా మర్మములును, బదలాలిత్యములును, గడుసరికూర్పునేర్పులును నెన్నో యప్రౌఢులైన లేఖకపాఠకముద్రాపకుల మూలమునఁ దార్మారై కానవచ్చినవి. దేసి తెలుఁగు మఱుఁగులెఱింగిన ప్రౌఢాంధ్ర పండితులుగాని గుర్తింపరానివగుటచే ననేక పాఠములు తిక్కనరచనలో నట్లు తార్మారైనవి.

"తన్వంగి మవ్వంపుఁ దనులత నెసగెడు
నునుగాంతి వెల్లువ మునుఁగఁబాఱఁ
గిసలయహస్తకెంగేల నేపారు క్రొ
మ్మించు చను లేయెండ మిగులఁ బర్వఁ

గమలాస్య ముగ్ధ మొగంబు లేమెఱుఁగుల
మొత్తంబుపరి చుట్టు ముట్టికొనఁగ
ధవళాక్షితొంగలి తఱచుఱెప్పల చెన్ను
కప్పనుచీకటి గవియుదేర
బెగ్గలం బంతకంతకు నగ్గలించి,
యొదవి చెమ్మట, చిత్తంబు సెదరి, యెందు
మెలఁగఁ దలఁపేది, యా సింహబలుఁ డనంగు
పట్టి యాడెడు జంత్రంబుపగిది నుండె."

ఈపద్యమునెత్తు గీతియందుఁగల యసమాపక క్రియల నాల్గింటిని సీసపు నాలుగు పాదములకు యథాసంఖ్యముగాఁ గూర్చుకొని యర్థమెఱుఁగఁదగును. కాంతి వెల్లువ కీచకుఁడు మునుఁగునట్లు ప్రవహింపఁగా వానికి బెగ్గల మంతకంతకు నగ్గలమైనది. లేయెండ మిగులఁ బర్వఁగా వానికిఁ జెమ్మట యొదవినది. లేమెఱుఁగుల మొత్తమను సైన్యము చుట్టు ముట్టుకొనఁగాఁ జిత్తము సెదరినది. కనుఱెప్పల కప్పను చీఁకటి క్రమ్ముకొనఁగా నెందును మెలఁగలేక పోయినాఁడు. ఇందు, ఎత్తుగీతి పై యర్థమున కనుగుణముగా ముద్రణము లందుఁ గానరాదు. మఱియు నింకొకపద్యమున, "కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్లుఱికెడు వాలుఁగుసోగల నేలుదెంచి" అని యున్నది. 'ఏలుదెంచి' యనుట తిక్కనప్రయోగముకాదు. ఏఁగుదెంచు, చనుదెంచు, పుత్తెంచు, తోతెంచు ఇత్యాదిగా గత్యర్థసంబంధములగు ధాతువులమీఁదనే 'తెంచు' ధాతు వనుప్రయుక్తమగుట భాషలోఁ గానవచ్చును. తక్కిన

మూఁడు చరణములలోను తెగడి, తూలం(దోలి, ఉక్కు-
డంచి యున్నవి గనుక యిక్కడఁగూడఁ దదనుగుణముగా
'నేలిదించి'యని యుండఁదగును. 'ఎల్లిదించు' రూపాంతరము
'ఏలిదించు'. అవహేళనము చేసి యని యర్థము. ఇంకొకటి-

"సమదవారణము జంగమలత వెనుకొని
సరభసంబునఁ బట్టఁ జనువిధమునఁ
(గూరదానవుఁడు భూచారి నిర్జరకాంతఁ
బొదువ రయమ్మునఁ బోవుభంగి
ఘోరగృ(ధము సుకుమార నాగాంగనఁ
బటుగతి నొడియంగఁ బాఱుకరణిఁ
(బబలబిడాలంబు బాలశారికమీఁద
నడరి సత్వరమున నరుగుమాడ్కి-
సింహబలుఁ డత్యుద(గతఁ జిగురుబోఁడి
పజ్జఁ గదువడిఁ దగిలి కోపంబు గదుర
నొడిచి తలవట్టి తిగిచి మహో(గవృత్తిఁ
గొంకు గొనరించుకయు లేక కూలఁదాఁచె."

ఈ పద్యమున (ద్రౌపది కుపమానములుగా మూఁడు
చరణములలో జంగమలత, భూచారి నిర్జరకాంత, సుకు
మార నాగాంగన యనునవి భూలోకదుర్లభము లున్నవి.
నాల్గవ చరణమునఁగూడ నట్లే కదా యుండవలెను.
మఱియు మూఁడు చరణములలోను (ద్రౌపద్యుపమాన పద
ములు ద్వితీయాంతములుగా నున్నవి. నాల్గవచరణమునఁ
గూడ నట్లే కదా యుండవలెను. ఈ తీరునఁజూడఁగా—

"ప్రబలబిడాలంబు భారతీశారిక నడపఁ సత్వరమున నరుగు మాడ్కి" అని యుండుట బాగు. ఈ 'భారతి శారిక' పదము 'భారతీదేవిముంజేతి పలుకుఁజిలుక' వంటిది.

కీచకుఁడు ద్రౌపదిఁగూర్చి చేయు ససందర్భాలాపములలో నిక్రిందిది యొకటి :

చిత్తము మెచ్చి నావలనఁ జిక్కెఁగ వెండియు నాలతాంగి యు
చ్చొత్తినయట్లు నాకుఁ దన యుల్లము తెల్లము సేయకున్కి దా
నత్తఱిఁ గ్రొత్తకాన్పగుట నద్దము సొచ్చిన సిగ్గుపెంపు న
న్నుత్తలమందఁజేయుటకునో తలపోసి యెఱుంగనయ్యెడిన్.

ముద్రణములో నీపద్యమిట్లున్నది. తిక్కన పలుకుబడిగాని, యర్థపుసొంపుగాని యిందుఁ బొందుపడకున్నది. ఇది యిట్లుండఁగాఁదగునని నాతలంపు :

చిత్తము మెచ్చి నావలనఁ జిక్కెఁగ వెండియు నాలతాంగి యు
చ్చొత్తినయట్లు నాకుఁ దన యుల్లము తెల్లము సేయకున్కి దా
నత్తఱిః గ్రొత్తకాన్పగుట నద్దము సొచ్చిన సిగ్గుపెంపొ ? న
న్నుత్తలమందఁ జేయుటగునో? తలపోసి యెఱుంగనయ్యెదన్.

రాయబార మరుగునప్పుడు కృష్ణునితో ద్రౌపది తన భంగపాటును జెప్పు పలుకులలో—

అంతలు నేసి పోనడిచి యక్కట సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె? యిట్టియూఱటమదిం బ్రియమందె యుధిష్ఠిరుండు దా
నంతన యూళ్లు లేవురకునైదు సుయోధనుఁడిచ్చునొకో? ఈ
కంత కృపావిహీనమతి నాతఁడు నేఁచునె యన్నదమ్ములన్.

ఇందు 'ఈకంత' అనుచోఁ గొందఱు వికటార్థము లనుగూడఁ జెప్పుదురు. ఇక్కడ 'ఒక్కంత కృపావిహీన మతి నాతఁడు నేచు నె యన్నదమ్ములఁ' అన్న పాఠము సుందరము. ఇంతవఱకు నేనిప్పుడు వెల్లడించిన సంస్కరణ ములలో నిది యొక్కటి తక్కఁ దక్కిన వెల్లను తిక్కన హృదయము నూహించి నేనే చేసినవికాని వ్రాఁతప్రతులఁ జూచి చేసినవికావు. ఈ తీరునఁ జూడఁగా దేసి తెలుఁగు మఱుఁగులలో సాటిలేని నేర్పుతో మెలఁగ నేర్చిన తిక్కన సారస్వత భాండారమగు భారతభాగమును సరిగా నుప యోగించుకొనుటకు సమర్థమైన సహృదయ పండితగోష్ఠి జరగవలెను. ఇట్టి పరిశీలనము జరుగనిచోఁ దిక్కన పద ప్రయోగ లాలిత్యము సరిగాఁ బరిజ్ఞాతము కాఁజాలదు.

తిక్కన రచనలో నింకొక వింతతీరు కూర్పును వివ రించుచున్నాను. ఆంధ్ర కవితారచనమున వాక్యముల నసమాపకములుగా పద్యముననుండి పద్యమునకు సాగునట్లు కూర్చుటకలదు. అనఁగా నొక వాక్యము రెండు భిన్న పద్యములలో ననుగతమై యుండు నన్నమాట. పద్యావ సానమునకుఁ, బద్యోపక్రమమునకు నడుమఁ గొంతవిశ్రాంతి యుండును. ఒక వాక్య ముచ్చరించునపుడుగూడ నడుమ విశ్రాంతి యుండఁదగును గనుక ఆకూర్పు అసందర్భముగాఁ దోఁపదు. కాని రెండు భిన్నజాతివియగు పద్యములలో నొక సమాస పదమునే సంధించి కూర్చుట చాల విడ్డూర ముగా నుండును. ద్విపదములు, రగడలు, మొదలగువాని

లోను, మాలికా వృత్తములలోను నాల్గుచరణములకుఁ బద్యము ముగియదు కాన వానిలో నట్లుండవచ్చునుగాక, భిన్నజాతి పద్యముల యవసానారంభములలోనే ప్రధానముగా సంహిత పాటింపవలసిన సమాసపదము తిక్కన రచనలో నున్నది.

"ఒకటి యడిగెదఁ గృప చిగురొత్తఁ జెప్ప
వలయు మీరు మాయింటికి వచ్చి యొక్క
ప్రక్క క్రిందుగ నిరువదియొక్క దినము
లనఘ! నిద్రించి తెది మొదలైన నీదు—
చరితం బద్భుతము మునీ
శ్వర! దీనికిఁ గారణము విచారమున కగో
చర మెఱిఁగింపు మనుడు నా
ధరణీవల్లభునితో నతం డిట్లనియెన్."

'నీదు-చరితము' అన్న సమాసపదము రెండు భిన్నజాతిపద్యముల యంతాదులలో నున్నది. నన్నెచోడ మహాకవికూడ నిట్లొకచోఁ బ్రయోగించినాఁడు:

"రవిపదాహతిఁ జెడియుండు రాజువోలె
నని సరోజము లొందఁ జక్రాహ్వయములఁ
జెట్ట లాడుటకని వికసిల్లుటకును
వెల్లనైనట్లు చుక్కలు వెలరువాఱె."(కుమా. ౮ ఆ.)

దిద్దవలెను. అర్థము కుదురక గ్రుడ్లుమిటకరించి కొట్టుకొని మొట్టకేల కిట్లు కవిహృదయము కనిపెట్టఁగలిగినాను:

"రవిప్రదాహతిఁ జెడి యుడురాజు వోయె
నని సరోజములొద్దఁ జక్రాహ్వయములు
చెట్టలాడుట, కవి వికసిల్లుటకును,
వెల్లనైనట్లు చుక్కలు వెలరువాఱె."

ఉడురాజు = నక్షత్రాధిపతి, చంద్రుఁడు. ఉడిగిపోవు, ముగిసిపోవు రాజు అనికూడ; ఉడుఁబోతపిండె వంటిది. విరోధియైన యుడురాజు పడిపోవుట నాకసమున కెగసి చక్రవాకపక్షులు చూచి యా సంతోషవార్తను మిత్రములైన సరోజముల యొద్దకి వచ్చి, చెట్టలాడుటకును = పడిపోయిన జంద్రుని నిందించుటకును, మఱియు నుత్సాహముతో ఱెక్కలల్లాడు(ర్చు)టకును ననియు. అవి = మిత్రములయిన యా సరోజములు, వికసిల్లుటకును = వాని చెట్టలాట కుప్పొంగుటకును, వికాసము చెందుటకును, నవమానము చెంది తెల్లపోయినట్లు చంద్రుని మిత్రములైన నక్షత్రములు కాంతిహీనములై వెలవెలఁ బోయినవి.

కవిహృదయము పైయట్లు గోచరింపఁగా నాకవి నాకుఁ గనకాభిషేకము చేసినాఁడన్నంత సంతోషముతోఁ దోఁగినాఁడను. మఱికొన్ని :

ఆయవనీరుహోద్గతలతాంతవినిర్గతసౌరభప్రవా
హాయతసాంద్రమై ఘలితమై యొగిఁబర్విన డాయఁబోవనుం
బాయను రాకచుట్ట మధుపవ్రజమాలిక లుండె నొప్పెపు
ష్పాయుధుకాలఁజుట్టు మరుఁడాయసవ్రము వెట్టినట్టిదై.

(నవమాశ్వాసము ౨౯౨ ప.)

దీనికి నా సంస్కరణము:

ఆయువసీరుహోద్గతలతాంత వినిర్గత సౌరభప్రవా
హామతి సాంద్రమై ఫలితమై మొగిఁ బర్విన డాయఁబోవనుం
బాయను రాక చుట్టి మధుపవ్రజమాలిక లుండె నొప్ప పు
ష్పాయుధుశాలచుట్టు మధుఁ డాయసవప్రము వెట్టినట్టులై.

పుష్పాయుధశాల కధికారియైన వసంతుఁ డాయాయుధశాలలోని కెవరికిని రాకపోకల వీలు లేకుండుటకు చుట్టును నినుపకోట పెట్టినట్లు భృంగమాలికలు పూలచెట్లను జుట్టి యున్నవి. పూచిన చెట్లు పుష్పాయుధశాలలు. మధుఁడు తదధినేత. ఇందులోఁ బుష్పాయుధుశాల, మరుఁడు ఉండుట యసంగతము.

సుజనజనైకభూషణము శూరత దుర్జనదూషణంబు స
ద్ద్విజ విబుధాశ్రితప్రతతి వేసుకఁ బ్రోపును రాజ్యచిహ్నగా
క జలమహాభిషేకమునఁ గట్టిన పట్టము వీజనంబు భూ
భుజులక కాక యిన్నియును బుట్టికినైనను లేవె చూడఁగన్.

దీనికి నా సంస్కరణము:

సుజనజనైక భూషణము శూరత దుర్జనదూషణంబు స
ద్ద్విజ విబుధాశ్రితప్రతతి వేసుకఁ బ్రోపును రాజ్యచిహ్నగా
క జలమహాభిషేకమునఁ గట్టిన పట్టము వీజనంబు భూ
భుజులక కాక యిన్నియును బుంటికినైనను లేవె చూడఁగన్?

వనధి నీ రెల్లఁ గొనిపోవఁ గని సహింప
కబ్ధతతి గిట్టపట్టిన సరుగ నోప

కోలి దొంతులు గొనిపడియున్న కారు
మొగుళులనఁ జూచి తటభూమి మొగళు లమరె.
(౧ ఆ. ౧౨౦ ప.)

దీనికి నా సంస్కరణము :

వనధిని ర్ల్లఁ గొనిపోవఁ గని సహింప
కబ్ధితటి గిట్ట పట్టిన సరుగనోప
కోలి దొంతులు గొనిపడియున్న కారు
మొగుళులనఁ బూచి తటభూమి మొగళు లమరె.

అబ్ధికిఁ జుట్టు నబ్ధితటి కాపలా కాయుచున్నట్లును, సముద్రములోని నీటిని మెల్లఁగాఁ బైపైకి మేఘము లెత్తుకొని పోవుటకుఁ జూచి యా యబ్ధితటి యామేఘముల గిట్టలను (వానకాళ్లను) బట్టి యీడ్చి క్రిందఁబడవేయఁగా నవి దొంతులు గొని పడియున్న వన్నట్లు సముద్రతటమున మొగలి చెట్లున్నవి. ఆ మేఘములలోని మెఱపులా యనునట్లు మొగలి పూవు లున్నవి.

తను వసితాంబుదంబు సితదంతయుగం బచిరాంశు లాత్మగ
ర్జన మురుగర్జనంబు గరసద్రుచి శక్రశరాసనంబు నై
చన మదవారివృష్టి హితసస్య సమృద్ధిగ నభ్రవేల నాఁ
జను గణనాథుఁ గొల్తు ననిశంబు నభీష్టఫలప్రదాతగాఁ .
(౧ ఆ. ౭ ప.)

దీనికి నా సంస్కరణము :

తను వసితాంబుదంబు సితదంతముఖం బచిరాంశు వాత్మగ
ర్జన మురుగర్జనంబు గరసద్రుచి శక్రశరాసనంబు నై

చన మదవారివృష్టి హితసస్య సమృద్ధిగ నభ్రవేళ నాఁ
జను గణనాథుఁ గొల్తు ననిశంబు నభీష్ట ఫలప్రదాతగాఁ.

విఘ్నేశ్వరుఁ డేకదంతుఁడు కాన సితదంతయుగంబని యుండరాదు. అచిరాంశువు = మెఱుపు. అది ఉపమానము కాన అప్పుడప్పుడు మాత్రమే కన్పునదిగా నుండవలెను. సితదంతముఖంబనుటలో నోరు తెఱచినప్పు డగపడుట, మూసినప్పు డగపడకుండుట దంతాగ్రమునకు కలిగి యచిరాంశుసామ్యము సిద్ధించును.

"ముదమున సత్కవి కావ్యము
నదరఁగ విలుకానిపట్టినమ్మును బరహృ
ద్భిదమై తలయూఁపింపని
యది కావ్యమె మలరి పట్టినదియును శరమే?"
(౧ ఆ. ౪౧)

వ్రాఁతప్రతిలో నీపద్య మిట్లున్నది :

"మదమున......కావ్యము
నదరంగ విలుకాని పట్టినమ్మును బరహృ
ద్భిదమై తలయూపింప్పని
యది గావ్యమె మరి పట్టినదియుఁ శరమే."

దీనికి నా సంస్కరణము:

"ముదమునఁ గవికృతి కావ్యము
నదరున విలుకాని పట్టినమ్మును బరహృ
ద్భిదమై తలయూపును, బెఱ
యది కావ్యమె చెప్పఁ, బట్ట నదియుఁ శరమే?"

ముదముతోఁ గవి రచించిన కావ్యమును, అదరుతో విలుకాని పట్టిన యమ్మును ఒరుని హృదయభేదనము గావించి తలయూపించును. అట్లుకానివో, రచించినంతమాత్రముచే నది కావ్యముకాదు. చేతఁబట్టినంతమాత్రముచే నది శరమును గాదు. కావ్యమును, శరమును రెండును బర హృదయభేదనముచేసి తల యూపించునవే కాని కావ్యము దానిని ముదముతోఁ జేయును; బాణ మదరుతోఁ జేయును. ముద్రితప్రతిలోని, వ్రాఁతప్రతిలోని పాఠములకు సరసాన్వయము కుదురలేదు.

"జా సతి పశుపతి నుఱక వి
ధాన మహారంభుఁడైన దక్షుఁడను న
జ్ఞానికి మునుకొని వచ్చిన
మానంబున నమర సతివిమానము వచ్చెన్."

(౨ ఆ. ౧౫౦ ప.)

దీనికి నా సంస్కారణము:

"జా నతి పశుపతి నుఱక వి
తానమహారంభుఁడైన దక్షుండను న
జ్ఞానికి మునుకొని వచ్చి వి
మానంబున నమర సతివిమానము వచ్చెన్."

౭

# ఆంధ్రకవిత-ప్రబంధయుగము

---

ఆంధ్రకవితాకలాకాంత రత్నహారమునఁ శ్రీకృష్ణదేవరాయల కాలమొక తరళ రత్నము. ఆ మహారాజు సుకృతవిశేష మెట్టిదో కాని, యాంధ్రకవిత యాతని పాలన కాలమున దివ్య వైభవ మనుభవించినది. దివ్య సౌందర్యము తీర్చుకొనినది. తిక్కని తీరుం దిద్దుకొనినది. ఔచితీ నిర్వాహమలవఱచుకొనినది. సంస్కృతమునందుఁగాని, నాటి భాషలగు కర్ణాట ద్రవిడములందుఁ గాని కానరాని కావ్యవస్తు కల్పనపు మెల్పులను గల్పించుకొనినది. విక్రమార్కుని యాస్థానిలో నవరత్నము లున్నట్లు శ్రీకృష్ణదేవరాయని యాస్థానియం దష్టదిగ్గజము లనఁబడెడు కవులు వెలసి, 'నభూతో నభవిష్యతి' యనఁదగినట్లు వింతతీరున మహాప్రబంధములు విరచించిరి. ఆనాఁటి కృష్ణరాయఁ డాంధ్రి కవిరత్నరత్నాకరుఁడు. ఆ మహారాజు దక్షిణ హిందూదేశమునకెల్ల నేకచ్ఛత్రాధిపత్యము వహించి యటు కటకమునుండి యిటు కన్యాకుమారిదాఁకఁ గల దేశమెల్ల విజయయాత్రలోఁ దిరిగి చూచినవాఁడు. కాన తన తిరిగిన దేశములలోఁ గానవచ్చు కవిరత్నములనెల్ల 'రత్నహారీ తు పార్థివ' యన్న న్యాయము చొప్పునఁ గొనితెచ్చికొనెను.

కృష్ణాతీరమున నద్దంకినుండి మాదయ గారి మల్లనను, కడపమండలముననుండి పెద్దనామాత్యుని, నెల్లూరి మండల ముననుండి నందితిమ్మనను, గుంటూరి మండలముననుండి పింగళి సూరన్నను, తెనాలి రామలింగని, నింక ననేక మండల ములనుండి యనేక కవులను నార్జించి తన సాహితీ సభాంగ ణము నలంకరించు కొనెను. 'సాహితీ సమరాంగణ సార్వ భౌముఁ' డనఁబరగెను.

దశమ శతాబ్దిలో నారంభమయి యిర్వదవ శతా బ్దిలో నేఁడు సాగుచున్న యాంధ్రకవితకుఁబదునాఱవ శతాబ్ది ప్రథమపాదము సరిగా మధ్యస్థమే కదా! అది యాంధ్రకవితా దివ్యస్రవంతికి గాంభీర్యము, లోఁతు చాలఁగాఁగల నట్ట నడి యేటిపట్టు! చాళుక్యరాజరాజు, తెలుఁగు చోళరాజు మనుమ సిద్ధి, కాకతీయ ప్రతాపరుద్రుఁడు, రెడ్డిరాజ సముచ్చ యమునను నాశ్రయానుక్రమమున సాగివచ్చిన యాంధ్రకవి తకు శ్రీకృష్ణరాయని యాశ్రయము పైవిధమున ననిదం పూర్వమయిన యభ్యుదయముఁ జేకూర్చిన గట్టి పట్టుగొమ్మ.

ఎడనెడ నన్నయాదుల పురాణరచనలలోను, నన్ని చోడని కుమారసంభవము, ఎఱ్ఱన నృసింహ పురాణము, మంచన కేయూరబాహు చరిత్రము, దొరకలేదు కాని తిక్కన విజయసేనము, శ్రీనాథుని శృంగార నైషధము, దుగ్గన నాచికేతోపాఖ్యానము మొదలగు కృతులలో రాయలనాఁటి ప్రబంధరచనావ్యాప్తి యించించుకగా మొల కెత్తినది. శ్రీకృష్ణరాయని కాలమునఁ బర్యాప్త వైభవ

ముతో నిండారి వెలసిన ప్రబంధరచనా సంప్రదాయ వాహి
నికిం దత్పూర్వరచన లెట్లెట్లాటకాల్వలయినవో యించుక
వివరింతును.

పదునైదవ శతాబ్దిదాఁక నాంధ్ర కవితా రచన
పురాణపరివర్తనప్రాయమై యున్నది. కాని దానిలోఁ గవికి
స్వైరవిహారమును గావింప నవకాశము తక్కువ. సంస్కృత
పురాణములు ప్రాయికముగా సత్యార్థరచనాపరము లగుట
చేత నందుఁ గవికల్పిత కథలలోవలె నౌచితీ నిర్వాహ
మంతగా నుండదు. మఱియు నా పురాణకర్త లేవో పరమార్థ
ముల నిరూపించుటే ముఖ్యముగాఁ గొన్నవారగుటచేతను,
నౌచితి నంతగాఁ బాటింపకయుఁ బోయిరి. యుద్ధరంగ
మున గీతోపదేశము, నారణ్య శాంత్యానుశాసనిక పర్వముల
లోని కథాకల్పనములుఁ గావ్య శిల్పదృష్టితోఁ జూడఁగా
నౌచితీదూరము లగును. కాశీఖండమున నొకచోటఁ బతి
వ్రతా ధర్మములు చెప్పుట పరమార్థముగాఁ గొనుటచే
లోపాముద్రతో వ్యాసుఁ డుపన్యసించుటలో నౌచితీభంగము
వాటిల్లినది. ఇట్టివానిని బురాణములఁ దెలిఁగించువారు
తొలఁగించుకొన వీలుకాదయ్యెను. కావ్యమున కౌచితి జీవ
గఱ్ఱ! కావ్యమునకే యేమి? లౌకికమయిన సర్వవాగ్వ్యవ
హారమునకును నౌచితి ముఖ్యమే కదా! దీనిని బాటించు
టకుఁ గవికి స్వాతంత్ర్య ముండవలెను. అందుకే శాకుంత
లాది నాటకములయందుఁ బురాణకథలకు మార్పులును,
దద్రక్షకై 'అన్యథా వా ప్రకల్పయేత్' అన్న శాస్త్ర

మును నేర్పడినవి. ఆంధ్రకవితాసంప్రదాయము ప్రాయిక
ముగా సంస్కృతపుఁ దీరు ననుసరించి పుట్టినది గాన సం
స్కృతమునఁ బురాణములకుఁ దర్వాత వెలసిన కావ్యనాట
కముల యనంతర మాంధ్రమునకును నావశ్యకముగాఁ గవు
లకుఁ దోఁచెను. ఆ తలఁపు చొప్పుననే నన్నెచోడ కుమార
సంభవ, కేయూరబాహు చరిత్ర, క్రీడాభిరామ, హరవిలాస,
శృంగార నైషధ, శృంగార శాకుంతల, ప్రబోధచంద్రోద
యాదు లాంధ్రమున వెలసినవి. మహాకావ్య పద్ధతిని వెలసిన
కుమారసంభవ, శృంగారనైషధాదులుగాక నాటక పరివర్తి
తములైనఁ గేయూరబాహు చరిత్ర, క్రీడాభిరామ,
శృంగారశాకుంతలాదులు గూడ శ్రవ్యములుగానే, చంపూ
కావ్యములుగానే తెలుఁగున రచితములైనవి. నాటకము
యందు వచనభాగ మెక్కువగా సంభాషణాత్మకముగా
నుండును. సరిగా వానిని దెలిఁగించుటలోఁ బొడిపొడి వచనము
లట్లే తెలిఁగింపవలసి యుండును. ప్రాచీనకాలమున దేశభాషా
రచనలలో వచనరచనమీఁద నాదరము లేకుండెను. అందు
రచనాశిల్ప మంతగా నుండదని యప్పటివారి తలఁపు గాఁబో
లును! నియమబద్ధములుగాని పొడి వచనరచనలు తాళ
పత్రాది లిపులలో వికృతిఁ జెందకుండ సంరక్షించుట యసా
ధ్యముగాఁ గూడ వారు తలఁచియుండవచ్చును. ఇవియో,
కారణ మింక నేదో కాని నాటకాంధ్రీకరణమున వా రట్టి
పొడిసంభాషణపు వచనములఁ గూడ పద్యరచనలలోనే
జరపి యా నాటకములనుగూడ శ్రవ్యకావ్యములుగానే

సాదివిభాగములు నున్నవి. ఇట్టి ప్రబంధములు వెలయుటచే నానాఁ డింక రఘువంశాదులవంటి మహాకావ్యములయుఁ, గాదంబర్యాదులవంటి గద్యకావ్యములయు, శాకుంతలాదుల వంటి నాటకములయు నావశ్యకత తెల్గునకు లేకపోయినది.

ప్రబంధములలో విరివిసెందిన ప్రాచీన రచనాంకురములను గొన్నింటిని, ప్రబంధములలో నాటక కావ్యానుకరణములను గొన్నింటిని మచ్చున కుదాహరింతును. మార్కండేయ పురాణ కథ ప్రబంధమార్గమున విరివిసెందిన మనుచరిత్ర మయినది. అందు మృగవర్ణనచమత్కార మెల్లఁ బినవీరన్న శృంగార శాకుంతలములోని మృగయావర్ణనమును బట్టి పుట్టి పెరిగినది. వర్ణనలెల్లఁ గావ్యసంప్రదాయము ననుసరించి విపులముగా సాగినవి. వరూథినీప్రవర సంవాదము మేలయిన నాటక సంభాషణాచ్ఛాయను బొందు పడినది. శ్రీనాథుని కాశీఖండములోని 'గుణనిధి కథ' పొందుపడంగ కవి నిగమశర్మోపాఖ్యానముగాఁ బెరిగినది. అంతేకాక యీ కథ కందుకూరి రుద్రకవినోర నిరంకుశోపాఖ్యాన ప్రబంధముగానే విరివిసెందినది. పారిజాతాపహరణ ప్రభావతీ ప్రద్యుమ్నములు మహాకావ్య నాటక ధర్మముల కలయికతో వెలసినవి.

శ్రీనాథుని కాశీఖండ పద్యమిది—

"ముడువంగ నేర్తురు మూల దాపటికి రాఁ
జికురబంధము లీఁగ జీరువాఱఁ

పొన్న పువ్వులఁబోలు పొక్కిళ్ళు బయలుగాఁ
గట్టనేర్తురు చీర కటిభరమునఁ
పొమసంగ నేర్తురు నిడువ్రేలుఁ జెవులందు
నవతంసకంబుగా సల్లిపువ్వు
సవరించనేర్తురు పదియాఱువన్నియ
పసిఁడి పాదంబులఁ బట్టువెంప

ఒయ్యారయు సిగ్గుఁ బాలింపఁ బ్రాకసిరు
తెఱచు పూయుదు రోలగందంబు పసుపు
బందికత్తెలు సురతప్రపంచవేళఁ
గంచియఱసత సమాప్తి ఖడ్గలతలు”

శ్రీకృష్ణరాయుని యాముక్తమాల్యదలో—

“సిరెంపుఁ బలుకెంపు పిరిసి వెన్నెలగాయ
సరిగొంజ నొకటఁ బల్వరుసఁ దోమ
నొరసి యొత్తిన ముఱుం గొందక మైనని
గ్గులు దేరఁ బసుపడి జలకమాడ
ముడుక గాకుంపఁ బయ్యెద లోనఁ గేలార్చి
కలయఁ జాటను వెంటఁ గలప మలఁద
నిశిరయచ్చిన్న సూత్రమునఁ జిక్కక ముత్తె
ములు రాల గరగరికలు వహింపఁ

బాలసిసనె యెట్టి నరునైనఁ గులము దెలియఁ
ప్రభుత సెడి పల్లవ్రుఁడు వేదవడిన నేద

స్తుతి వెలయించెప్పుడిపుడుగా నెన్న మెలఁగ
బాసఁ గృతి సెప్పవలెఁ దను ప్రసన్నముఖుఁడు."

అన్న పద్యముగా వ్రాసెను.

ఇట్లు పాడిపాడిగాఁ బ్రాచీనాంధ్ర గ్రంథచార్యులు కృష్ణరాయలవారిఁగూర్చి ప్రబంధములలో నెన్నింటినేని గుర్తింప నచ్చును.

సర్వ ప్రబంధరచనా సౌభాగ్యములు పొసఁగి యున్న 'పారిజాతాపహరణము' ను బరిష్కరించుకొని ప్రబంధ కవితా విశేషములఁ గొన్నింటిని బేర్కొందును. పారిజాతాపహరణ కథాకల్పన మొక ప్రశస్త నాటకకథా కల్పనము! ఎట్లనఁగా --

శచీదేవినగరిలో దేవేంద్రుఁ డుండఁగా శ్రీకృష్ణుని దర్శించుటకై భూలోకమునకుఁ బోఁగోరి దేవర్షియగు నారదుఁడు ప్రభువగు దేవేంద్రుని యనుజ్ఞ వడయుటకై యచటికి వెళ్లెను. అప్పుడు శచీదేవి కల్పవృక్షపు దివ్యకుసుమములను గోయించి తెప్పించి పార్వతి సరస్వతి రతి దిక్పాలకపత్నీ ప్రముఖ దివ్యాంగనల కా పుష్పములను పంపకములు వెట్టి పంపుచుండెను. కడమ పుష్పములను దేవేంద్రుని హజారమున శయ్యకు నలంకారముగాఁ బెట్టించుచుండెను. అపుడు సన్నిహితుఁడై యున్న నారదునికిఁగూడ దేవేంద్రుని ప్రేరణమున శచీదేవి యొకపుష్పము నొసంగెను. ఆపుష్పము నతఁడు 'శ్రీకృష్ణార్పణ మస్తు' అని గ్రహించి భూలోక

మునకుఁ బోవుచుంటి నని విన్నవించుకొనెను. దేవేంద్రుఁ డది విని శ్రీ కృష్ణునకును, నాతని దేవేరులకును జాలినన్ని పుష్పముల నీయ శచీదేవిని గోరెను. శచీదేవి యివి దివ్య కుసుమము లనియు, వీని ధరింప దివ్యులేకాని భూలోకవాసు లనర్హు లనియు, నీ పుష్పముల గౌరవము నిల్పు టావశ్యక మనియు, భూలోకవాసుల కివి నా చేతి మీఁదుగా నొసఁగ ననియు నిరసించి పలికెను. నారదుఁడు సత్యభామ పేరెత్తి నేమో సణుగుకొనుచు హజారమును వీడి భూలోకమునకు విచ్చేసెను. ఇది విష్కంభరూప ప్రథమాంక పూర్వ కథ.

పారిజాతాపహరణమునఁ బ్రథమాశ్వాసము ప్రథ మాంకము. శ్రీకృష్ణుఁడు రుక్మిణియింట వినోదించుచుండుట, యపుడు సత్యభామ చెలికత్తెగూడ నచట నుండుట, నారదుని ప్రవేశము, పారిజాత పుష్ప సౌభాగ్యవర్ణనము, శ్రీ కృష్ణున కా పుష్పము నొసఁగుట, శ్రీ కృష్ణుఁడు నారదసూచనలఁబట్టి కథా రహస్య మెల్లఁ గనుగొనుట, నారదుని కనుసైగ చొప్పున రుక్మిణి కా పుష్పము నిచ్చుట- యిత్యాదికము కథావస్తువు. ద్వితీయాంక కథావస్తువుగూడ నిందుఁ గొంత గలసియున్నది.

చెలికత్తె సత్యభామతో జరిగిన విషయముఁ జెప్పుట చేత సత్యభామకోపము, శ్రీ కృష్ణుని యనునయము, భూలోకమునకుఁ గల్పవృక్షమును బెఱికికొని వచ్చునట్లు ప్రతిజ్ఞ సేయుట, స్వర్గగమనము . ద్వితీయాశ్వాసేతివృత్తము.

తృతీయాశ్వాసమే తృతీయాంకము. స్వర్గవీథులలో శ్రీకృష్ణుని పయనము, ఇంద్రసత్కారము, ఇంద్రుని హజారమునఁ గాక శ్రీ కృష్ణుఁ డదితి హజారమున విడియుట, శ్రీ కృష్ణ సత్కారాదికము, సత్యా శ్రీకృష్ణుల వన విహారాదికము నిందలి కథాంశము.

చతుర్థాశ్వాసమే చతుర్థాంకము. పారిజాతోత్పాటనము, ఇంద్ర శ్రీ కృష్ణ సంగరము నిందలి కథాంశము.

పంచమాశ్వాసమే పంచమాంకము. సత్యభామ తన విభునిచే పారిజాతమును భూలోకమునకుఁ గొనితెప్పించి ద్వారకానగరమునఁ బ్రతిష్ఠించుట - సత్యభామ పుణ్యక వ్రతము చేయుట- సత్యభామ శ్రీ కృష్ణుని నారదునకు దానమిచ్చుట-పారిజాత పుష్పములను శ్రీకృష్ణుని పత్నులకు, ద్వారకావాసుల కెల్లరకును గూడఁ బంచిపెట్టుట-శ్రీ కృష్ణుఁడు భూలోకమున నుండునంత దాఁక కల్పవృక్షము భూలోకమున నుండున ట్లేర్పాటగుట - భూలోక వాసులకు సర్వ సౌఖ్యములు సమకూడుట యిందలి కథాంశము.

దీనిని నాటకముగా 'నారద విజయ' మని కాని, 'శచీ గర్వభంగ' మని కాని పేర్కొనఁదగును. నారద విజయ మనుటయే యెక్కువ సంగతము. విష్కంభాదిగా నేను జెప్పిన యీ కథాసూత్రమెల్ల నంది తిమ్మనార్యుఁ డీ ప్రబంధమున గుర్తింపఁదగినట్లు సూచించియే యున్నాఁడు. నరకాసురు నోడించి నర్గమును దనవల్లభునకుఁ గైవస మొన

గ్నిన సత్యభామమహోన్నతిని మఱచిన శచీదేవికి నార దుడు కల్పించిన గర్వభంగ మిది! కథామధ్యమున—

"వినుఁడు సురేశ్వరు వనపాలకులు వార్ధిఁ
బొడమిన యీ దివ్య భూరుహమును
కింద్రాణి యెవ్వతె? యింద్రుండు నెవ్వండు?
తోడి యిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడు చేగొనుఁగాక
యొకతెర యిద యేమి యొకరి సొమ్మొ?
ఇదె నాదు పతిచేత నీ నదాన్యవనంబు
నొడియించుకొని యేఁగుచున్నదాన
బలుకు లేటికిఁ దా వీరపత్ని యేని
మీ శచీదేవి తనదు ప్రాణేశుఁడయిన
మఘవు నిటఁబంపు సత్యభామావిధేయు
వలన మరలంగఁ గొనుట పో వాసితనము"

అని సత్యభామ యనును.

ఈ విధముగాఁ బారిజాతాపహరణము నాటక ధర్మ మెంతో సంతనగా నవరించుకొన్న రుచిరప్రబంధము. ఇందు వాచ్యమయిన యీ కథేతివృత్తమే గాక వ్యంగ్య ముగా నింకొక కథేతివృత్తము గూడ నున్నది. వాచ్యకథలో శ్రీకృష్ణుఁడే వ్యంగ్య కథలో శ్రీకృష్ణదేవరాయఁడు. రుక్మిణీ సత్యభామలే తిరుమలదేవి చిన్నాదేవులు. కవియే నారదుఁడు. ప్రియుఁడగు కృష్ణరాయని యాదర తారతమ్య

ముచే సతులలోఁ బోరి పెర్చుచుట, ఆ పొరపును దీర్చి యాను కూల్యముఁ గల్గించి నంది తిమ్మనకవి శ్రీకృష్ణరాయని తన చెప్పుచేఁతలకు దిద్దుకొనుటయే పుణ్యకవ్రతవిధానము.

ఇట్టి మహాప్రబంధము వాచ్యేతివృత్తమునకుఁ జాటున ధ్వనిగా నింకొక యితివృత్తమును వెలయించుచున్న ధ్వనిప్రధానమైన యుత్తమ కావ్యము. ఇందు మహాకావ్యమున నుండవలసిన ప్రయాణోద్యాన వనవిహార జలక్రీడా దౌత్య యుద్ధాది వర్ణనలు బలవంతముగాఁ గావ్యత్వసిద్ధికై కల్పించిన వర్ణనలుగాఁ గాక నాటకకథలో నత్యావశ్యకముగా నపేక్షితము లయి నాటకాంగములు గానే పొసఁగుట గొప్ప చమత్కారము! కవి స్వతంత్రుఁడై యీ కథలోఁ దననాఁటి శ్రీకృష్ణదేవరాయల మహారాజ్య వైభవములను శ్రీకృష్ణదేవుని వైభవములతో జోడించి వర్ణించినాఁడు. ఇది చదువుఁడు :

"అమరవిభుండు దూరమున నంబుజనాభునిఁ గాంచి సంభ్రమో
ద్యమమునఁ జేతియంకుశము ముఖంబునఁ గుంభములూఁద కుంచితా
గ్రిమ చరణంబున న్మదకరిం డిగి యంసతలంబు కల్పచే
లము నడుమన్ బిగించుచు నిలాంబిహితాత్మశిరఃకిరీటుఁడై"

ఈ పద్యము "ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిల్పి కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె" నన్నట్లు పెద్దనకుఁ, దనకు, నింక నితరకవులకు శ్రీకృష్ణరాయఁడు గజా

రూఢుఁడై యూరేఁగునప్పుడు జరుగుచు వచ్చిన సత్కారములను బట్టి పుట్టినది.

"జలరుహనేత్రుఁ గాంచి పరిసత్వము మీఱఁగ నొక్క వేలుపుం
జెలువకలకొల్కి రాచిలుకఁ జేఁ బలికించిన సత్యభామకా
కలికి తెలుంగు శౌరి విడకన్నుల సన్నలఁ జూపెఁ గోపికా
వళికలుపారియాత్రిక వలసంబులు నా సతి దన్నదల్పఁగన్."

ఈ పద్యము శ్రీకృష్ణరాయుఁడు గజారూఢుఁడై దేవోత్సవాదులం దూరేఁగునప్పు డనుభవించిన యనుభవ విశేషములకు జ్ఞాపకముగాఁ బుట్టినది.

"కలికి విభువాలుఁ గన్నుల
తళుకులు మరుఁడీఁపశిఖలుఁ దడఁబడ మిన్నుల్
నిలయముల జిమ్మిరి కొందఱు
నెలఁతలు కృష్ణక్షితిప నీరాజనముల్."

శ్రీకృష్ణరాయని యంతఃపురానుభవమునకు జ్ఞాపకము—

"దరమీలన్నయనంబులై గృహబహిర్ద్వారంబులున్ శ్యామకుం
జరముల్ గాఢమదభ్రమద్భ్రమరికా ఝంకార సంగీత వి
స్ఫురణల్ సూపుచుఁ గర్ణతాళనినదంబుల్ మించ నీమాగధ
స్తారముం బోలుచుఁ జూడ నొప్పె నిభహస్తన్యాసముల్ మీఱఁగన్."

రాయలవారి ముఖసాలలో జరుగు ననుభూతులకిది జ్ఞాపకము—

"తామరలవ్రేటు లాడుచోఁ దరుణు లెత్తు
కరరుహాంకిత బాహువల్లరులు వోలిచె
బిరుదవర్ణావళీ పరిస్ఫురితమైన
పల్లవాస్త్ర జయస్తంభ పటలి యనఁగ."

పొట్నూరు మొదలగు స్థలములందు రాయలవారు శాసనములతోడి విజయస్తంభము లెత్తించుటకు జ్ఞాపకముగా నీ పద్యము పుట్టినది. ఇట్టి పద్యములు నింక నెన్నింటి నేని యెత్తి చూపవచ్చును.

"నిరుపహతి స్థలంబు రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే?"

అని పెద్దనాదు లనఁదగినట్లు శ్రీకృష్ణదేవరాయఁడు తన యాస్థానకవులకు రాజస మలవఱచి వారిని బోషించినాఁడు గాన వారును నప్పటి రాజులయుఁ, బ్రజలయు సుఖానుభూతుల కనుగుణముగాఁ బ్రబంధములను రజోవృత్తి ప్రధానములుగానే రచించినారు. పురాణకృతులలోని సాత్త్వికత యిందు సన్నగిల్లినది.

కాలక్రమమున నీ ప్రబంధముల రాజసత విపరీతమై వెఱ్ఱితలలు వేయఁజొచ్చినది. ప్రబంధకవితారచనపు మహావైభవమును గూర్చియే దిఙ్మాత్రముగా నీ ప్రశంస.

౮

# అరసున్న

తెలుఁగుభాషకుఁ దోడిభాషలగు ద్రవిడ కర్ణాటకము లందుఁగాని, ప్రకృతులగు సంస్కృత ప్రాకృతభాష లందుఁగాని యరసున్న లేదు గదా! అట్టిచో నిది తెలుఁగున నెప్పుడు పుట్టినది? ఎట్లు పుట్టినది? భాషాలక్షణములను బరిశీలించుచుఁ బూర్వపూర్వకాలమునకుఁ బోనుపోను ద్రవిడ కర్ణాటాంధ్రభాషల భేదము తక్కువతక్కువై మూఁడు నొక్కటిగానే యున్నకాలముగూడ నొకప్పు డుండుటను మనము గుర్తింపఁగలము. నన్నయకుఁ బూర్వకాలమున నీ యరసున్న యున్నదనుట కాధారము నాకుఁ గానరాకున్నది. నన్నయాదుల నాళ్లనుండియే యరసున్న వెలయఁజొచ్చి నట్లు వారి గ్రంథములఁబట్టి గుర్తింపనగుచున్నది. సహజముగాఁ బదమందున్న యొక యక్షరమునకో, కొన్ని యక్షరములకో ఆదేశమై వచ్చినదిగాని నాసిక్యహల్లు ఇతరహల్లుతో సంయుక్తమయినప్పు డేర్పడిన హల్ ద్విత్వము శిథిలము కాఁగా నందలి శిథిలానునాసికమే యరసున్నగా నన్నయాదుల కాలమునుండి మాఱె నని చెప్పఁదగును. దీని కించుక వివృతి—

ద్రావిడ కర్ణాటభాషలలో సంయుక్తహల్లులు పూర్వా క్షరమునకు గురుత్వమును గల్పింపకుండుట పెక్కులు గలవు. అట్టివానిలో పెక్కింటి ద్విత్వము తెలుఁగుఁదనము నేర్పడి నేర్పడినాఁటికి మాసిపోయినది. తెగడ్గుం, నెగడ్గుం ఇత్యా దులు తెగడుఁ, నెగడుఁ ఇత్యాదిరూపములఁ బడసినవి. హల్ ద్విత్వములో ద్వితీయహల్లు లోపించినప్పు డిట్టిరూపము లేర్పడినవి. మొదటిహల్లు లోపింపఁగా నేఁటి మన యీ సున్న నైనది. మెఱున్ = మెఱుపు. దీనిమీఁద బహువచనప్రత్యయ మగు 'కళ్' గలయఁగా 'మెఱుమ్గళ్' అయ్యెను. 'కళ్' ప్రత్యయమే తెలుఁగుఁదనమును బడయునాఁటికిఁ బెక్కుశబ్ద ములమీఁద 'గులు' గాను 'గలు'గాను, 'కులు' గాను 'కలు' గాను మాఱి, తొలియక్షరములగు 'గు' 'గ' 'కు' 'క'లు ప్రాతి పదికమునఁ గలసి బహువచనప్రత్యయముగా, 'లు'మాత్రమే మిగిలెను. అడుగులు, నుడుగులు, గొడుగులు, పెంఁగలు, ఈఁగలు, కోలఁకులు, ఎలఁకులు, చిలుకలు, ఎలుకలు ప్రభృతు లిట్టివే. క్రమముగా మెఱున్గుళ్, మెఱున్గుల్, మెఱున్గుళు, మెఱున్గులు అను రూపము లేర్పడెను. ఇక్కడ వికల్పముగా శిథిలద్విత్వ మేర్పడుటచే మకారమును ఊఁది పలుకుట, తేల్చిపలుకుట యను భేదముచే రెండు రూపము లేర్పడినవి. ప్రాకృత సంప్రదాయమునుబట్టి వర్గానునాసికములకు సున్న పెట్టుట యేర్పడఁగా 'మెఱుంగులు' అను రూప మేర్పడెను. ద్విత్వము శిథిలము కానప్పుడు ప్రాయికముగా 'మెఱుంగ్గులు' అను లిపియును, శిథిలమయినప్పుడు 'మెఱుంగులు' అను లిపి

యును ఉండెను. లిపిలో అరసున్న ప్రాఁత మున్నూఱేండ్లకు ముందు లేనేలేదు. ఈ బహువచనరూపమునుండి ప్రత్యయాపాయమగు 'గు' ప్రాతిపదికమునఁ జేరఁగా మెఱుంగు, మెఱుఁగు అని యేకవచన రూపములు పుట్టెను. నన్నయ నాఁటికి కీ పరిణామము ప్రబలమయి శిథిలద్విత్వ మను వ్యవహారము శిథిలము కాఁజొచ్చినది. ప్రాకృత సంప్రదాయము చొప్పున వర్గానునాసికము తొలిహల్లుగాఁగల సంయుక్తాక్షరములందు అనునాసికమునకు బదులు సున్నముంచు సంప్రదాయము పెంపొందఁజొచ్చినది. కర్ణాటకభాషలోఁ గొన్ని శబ్దములు ద్విత్వమునకు నిత్యముగాను, గొన్నిఁటికి వైకల్పికముగాను శైథిల్యము గలదు. అట్టి పదములు మన తెలుఁగుదనమును బొందునాఁటికిఁ గొన్ని యశిథిలద్విత్వములుగానే నిలిచినవి. కొన్నింట ద్విత్వము లోపించి మొదటిదో, రెండవదో ఏదో ఒక హల్లే నిలచినది. కొన్నింట ద్విత్వము విడఁబడి నడుమ నచ్చు గూడినది. కొన్నింట నాసిక్యముగాని, తొలిహల్లు లోపించి తత్ స్థానమున నాసిక్యహల్లేర్పడినది. కర్ణాటకశిథిలద్విత్వములకును, తెలుఁగు శిథిలద్విత్వములకును గొన్ని భేదములు గలవు.

మీఁదఁ జేర్కొన్న పదములలో వెలఁగలు, ఈఁగలు, కొలఁకులు, వలఁకులు అనువానిలో నిట్టి అరసున్నలు పుట్టినవి. వెలఁగచెట్టునకు అఱవమున 'వెలమ్' అని పేరు. 'వెలమ్ గళ్' నుండి 'వెలఁగలు' వచ్చెను. ఈఁగలు – ఈ పదములో 'ఈ' ప్రాతిపదికము, కళ్ ప్రత్యయము కలిసి పరిణామములఁ

బొంది తెలుఁగుఁదనము వచ్చునాఁటికి ఈఁగలు బహువచన రూపముగాను, ఈఁగ ఏకవచన రూపముగాను నయ్యెను. అవయవమున ఈఁగకుఁ బేరు 'ఈ' అనియే. బహువచనమున నది 'ఈగళ్' అగును. కాని యిందు శిథిలద్విత్వ తల్లోపాదిక మేదియు లేదుగదా, 'ఈఁగలు' అని తెలుఁగున నరసున్న యెట్లు వచ్చెను అని ఆక్షేపము తోఁచును. పరిశీలింపఁగా నిందు శిథిలద్విత్వము కలదని యేర్పడును. మఱియొకకు 'ఈ' అను పేరు అది చేయు ధ్వనిని బట్టి వచ్చెను. దాని ధ్వనియగు ఈకారము అచ్చులలోనిదగు తాలుజన్యమయిన 'ఈ' మాత్రమే కాదు. ఈ ఈకారము ప్రధానముగా నాసిక్యము గూడ నగును. ఒక రేదేని చెప్పుచున్నప్పుడు వినువారు 'ఊఁ కొట్టుట'లో ఊకారముకూడ నిక్కి ఓష్ఠ్యము మాత్రమేకాక నాసిక్యముగూడ నగును. ఈఁగల ధ్వనిని, ఊఁకొట్టుటను నుచ్చరించునప్పుడు ముక్కుతో నుచ్చరింపవలసియుండును. ముక్కు మూసికొని వీని నుచ్చరింపఁ గుదురదు. కావున ఈఁగల ధ్వనిలోని ఈకారమునకును, ఊఁకొట్టుటలోని ఊకార మునకును అంతమునఁగల నాసిక్యధ్వని 'గళ్' పరమయి నప్పుడు కవర్గానునాసికమగు 'ఙ్'గా వినవచ్చును. అప్పుడు ఈఙ్గళ్, ఊఙ్కొట్టు పదములు వచ్చును. పూర్వోక్తవిధ మున నివి వికల్పముగా శిథిలద్విత్వములై యనునాసికస్థాన మున నున్నలఁ బొంది ఈంగలు, ఊంకొట్టు-ఈఁగలు, ఊఁ కొట్టురూపములఁ బడసినవి.

కొంతకాలమునకు దీర్ఘముమీఁది సున్న మోఁదిపలు కుట మాసి తేలఁబలుకుచే నిలిచెను. కాలక్రమమున ఈంగలు, ఊంకొట్టు రూపములు పోయి ఈఁగలు, ఊఁకొట్టు రూపములే నేఁటికి మిగిలినవి. తెపటికాలమున నిఁక నీ యరసున్నలుగూడ నంతరింపనున్నవి. నన్నయకుఁ బూర్వకాలమునను, నించుక తర్వాతి కాలముననుగూడ నేఁటి యర్ధానుస్వారము అనునాసికసంయుక్తాక్షరముగా నుండుటను, నాసంయుక్తాక్షరము పూర్వాక్షరమునకు గురుత్వమును గూర్పక శిథిలముగా నుండుటను బెక్కు శాసనములు నిరూపించుచున్నవి. నన్నయకుఁ బూర్వపు శాసనములలో పండరంగ శాసనమందును, యుద్ధమల్ల శాసనమందును నీ తీరును జూడవచ్చును. నన్నయకుఁ దర్వాతివానిలో దక్షిణ హిందూదేశ శాసనసంచయము ర వాల్యూంలో ననేక పద్యశాసనము లిట్టి తీరులవి గలవు. మాదిరి కొకటిరెండు పద్యములఁ జూపుచున్నాఁడను. క్రీ. ౧౦౭౫ వ నాఁటి శాసనము:—

గీ. సకల వసుమతీశ మకుట లసద్రత్న
కిరణరుచి విరాజి చరణుణ్డు యున—

క్రీ. ౧౧౨౮ వ నాఁటి శాసనము:—

క. సూరి కవిస్తుతు ణ్డనఘుండు
చారుచతుర్థాన్వయాబ్ధిచంద్రుణ్డు గుల ని
స్తారకుణ్డు సుజననిధి రిపు
వారణగజరిపుణ్డు బుద్ధవమ్మాఁ జనించెను.

ఈ పైపద్యమున అనునాసికసంయుక్తహల్లు ఒకచోట ననునాసికస్థానమున సున్నతో నుండుట గాననగును. ఇది యనునాసికములు సున్నలుగా లిపిలో మార్పు చెందుచున్న కాలము. సున్నలుంచుట యింకనుఁ బ్రబలము గాలేదు. స్తుతుణ్ణు అనియున్న విధమునఁ గాక, తర్వాత 'అనఘుండు' అని 'ణ్ణు'కు బదులు 'ండు' ఉన్నది.

నేను మీఁదఁ బేర్కొన్నవిధమునఁ దెలుఁగునఁ గల యరసున్నలు ప్రాయికముగా సంయుక్తహల్లోపము వలన నేర్పడినవిగాఁ గుదురుచున్నవి. అరసున్నలు గల శబ్దముల నిఁక నీ విధమున సమన్వయించి చూచెదను.

ప్రొఫెసరు శేషగిరిశాస్త్రిగారు పూర్వము అర్ధానుస్వారమునుగూర్చి యొక గ్రంథము రచించి ప్రకటించిరి. వెనుక ఎప్పుడో నేను దానిని చూచితిని. ఇటీవల నా కది యెక్కడను గానరాలేదు. దీనిని నేను వ్రాయుటలోఁ బూర్వమెప్పుడో యా గ్రంథము చదువుటవలనఁ గలిగిన జ్ఞానవాసన యే మేని పనిచేసియుండవచ్చును. కాని వారి గ్రంథమున అర్ధానుస్వారము పుట్టుటకు నే నిప్పుడు చెప్పిన ప్రక్రియ యున్నట్లు లేదు. అక్షరలోపస్థానీయముగా అరసున్న వచ్చెనని వారు వ్రాసియుందు రని స్మరించుచున్నాను. ద్విత్వశైథిల్యాదిక మును వారు గుర్తించియుండరు. 'ఆంధ్రశబ్దతత్త్వ'మని వారు ప్రకటించిన వేఱొక గ్రంథము నేఁ జూచితిని. అందు వారు కొలఁకులు మొదలగు శబ్దరూపములు 'కళ్' ప్రత్యయము

కలయుటచేత నేర్పడిన వని నిరూపించిరి. బహుకాలమునకుఁ బూర్వము వారు కొంత ప్రశస్త పరిశోధనము నెఱపి గ్రంథములఁ బ్రకటించిరి. కాని వానిమీఁద నింక నెంతో మంచి పరిశోధనము పెంపొందవలసి యున్నది.

౮

# వింత నిఘంటువులు

---

౧

ఆలజాలంబు నీరిలో నాడుజాడ
గాలిపడగ యాకసమునఁ గ్రాలుక్రీడ
నిదురలోపలఁ గలఁదోచు నీడవిధము
గానవచ్చునె యప్పుడ కన్నఁ గాక !

కలలోఁ గన్న పురుషుని, నాఁ చూచినప్పుడు గుర్తింప వలసినదే కాని పిదప మరలఁ గానవగునా యని యుషతోఁ జిత్రరేఖ యను సందర్భమున, ఉత్తరహరివంశమునఁ బంచమాశ్వాసమునఁ బై పద్య మున్నది. ఇందు 'ఆలజాలము' అన్న పదమున కర్థము గావలెను. ఈ పదము తెలుఁగున నాకన్యత్ర కానరాలేదు. సంస్కృతమునఁ గాదంబరిలో రెండు చోట్లఁ గానవచ్చినది.

౧. యేషాం చ క్షుద్రాణాం ప్రజ్ఞా పరాభిసంధానాయ న జ్ఞానాయ శ్రుత మాలజాలాయ.

౨. ఇత్యేతాని చాన్యాని చాలజాలాని దుర్జీవితగృహీతా చిన్తయన్తీ జాగ్రత్యేవాఽతిష్ఠమ్.

ఇందు తొలివాక్యమున 'ఆలజాల'పదమునకు ముద్రిత వ్యాఖ్యలో టీక లేదు. రెండవ వాక్యమున "ఆలజాలాని =

స్వాప్నాంతర్గతప్రాయాంశే" అని యర్థ మున్నది. సంస్కృత మున నింక నితరత్ర నా పదము గానరాలేదు.

కన్నడమున పంపభారతమున 'బాణజాలమదు భోంకనె నోడుపు పాళజాల మాయ్తునె కడిదొట్టి' (౧౨-౬౮) అని యున్నది. పై కర్ణాటకప్రయోగమున, ఆలజాలపదము నకు ఛిన్నభిన్న మయినది, మాయమయినది అన్న యర్థము పొసఁగును. కాదంబరీప్రయోగములకు పలవరింత, చీకాకు అన్నరీతి నర్థము పొసఁగును. తెలుఁగుప్రయోగ మున నీ యర్థములు పొందుపడవు. ఔపచారికముగా నేదో యర్థము పై ప్రయోగముల కనుగుణముగాఁ గుదుర్చుకొన వలెను. కాని, వృద్ధానుశ్రుతిలో 'ఆలజాలం మీనపదమ్' అని నిఘంటువాక్య మున్నది. ఈ వాక్య మే నిఘంటువు లోనిదో తెలియఁగరాదు. నా చూచినంతవఱకు నే సంస్కృత నిఘంటువునను గానరాలేదు. ఇది నాచనసోమన పద్యమున కై యే పుట్టిన నిఘంటువేమో యనిపించుచున్నది. ఈ నిఘం టువుప్రకారమునఁ జూడఁగాఁ బద్యమునకుఁ జక్కని యర్థము పొసఁగును. నీటిలో చేపయడుగు నడచు జాడ, ఆకస మున గాలిపడగ యూడు త్రోవ ఇత్యాదిగా సుందరమయిన యర్థసంగతి యేర్పడును.

ఔదుంబరాణి పుష్పాణి, శ్వేతః కాకశ్చ దృశ్యతే,
మత్స్యపాదో జలే దృశ్యః, నారీచిత్తం న దృశ్యతే.

అని శ్లోక మొకటిగూడ ఆలజాలమునకు మీన పదార్థమును బలపఱచునది గలదు. మఱియు—

"తటతట నన్నీటిమీఁద నాలజాలంబు
నిటునటుఁ జరియించదా యీఁదియీఁది
అటువలెనే పో తమకమందిన సంసారఘ
ఘటనకై తిరిగితిమి కడఁగానలేక "

"ఆలపోతువానితోఁడ నంటిన మేనివాఁడు
ఆలగాపరులతోఁడ నాడినవాఁడు
ఆలజాలమై నన్నీట నలరఁ దేలినవాఁడు
ఆలపోతుకొండమీఁద ననువైనవాఁడు"

(తాళ్లపాకవారి పదములు.)

నాచన సోమనాథుని "యాలజాలంబు నీరిలో నాడు జాడ" యన్న ప్రయోగముకంటె స్పష్టముగాఁ బై తాళ్ల పాకవారి పదములు 'ఆలజాల' మనఁగా 'మీనపద' మన్న యర్థమును సమర్థించుచున్నవి.

## ౨

అర్జునస్య ఇమే బాణాః నేమే బాణా శ్శిఖండినః,
కృన్తన్తి మమ గాత్రాణి మాఘమాసే గవామివ.

మహాభారతము భీష్మపర్వమున (౧౨౦-౬౪) నీ శ్లోక మున్నది. తిక్కన సోమయాజులవారు దీని నీ క్రిందివిధమునఁ దెలిఁగించిరి:

అశనికల్పము లివి యర్జునుబాణముల్
గాని శిఖండివి గావు సుమ్ము
కర్కటి గర్భంబు కరణి గాత్రము వ్రచ్చె
నిట్టివి వానికి నెందుఁ గలవు.

'మాఘమాసే గవా మివ' అన్నదానికి 'కర్కటి గర్భంబు కరణి' తెలుఁగుసేఁత. ఈ తెలుఁగుసేఁత కనుగుణముగా నొక వింత నిఘంటువు గలదు. 'మాఘమా కర్కటీ ప్రోక్తా తదపత్యంతు సేగవా.' ఈ నిఘంటు వెక్కడిదో యెఱుఁగరాదు. కాని తిక్కననాఁటికే యిది కలదో, తిక్కన తెలిఁగింపును బట్టి పుట్టినదో యెఱుఁగరాదు. 'మాఘమాసే గవామివ' అన్న చరణమునకు సరళరీతిని 'మాఘమాసే, గవామ్, ఇవ' అన్న పదవిభాగమే తోఁచును. 'మాఘమా, సేగవామ్' అన్నది కుటిలరీతి. మాఘమా-ఆకారాంత స్త్రీ లింగము గాఁబోలును. ఈ పై శ్లోకార్థమున కీ నిఘంటువును, నీ నిఘంటువున కీ శ్లోకమును నాశ్రయములు. సాతవాహన సప్తశతిలో మాఘమాసే, గవామివ అన్న పదవిభాగమున కనుగుణ మనఁదగినది గాథ యొకటి కలదు.

విక్కిణఇ మాహమాస - మ్మిపామరో పాఇఅం వఇల్లేణ
ణిద్ధూమ ముమ్ముర విఏ అ - సామలియథణో పడిచ్ఛన్తో.

దీనికి శ్రీనాథుని తెలిఁగింపు:

మాఘమాసంబు పులివలె మలయుచుండఁ
బచ్చడం బమ్మికొన్నాఁడు పణములకును (పసరమునకు)
ముదితచన్నులు పొగలేని ముర్మురములు
చలికి నారగోయ కేలుండు సైరికుండు. (క్రీడాభిరామము)

ఇందు మాఘమాసమున గోవులు తక్కువ ధరలకును, పచ్చడములు హెచ్చు ధరలకు నమ్మకమునకు వచ్చుట చెప్పఁబడినది. మాఘమాసమున గోవుల ధరలు

పడిపోవుట చలికాలమున వానికి వ్యాధ్యాదిబాధ లుండు టచేఁ గాఁబోలును. భారతకాలమునుండి రెండువేలేండ్ల క్రిందటినాఁటిదాఁక మాఘమాసము నేఁటి ధనుర్మాసమువలె శైత్యాధిక్యము గలది గాఁబోలును.

## ౩

పురాణములలో కలికాలవర్ణనఘట్టమున నీ శ్లోక ముండును:

అట్టశూలా జనపదా శ్శివశూలా శ్చతుష్పథాః,
ప్రమదాః కేశశూలిన్యో భవిష్యంతి కలౌ యుగే.

ఈ శ్లోకమున కర్థ మెఱుఁగరాదు. 'అట్టశూలంబులు యగును దేశములెల్ల' అన్నరీతిని దెలిఁగింపవలసినదే. నేఁటి కైదువందలయేండ్ల ప్రాఁతకాలమునాఁటి దగు ప్రసంగ రత్నావళిలో నీ పురాణశ్లోకమున కీ క్రింది నిఘంటువును బట్టి యర్థము చెప్పఁబడినది:

అట్ట మన్న మితి ప్రోక్తం, బ్రాహ్మణశ్చ చతుష్పథః,
కేశో యోని, శ్శివో వేదః, శూలో విక్రయ ఉచ్యతే.

## ౪

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం నమామి.

ఈ శ్లోకము నిట్లే యాపామరపండితము పఠింతురు. 'రఘుకులాన్వయ రత్నదీపం' అనుట కర్థము పొసఁగదు. ఈ క్రింది వింత నిఘంటువు పొసఁగించును:

అన్వయస్తు సముద్రస్స్యాత్-రత్నదీపశ్చ చంద్రమాః.

౫

గ్రంథగ్రంథిం తదా చక్రే మునిర్గూఢం కుతూహలాత్
యస్మిన్ ప్రతిజ్ఞయా ప్రాహ ముని ర్ద్వైపాయన స్త్విదమ్
అష్టౌ శ్లోకసహస్రాణి హ్యష్టౌ శ్లోకశతానిచ,
అహం వేద్మి, శుకో వేత్తి, సంజయో వేత్తి వానవా.
తచ్ఛ్లోకకూట మద్యాపి గ్రథితం సుదృఢం మునే
భేత్తుం నశక్యతేఽర్థస్య గూఢత్వా త్ప్రశ్రితస్యచ.

—భా. ఆ. అనుక్రమణికాధ్యాయము.

'సంజయో వేత్తి వానవా' యనుచోట, సరసార్థ సంధాయకముగా నొక వింతనిఘంటువు గలదు. "వానవా దీర్ఘదర్శీ స్యాత్" అని యది.

౬

యస్య స్తౌతి మతిం మనీషిసదసి శ్రీనీలకంఠాధ్వరీ
కౌండాజ్యోతిషికశ్చ యస్య కురుతే సమ్మాన మాస్యే స్వమమ్
యత్రానుగ్రహదృష్టి మర్పయతి చ శ్రీబాలకృష్ణో గురుః
సోఽయం దీవ్యతి చొక్కనాథమఖినా మక్రీతదాసః కవిః.

"అక్రీతదాసో జామాతా" అని వింతనిఘంటువు. రామభద్రదీక్షితుఁడు చొక్కనాథమఖికి అల్లుఁడే. కాని యీ నిఘంటు వెక్కడిదో ?

## ౭

" వల్మీకాగ్రా త్ప్రభవతి ధనుఃఖండ మాఖండలస్య" అన్న మేఘసందేశ వాక్యమున కర్థము కుదుర్పనుగాఁబో లును "వల్మీక స్సాతపో మేఘః" (ఎండతోడి మబ్బు వల్మీక మనఁబడును) అన్న నిఘంటువుముక్క నెవ్వరో పుట్టించిరి. వ్యాఖ్యాతలు గొంద ఱీ నిఘంటువు నుదాహరించిరి. కాని యది యే నిఘంటువులోని దనిరో నా కెఱుకపడలేదు. పుట్ట మీఁదినుండి యింద్రధనువు కానవచ్చు ననుటకు బృహ త్సంహితాప్రమాణమును, దదనుగుణముగా "పుట్ట వెడలి నభోభిత్తిఁ బుట్టు శక్రకార్ముకపుఁ బెద్ద పలువన్నె కట్లజెట్టి" అన్న యాముక్తమాల్యదాప్రయోగమును శ్రీ వేంకటరాయ శాస్త్రిగారు మేఘసందేశాంధ్రవివరణమునఁ బ్రకటించిరి. "వల్మీక స్సాతపో మేఘః" అన్న నిఘంటువు నెవ్వఁడో మెఱికచాలనివాఁడు సృష్టించినాఁ డనవచ్చును.

## ౮

రామాయణమునను, కాదంబర్యాది గ్రంథములం దును 'గంధర్వనగర' మను పదము మిథ్యార్థమున, అనఁగా చూపట్టియుఁ జూచుచుండఁగనే మాయమగునది యన్న యర్థసందర్భమునఁ బ్రయోగింపఁబడినది. ఆకసమున నగరా కారముగా గోచరించు మేఘచిత్రములను గంధర్వనగరము లనుట ప్రసిద్ధము. బృహత్సంహితాది జ్యౌతిషగ్రంథములందు వాని స్వరూపవర్ణనము విపులముగాఁ గాననగును. ఈ విష

యము నెఱుఁగకో యేమో ప్రాచీనులే యెవ్వరో "గంధర్వ స్స్వప్న ఈరితః" అని నిఘంటువును గ్రంథస్థీకరించి రని శ్రీ రామకృష్ణకవిగారు వెల్లడించిరి. ఈ నిఘంటువునుబట్టి గంధర్వనగర మనఁగాఁ 'కలలోఁ గానవచ్చిన పట్టణము' అని యర్థమగును.

౯

ఉత్తరరామచరిత్రమున—

చిరం ధ్యాత్వాధ్యాత్వా నిహిత ఇవ నిర్మాయ పురతః
ప్రవాసే చాశ్వాసం నఖలు న కరోతి ప్రియజనః,
జగ జ్జీర్ణారణ్యం భవతిచ కళత్రవ్యుపరమే
కుకూలానాం రాశౌ తదను హృదయం పచ్యత ఇవ. (౬-౩౫)

అన్న శ్లోకమున 'జీర్ణారణ్యా' పదమునకు 'పాడు వాఱిన యడవి' అని యర్థము సంగతమగుచున్నను, సారస్య విశేషాధాయకమని కాంబోలును వ్యాఖ్యాతలు "జీర్ణారణ్యం శ్మశానం స్యాత్" అని నిఘంటువు నుదాహరించిరి. ఈ నిఘంటు వెక్కడిదో !

౧౦

శమీపత్రప్రమాణేన పిండం దద్యా ద్గయాశిరే,
ఉద్ధరే త్సప్తగోత్రాణి కుల మేకోత్తరం శతమ్.

ప్రత్యాబ్దికశ్రాద్ధప్రయోగమున పిండప్రదానకాల మున గయాపిండదాన ప్రశంసాపరముగ నీ శ్లోకమును వైది కులు పఠింతురు. ఇక్కడ జమ్మియాకంతమాత్రము (అనఁగా

నొక యన్నపుమెదుకు అగును) గయాశిరమునఁ బిండ ప్రదానము చేసిన నది సప్తగోత్రములను, నేకోత్తరశత కులములను నుద్ధరించును అని యర్థము పొసఁగుచునే యున్నను, వీలో కొందఱు "శమీపత్రంతు కందుకమ్" అనియు, "శమీపత్రం కుక్కుటాండమ్" అనియు శమీపత్రపదమునకు బంతియని, కోడిగ్రుడ్డని అర్థము వచ్చునట్లు నిఘంటువులఁ జెప్పుచున్నారు. కాని పాల్కురికి సోమనాథుఁడు—

ఆకాంక్ష శ్రీగిరియం దొక్క జమ్మి
యాకు పట్టెడునంత యన్న మొక్కనికి
దానంబు సేయుఁ నుద్యత్ఫలంబునకు
మానుగా నవియ సమానంబు లనఁగ.

(పండితారాధ్యచరిత్ర, పర్వతప్రకరణము)

అని 'శమీపత్రప్రమాణ' పదమునకు 'జమ్మియాకంత' అన్న యర్థమే ప్రాచీనవిద్వత్సమ్మత మగుట గ్రంథస్థపఱిచినాఁడు.

౧౧

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.

ఈశ్లోకమును వైష్ణవులు విష్ణుస్తుతిగాఁ బఠింతురఁట. దాని కిందు 'విష్ణుమ్' విశేష్యమగుట సాధకమేకాని, 'శశివర్ణమ్', 'శుక్లాంబరధరమ్' అన్న విశేషణములు బాధకములగును. స్మార్తులు విఘ్నేశ్వరపూజలోఁ బ్రప్రథమముననే

విఘ్నేశ్వరస్తుతిగా దీనిని బఠింతురు. వీరి కింద విఘ్నేశ్వర వాచకము విశేష్యము దుర్ఘటమయినది. ఈబాధ తొలఁ గుటకే యేమో యీ క్రిందినిఘంటువు పుట్టినది: "ప్రసన్నో మత్తవారణః". 'ప్రసన్న' మనఁగా మదపుటేనుఁగు. 'ప్రసన్న వదనుఁ' డనఁగా 'మదగజాననుఁడు.' విఘ్నేశ్వర వాచకమయిన విశేష్యపదము పయినిఘంటువుచే ఘటిల్లినది. జైను లీ శ్లోకమును శ్వేతాంబరజినదేవతాస్తుతిపర మందు రఁట. ఇట్లు నానాదేవతాస్తుతిపరముగా నీ శ్లోకము విఱుగు చుండుటను గమనించి కొంటెవిద్వాంసుఁ డొకఁడు దీనికి గార్దభస్తుతిపరముగా నర్థము చెప్పినాఁడు.

౧౨

రామాయణమున నైదవకాండమునకు సుందర కాండ మని పేరగుటకు పలువురు పలుతీరుల యర్థములు చెప్పు చున్నారు. ఆ యర్థములకు నిఘంటువులఁ జెప్పుచున్నారు. "సుందరో హనుమాన్ స్మృతః" అనియు, "సుందరం త్వంగు ళీయకమ్" అనియు ఆ నిఘంటువులు. హనుమంతునికి సంబం ధించిన కథార్థము గలదిగాన, మఱి యంగుళీయక ప్రదాన కథాప్రధాన మయినదిగాన 'సుందరకాండ' మని పే రయ్యె నని పై నిఘంటువు లర్థము గుదుర్చును.

౧౦

# గ్రంథగ్రంథులు

ఆంధ్రగ్రంథములందు ముడులువిడని గ్రంథగ్రంథులుగాఁ గొన్ని పద్యములు, పదములు గానవచ్చుచున్నవి. అట్టి వానిలోఁ గొన్నింటి కిక్కడ నాచేతనయినంతలోఁ జిక్కులు విడఁదీయఁ బ్రయత్నము చేయుచున్నాఁడను.

౧. చందమామ ఘుటిక

"పాత్రసంశుద్ధి కాజ్యంబు పరిస్తరించి
యూరకుండిరి యిది యేమియొక్కొ వీరు ?
కానరా విప్పు శాకపాకములు నెదుర
మనకు నిజమయ్యె నల చందమామఘుటిక."

(భీమఖండము.)

కాశిలో వారముదినములనుండి తిండిలేక త్రిప్పలఁ బడుచున్న వ్యాసాదిమహర్షు లొక పెద్దముత్తయిదువ యన్న ప్రదానము చేయుదు ననఁగా ననుష్ఠానములు దీర్చుకొని కూర్చుండిరి. విస్తళ్లు వేసిరి; పాత్రాభిఘారముచేసిరి. అంతే ! వడ్డనగాని, యింట వంటవాసనగాని కానరాదయ్యెను. అప్పుడు వ్యాసాదు లనుకొన్నట్టున్నచొప్పు పయిపద్యము. ఇందు "మనకు నిజమయ్యె నల చందమామఘుటిక" అన్న పాదమున కర్థము కావలెను.

"తూష్ణీం స్థితాః కి మేతన్న నాఽన్నాదిక మవేత్యతే;
సత్యాఽభూ దధునాఽస్మాకం శశాంకఘుటికాకథా."

అని పయి తెలుఁగుపద్యమునకు సంస్కృతశ్లోకము. నా కిట్లు తోఁచినది: ఉడుగక మారామువట్టి యేడ్చుచున్న పసిబాలురను పెద్దవా రెత్తుకొని, వెన్నెలలోని కరిగి కను విందుగొలుపు చందమామను జూపుచు "చందమామ రావే జాబిల్లి రావే...వెండిగిన్నెలో వెన్న పెట్టుకుని, పమిడి గిన్నెలో పాలు పోసుకుని, ఒలిచిన పండు చేతఁ బట్టుకుని, ఒలవని పండు ఒడిలో ఉంచుకుని రావే చందమామా, అబ్బాయియూ నీవ్వూ ఆరగింతురు కాని" అని పాటపాడుచు చందమామ తన కేదో తినుబండారములు తెచ్చిపెట్టునని బాలకులూఅడిల్లి యుండునట్లు మోసగింతురు. ఇదే శశాంక ఘుటికా కథ. సంస్కృత భీమఖండమునను, తెల్గు భీమఖండ మునను 'శశాంకఘుటిక-చందమామఘుటిక' ఉన్నదిగాని, ఈ నానుడి విష్ణుపురాణమున మఱొకమాడ్కిగా నున్నది:

"అందని పంటి కేమిటికి నట్టు నిగిడ్చెదు విష్ణుఁ డన్నయా
కందువ, చందమామగుటకల్, విను మీవస కట్టిపెట్టు"
(౨ అశ్వా.)

ఇక్కడకూడ 'ఘుటికల్' అని మార్ప వచ్చును గాని అచ్చులో 'గుటకల్' అనియే కలదు. ఈ పాఠమునకు, చందమామ యేమో తెచ్చిపెట్టఁగలఁడని నోరూరఁగా బాల కులు గుటకలు మ్రింగుచుఁ జూచుచుండు టర్థమగును. భీష

ఖండపు 'ఘుటిక'కంటె నీ 'గుటక' సారస్యముగలది. కాని సంస్కృతపు 'ఘుటిక'కు 'గుటక' తెలిఁగింపుగాదుగదా !

ఈ 'చందమామగుటక' మాదిరిగా 'చందమామ గ్రుక్కిళ్లు' అని ప్రయోగాంతరము గలదు.

" ఎలమి సుముహూర్తమునఁ జెరయెత్త నంతఁ
బ్రేమ మది మీఱంగాఁ జందమామ చెలుల
కెంపుమోవులసుధకు గ్రుక్కిళ్లు మ్రింగ
ప్రీతిఁ గలిగెఁ జందమామగ్రుక్కిళ్లు నాఁడు"

(తారాశశాంకము.)

శబ్దరత్నాకరకారు లీపద్యము నుదాహరించి 'చంద మామ గ్రుక్కిళ్లు' అను పదమునకు 'అధరామృతము' అని యర్థము వ్రాసిరి. వాని, వారే అక్కడ "ఇట్లు, చంద మామగుటకలు, ఈయర్థ మింకను విచార్యము" అని వ్రాసిరి. అధరామృత మన్న యర్థము సంగతముగాదు.

## ౨. కేనము

"కేనము = అసూయ మొదలగు నర్థములందు నన్నె చోడఁ డుపయోగించెను. 'కేణ' క్రొత్తకన్నడమువనే కలదు గాని ప్రాచీనకావ్యములలోఁ గానరాదు. కావునఁ దత్ప్ర యోగము గావించిన కవి ద్వాదశ శతాబ్దికంటెఁ బ్రాచీన తరుఁడు గాఁజాలఁడు." అని శ్రీ లక్ష్మణపతిశాస్త్రిగారు.

నన్నయభట్టారకునకు నూతేండ్ల పూర్వపువాఁడును, కర్ణాట ప్రాచీన మహాకవియు నగు పంపకవి తన విక్రమా

ర్జున విజయమున 'కేణ' పదమును పదవ యాశ్వాసము 22-వ, 51-వ పద్యములందు రెండుచోట్ల నన్నిచోడఁ డే యర్థమునఁ బ్రయోగించెనో ఆ యర్థముననే ప్రయోగించెను. కాన ఇది యాంధ్రకర్ణాటకవితల యాదికాలమున నుండియు రెండుభాషలలోను వ్యవహృత మగుచున్న పదమే యని తెలియనగును.

౩. కనుమారి

భారత శాంతిపర్వము (ఆశ్వా. ౧, ప. 302) న -

"కల్లు ద్రావిన పాతకం బది యగ్ని వ
ర్ణముగాఁగఁ గాఁచి పానంబు సేయఁ
గనుమారి యుఱుకంగ ననలంబుఁజొర మహా
ప్రస్థాన మాచరింపంగఁ బాయు"

అని కలదు. ఇందు 'కనుమూసి యుఱుకంగ' అని పాఠాంతర మున్నది. అది పరిగ్రాహ్యము గాదు. ఇక్కడ 'పానంబు సేయఁగను-మారి యుఱుకంగ' అని పదచ్ఛేదమా, 'పానంబుసేయఁ-గనుమారి యుఱుకంగ' అని పదచ్ఛేదమా అని సంశయము. ఈ సంశయము నీ క్రింది నాచనసోముని పద్యము తీర్చినది:

"పాయఁదగు మిమ్ముఁ గనుమారిఁ బడఁ బానంగు
విషము ద్రావుట యోగ్యంబు వెల్లిలోన
మునుఁగు టుచితము మీరెల్లఁ గనుఁగొనంగ
నాత్మవిడుచుట చను నాకు ననుచు నడలి."

(ఉత్తరహరి. ఆ. ౪.)

పదము 'కనుమారిఁబడుట' యగుట స్పష్టము. 'కను మారిఁ బడుట' కు 'భృగుపతన' మర్థము. శాంతిపర్వ పద్యమునకు మూల మిది:

"సురాపానం సకృత్ కృత్వా యోఽగ్నివర్ణాంసురాం
........................ [పిబేత్,
మరుప్రపాతం ప్రపతన్, జ్వలనం హి సమావిశన్,
మహాప్రస్థాన మాతిష్ఠ న్ముచ్యతే సర్వకిల్బిషైః."
(శాంతి. అ. ౩౮.)

" మరుప్రపాతమ్ = నిర్జలదేశే పర్వతాగ్రాత్ పతనమ్" అని వ్యాఖ్య.

౪. టాటాలు గుణించుట

"క,ర్ణాటస్త్రీలు కటారికత్తియలచే
రాపాడఁగాఁ బట్టఁగాఁ
డాటా లీడ గుణింపరాదు పెఱచో
టంబోలెఁ బై పాటునన్."
( క్రీడాభిరామము )

తెలుఁగునాట తెలివితక్కువవానికి 'తద్దన్న' అనియు, మనసు మెత్తనివానికి 'పప్పమ్మ' అనియు, గడుసరివానికి 'టట్టణ్ణ' అనియు, బూకరింపునకు 'చచ్ఛ' అనియు నానుడులున్నవి. తవర్గము దంత్యము; చవర్గము తాలవ్యము; టవర్గము మూర్ధన్యము; పవర్గము ఓష్ఠ్యము. 'తద్దన్న' వట్టి మాటకారియేకాని కార్యకారి కాఁడు. పల్లుబిగింపేకాని

కార్యపు సొంపు లేనివాఁడు (దంత్యముగాన). 'పప్పమ్మ' నే 'వెఱ్ఱిపప్ప', 'వెఱ్ఱిపప్పమ్మ' అనియు నందురు. వట్టి మెత్తని వాఁడు గట్టిగా మాటాడను, మాటాడను నేరనివాఁడు (ఓష్ఠ్యముగాన). 'చచ్ఛ' బూకరింపు (తాలవ్యముగాన). 'టట్టణ్ణ' ఉద్ధతుఁడు—బిఱ్ఱబిగిసి నెత్తికెక్కి మాటాడువాఁడు (మూర్ధన్యముగాన).

ఈ యర్థమునకు సాధకముగాఁ గర్ణాటభారతమున పంపకవిప్రయోగ మున్నది:

"పన్నతర నడువ నుడియొ
ల్కన్న భుజార్గళమె సాల్గు మెసెమే ఙ్మునిమే
నెన్న నుడి 'టారడాథణ'
మెన్నం బెససువుదు రాజసూయంబేళల్."

భీముని భాషణము 'టారడాథణ' అనఁబడినది. ఉద్ధతము, కఠినము అని. క్రీడాభిరామ ప్రయోగమునఁగూడ 'టాటాలు గుణింపరాదు' అనఁగా, గదుసరి దుడుసుఁదనములు సాగింపరాదని యర్థమగును.

౫ అధ్వానము

హరవిలాసమున రతివిలాపములో—

"న, న్నతిదుఃఖాన్వితఁ డించిపోవఁ దగునా
యధ్వానపుం బట్టునన్"

అని కలదు. 'అధ్వానము - అమార్గము' అని శబ్ద రత్నాకరకారు లనిరి. 'అరణ్యము' అని కర్ణాట నిఘంటుకారు లనిరి. ఈ యర్థము లెట్లు వచ్చినవో వారు లక్ష్యము లుదాహరింపలేదు. కర్ణాట పంపభారతమున 'అధ్వానపదపరిశ్రాంత' అని యున్నది. తన్ముద్రాపకులు 'అధ్వానము - మార్గము' అని యర్థము వ్రాసిరి. అది సంస్కృతసమాసమున నున్నది. శ్వ—శ్వాన శబ్దములవలె అధ్వ-అధ్వాన శబ్దములు సంస్కృతముననే కలవేమో! అధ్వ శబ్దము తత్సమ రూపమున అధ్వానము కాఁబోలును! 'అధ్వానము' తత్సమ మనుకొన్న శ్రీనాథప్రయోగమునకు సాధుత్వము, నర్థము నిర్బాధములగునుగాని కర్ణాటప్రయోగము రక్షితము గాదు. తెనుఁగున 'అధ్వాన్నము శత్రుమధ్యము' అని నానుడి యున్నది. త్రోవలో వంటచేసికొని తినుట, శత్రువు లప్పుడు చుట్టుముట్టియుండుట దాని కర్థము. కాని సంస్కృతమున 'అధ్వాంతశాత్రవః = మార్గసీమారిపుః' అని ప్రయోగమును, అర్థమును వాచస్పత్యాది నిఘంటువులలోఁ గాననగును.

తెలుఁగునఁగల 'తలపొలము' పదమునకీ 'యధ్వాంత' పదము సరియయిన సంస్కృతము.

"సాదు రేఁగెనేని
న్వాను తలపొలముననకాని నిలువదు సుమ్మీ"

అన్న తిక్కన్న ప్రయోగమునకు 'సాధువయిన పసరము చెలరేఁగినదా, అది యెందాఁకఁ బోఁగలదో అందాఁకఁ

బోయికాని నిలువదు' అన్నయర్థము సంగతము. ఊరిబాట ముగియునట్టి పొలిమేరపట్టు 'అధ్వాంతము-తలపొలము.' తిక్కనప్రయోగమున కర్థ మిదేయని నిరూపించుట కీ క్రింది ప్రయోగము కాటమరాజుకథలోనిది సాధకము:

"తలపొలమునకుఁ బాటి నిలఁబడ్డ గోవులను
కలవిలుచుకొన్నట్టు కాదు కయ్యంబు."

తిక్కనభారతము, కాటమరాజుకథ రెండును నెల్లూరి కావ్యములే. 'తలపొలము' పద మక్కడ వాడుకకలది కాఁబోలును!

౬. కనకస్వామి

బసవపురాణమున—

"జాలిఁ బడి కనకసాములు వమన
వేలిచికొన్నయావిధమునుఁ దమకు"

అని యున్నది. శివాలయములలో శివనివేదితాన్నాదికము నర్చకు లక్కడి బోయల కారగింపనిచ్చుట బసవేశ్వరుని పూర్వకాలపు సంప్రదాయము. బసవేశ్వరుఁ డా సంప్రదాయము మాన్పించి, యర్చకులచే నారగింపించెను. బోయలు తగవు సాగించిరి. "శివునికి విషము నివేదింతుము. అది మీా రారగింపఁగలరా?" యని బసవన బోయల నడిగెను. "ప్రసాద మారగించి బ్రదుకఁగోరుదుముగాని ప్రసాదము విషము చేసినఁ దిని చత్తుముగదా?" అని బోయ లనెదు పట్టునఁ గల

ద్విపద యది. బసవపురాణము ముద్రించునాఁడీ ద్విపద యర్థము నాకు స్పష్టపడలేదు. 'కనకస్వాములు' అనఁగా రసవాదము (బంగారము) చేయువారనియు, తత్ప్రక్రియ సరిగా తెలియక తప్పుప్రయోగములు చేసి వారు తమ శరీరములనే కాల్చుకొనుచుండుట జరగునుగాఁబోలు ననియు నే నప్పు డనుకొంటిని. ఇటీవల కర్ణాటవిద్వాంసులు శ్రీ శేషయ్యంగారు కర్ణాటభారతమున నేతత్సంబంధికథ యుండుటఁ జూపిరి. అది యిది: ఆరణ్యపర్వమున యక్షప్రశ్నల సందర్భమున భీమాదులు నలుగురు సోదరులు యక్షునాజ్ఞ మీఱి నీరుద్రావి చెఱువుచెంత మృతప్రాయులై పడియుండిరి. అప్పుడు దుర్యోధనుని పురోహితుఁడు కనకస్వామి యనువాఁడు పాండవులఁ జంప నాభిచారికహోమము చేసి పంపిన కృత్యాదేవత పాండవహననార్థ మక్కడికి వచ్చెను. ఆ చెఱువు దగ్గఱ నప్పుడు కృత్యకు యక్షదేవత (యముఁడే) ప్రత్యక్షమై "నీవు జాతిగల దేవతవైతేని నాచే నిప్పుడు నిపాతితులయి యెంగిలిపడియున్న యీ నల్వురను నీ వారగింపరాదు. ఎంగిలితిండి తిందువా-నీవు నీచదేవత వగుదువు. నా మహాత్త్వముముందు నీ నీచదేవతాకార్యము సాఁగఁజాల" దని గద్దింపఁగా కృత్యాదేవత యప్రయోజకురాలై "అయ్యో, నే నాఁకలిగొని వచ్చితినే; ఆహారము కావలెనే" అనెను. "అక్రమముగా నిన్నిట్లు ప్రయోగించిన యా కనకస్వామినే యారగింపు" మని యక్షుఁ డనెను. అట్లే యా కృత్య దుర్యోధనపురోహితునిఁ గనకస్వామినే యారగించెను.

"కనకన బేల్వో తగుళ్దుదు
కనకననెం బొందు మాతు ధర గెసెయ సుయో
ధనసపురోహిత నప్పా
కనకస్వామియనె మునిదు కృత్తిగ దిందళ్. "
(పంపభార. ౮ ఆశ్వా. ౪౪ ప.)

ఈ కథ సంస్కృతాంధ్ర భారతములలోఁ గానరాదు. కర్ణాట భారతరచనమునకుఁ బూర్వమే "కనకనివేల్మి కన కనికే తగిలిన" దన్న సామెత యేర్పడియున్న దని పద్యము తెల్పుచున్నది. తొలుత సినానుడి రసవాదకారునిఁబట్టి పుట్టి వాడుకలో నుండఁగాఁ బంపకవి దానినిఁ గొని, దుర్యోధన పురోహితునిఁ గనకస్వామిని సృష్టించి తత్పరము గావించి యుండఁబోలును.

౭. ఉప్పుతోఁదొమ్మిది

రామాభ్యుదయమున "ఉప్పుతోఁదొమ్మిదియును బెట్టి కృపణరక్షణము గావించునే గుణసముద్రుఁ" డని యున్నది. 'ఉప్పుతోఁ దొమ్మిది' యనఁగా—

"ఘటః, పటం, జలం, కాష్ఠం, తండులం, తైలమేవచ;
శాక, మగ్నిసమాయుక్తం, లవణం నవ సంయుతమ్".

౮. కోహళి

"హాళిం గోహాళి సంఘటించిన క్రియఁ
మధ్యాహ్న వేళఁ మహా
కాళంబైన నభోవిభాగమున వీఁ
కం గాసె బీఱెండ..." (హారవిలాసము)

ఇందు 'కోహాళి' పదమున కర్థము తెలియదు.

"పార్వతీపతికిఁ బ్రభాతభూపతి గొన్న
యలరుఁగెందమ్మికోహాళి యనంగ."

(ఉత్తరహరివంశము)

ఈ యి రెండు ప్రయోగములు తక్కఁ దెలుఁగున నీ పదము నాకింక నెక్కడను గానరాలేదు. కుమారవ్యాస కృత మహాభారతమున 'కోహాళె' పద మున్నట్లు కన్నడ నిఘంటువున చెప్పఁబడినది. దానికి Cover, Envelope అని అర్థము వ్రాయఁబడినది.

"ఎనుత దవ్యాసయవకాంతియ
మినుగువోహారదేళ్గె మూడిద
వనిమిషాంగద లురగ కాయద
కోహాళెయ నుగిదు"

(కుమారవ్యాస.)

నహుషుఁడు సర్వశరీరపుటాచ్ఛాదనమును తొలఁగించుకొనుట యిక్కడ చెప్పఁబడినది. కాన కన్నడ నిఘంటుకారు లట్లర్థమువ్రాయుట సంగతమే. కుమార వ్యాసునికంటెఁ జాలఁ బ్రాచీనులగు మన తెల్గుకవుల ప్రయోగములు 'ఆచ్ఛాదనము' అన్నయర్థమునకు నసిపడ వనుకొనెదను. తెల్గుప్రయోగములు రెండింటికి ('ఉల్లడ' ఒండె' ఆలవట్టము') ఛత్రము అర్థము కాఁదగు ననిపించును. హరివంశపుఁ బ్రయోగముఁ బట్టి చూడఁగా నది వేల్పులకు రాజులు మొదలగువారు పూజాచిహ్నముగా ధరించు

ఛత్రచామరధ్వజాగులవంటిదిగాఁ గానవచ్చును. పార్వతీపతి గగనకేశుఁడుగాన యాదేవుని తలమీఁదకి వచ్చునట్లు ప్రభాతరాజు పైకెత్తిన యాలవట్టమువోలె భానుబింబ మున్నదన్న వర్ణనము సంగతము కాఁదగును. హారవిలాస ప్రయోగము నిందు కనుకూలించును. హాగిడివంటి యలంకారవిశేషమో, కిరీటమో యనుకొందమన్న 'నలరుఁగెందమ్మి' పదమునకు తామరపూవునాకృతిగలది యని చెప్పవచ్చునుగాని ప్రభాతభూపతి 'కొన్న' యన్న పదమునకు సార్థక్యము కుదురదు. ఆలవట్టముకాని, ఉల్లడకాని 'యలరుఁగెందమ్మి' యాకృతిగలవని యన్వయింపవచ్చును. ఇట్లెల్ల సూచించితిని; గాని 'కోహాళె' పదమునకు సమానార్థకముగా మహారాష్ట్రమున 'ఖోళె' పదము కల దని కిట్టెల్ వ్రాసినాఁడు. మహారాష్ట్రపు 'ఖోళె' సులువుగాఁ దెలుఁగున 'కుల్లా' అయియుండవచ్చును. 'కోహాళి' శబ్దమునకు 'కోహాళె, ఖోళె, కుల్లా' పదములు క్రమపరిణామ రూపములు కావచ్చును. కాఁగా 'కోహాళి' శబ్దమునకు 'కుల్లాయి, టోపి' అర్థమగును. తెలుఁగు ప్రయోగములు రెండును 'కుల్లా' అర్థమునకు సరిపడఁగలవు. 'కుల్లా' శీర్షాచ్ఛాదనమే కదా! అది యలరుకెందమ్మియాకృతిగలది గావచ్చును.

కన్నడపు కుమారవ్యాసప్రయోగము 'శిరఆచ్ఛాదన' మనుటకు సరిపడదు. అతఁ డౌపచారికముగా శరీరాచ్ఛాదనమునకే దానిని బ్రయోగించియుండఁబోలును.

## ౫. ఇట్టికసూఁడినవాఁడు

ఉత్తరహరివంశమున నరకాసురుని కోడి దిక్పాలురు పారిపోవుటను వర్ణించుటలో యముని గూర్చి యీ క్రింది పద్య మున్నది:

" ఇట్టిక సూఁడినవాఁడో
యొట్టిడుకొన్నాఁడొ యనుచు నుల్లసమాడ౯
బట్టుగుచు మగిడి చూడక
పట్టణమున కేఁగె లజ్జబండతనమున౯ "

పైపద్యమున కనేకు లర్థము నడిగిరి. లోకాచారము గొంత యెఱిఁగినవారుగాని దీని యర్థము వివరింపఁజాలరు. నరకున కోడిపోయి యముఁడు తన పురమునకుఁ బరుగువాఱు చున్నాఁడు. అట్లు పరుగువాఱుటలో ముందరిచూపేకాని వెనుకచూపు లేదు. అది చూచినవారు "ఈతఁడేమి యిటిక యావమునకు నిప్పంటించి వెళ్లుచున్నాఁడా? మఱి, వెనుకకుఁ దిరిగి చూడనే చూడ నని యొట్టుపెట్టుకొని వెళ్లు చున్నాఁడా" అని పరిహాసమాడఁ దగిన ట్లున్నది. ఇటిక యావమునకు నిప్పుముట్టించువారు ముట్టించిన నిప్పు అంటు కొన్నదా, లేదా అనియేని వెనుకకుఁ దిరిగి చూడకుండ వడిగా ముందుచూపుతోనే వెడలిపోవలెను. అట్లు వెనుకకుఁ దిరిగిచూచిన నా యావముకాల్పు సరిగా సాగక చెడు నని లోకప్రతీతి. ఈ లోకప్రతీతి దెలియకున్న పద్యార్థ మెఱుకపడదు.

మఱియు నీ పద్యము నాల్గవచరణమున 'లజ్జబండతనమునన్' అని యున్నది. దీనికి 'లంజెబందతనమునన్' అనియు, 'లంజెబండతనమునన్' అనియుఁ బాఠాంతరములున్నవి. కవికర్ణరసాయనమునను, గౌరన హరిశ్చంద్ర చరిత్రమునను ఈపదము ప్రయోగింపఁబడినది. లజ్జబండ = సిగ్గుమాలినవాఁడు.

* * * *

మనుచరిత్రము శ్రీకృష్ణదేవరాయలవారి కాలమున వెలసిన యాంధ్రప్రబంధములలోఁ బేరెన్నికఁ గన్నది. విద్వాంసు లెందఱో దానిపయి విమర్శముల వెలయించి యున్నారు. దాని ఘనత కవి తార్కాణములు. జాగ్రత్తతో నే నీనడుమ నాగ్రంథమును జదువఁగాఁ గొన్ని సందేహములు, తన్నివారణకై పరిశీలింపఁగాఁ గొన్ని చక్కని పాఠములు, అర్థవిశేషములు గోచరించినవి. అందుఁ గొన్నింటి నిందు వెల్లడించుచున్నాఁడను.

౧౦. చేర్చుక్క

"చేర్చుక్కగా నిడ్డ చిన్ని జాబిల్లిచే
సిందూర తిలకంబు సెమ్మగిల్ల."

ఇది ముద్రితపాఠము. ఈ పద్యము సరస్వతీమూర్తి వర్ణనాత్మకము. సరస్వతీదేవి చేర్చుక్క యను నగఁ జంద్రకళ నలంకరించుకొన్నదన్న యర్థ మీ ముద్రిత పాఠమున. "చేర్చుక్కగా నుండు చిన్నిజాబిల్లిచే" నని

కొన్ని వ్రాఁతప్రతుల పాఠము. సాజముగానే సరస్వతీమూర్తి చంద్రకళాలంకృతమస్తక కావున తలపైనున్న యా చంద్రకళ చేర్చుక్క యన్న యలంకారపుసొంపును గూర్చుచున్న దన్న యర్థ మీ వ్రాఁతప్రతిపాఠమున. వ్రాఁతప్రతిపాఠము సుందరతర మగునేమో!

## ౧౧. భరమై తోఁచు కుటుంబరక్షణ

"భరమై తోఁచు కుటుంబరక్షణకుఁగాఁ బ్రాల్మాలి చింతాక్రాంత తరతాళీదళసంపుటప్రకరకాంతారంబునం దర్థపుం జిరం దెరువాటుల్ గొని కొట్టి తద్జ్ఞపరిషద్విజ్ఞాతచౌర్యక్రియా విరసుండై కొఱఁతం బడుంగటుకవి పృథ్వీభృత్సమీపస్థలిన్."

కవీశ్వరులనే యధికముగా సత్కరించుచుండుటచేఁ గాన శ్రీకృష్ణదేవరాయలవారి యాస్థానిలో కవిత చేతఁగాని కుకవులు కవిసత్కారముఁ బడయఁగోరి, ప్రాచీన తాళపత్త్ర పుస్తకగతము లయియున్న గ్రంథములనో, గ్రంథభాగములనో స్వరచితములుఁగాఁ బ్రకటించుకొనుచుండుటయుఁ, బెద్దనాదులు వాని గుర్తించి రాయలసన్నిధి నవమానపఱుచుచుండుటయు జరుగుచుండెడిది గావలయు. జాలిమాలి పెద్దనామాత్యుఁడు వా రటువంటి చేతఁగాని దొంగకవుల సీ పద్యమునఁ జెంగనాడినారు.

ఈ పద్యమును విని కోపించి గావలయును, పెద్దనగారియు, శ్రీ కృష్ణదేవరాయలవారియు కాలముననే వర్తిల్లినవాఁ డొక యసహాయకవితాశూరుఁడు, కవిరాజు

(కవిరాజపద మిట తత్పురుష కర్మధారయములు రెంటను సంగతమే.) పెద్దనామాత్యులవారిని వారిమాటలనే త్రిప్పి కొట్టినాఁడు.

> "అతికుటుంబరక్షణాపేక్షఁ బ్రాల్మాలి
> కృతులు మూఢభూమిపతుల కిచ్చి
> చచ్చి నిరయమునకుఁ జనుకంటె హరిహరా
> ర్పణము చేసి సుగతిఁ బడయరాదె?"

పెద్దనగారి "భరమై తోఁచు కుటుంబరక్షణకుఁగాఁ బ్రాల్మాలి" యన్న కూర్పు నీతఁడు "అతికుటుంబ రక్షణాపేక్షఁ బ్రాల్మాలి"యని యనుకరించుట, పెద్దనగారు చేసిన కుకవినిందను గుర్తించి, వారిత్రోవనే సూటిగా వారికే తగులునట్లు ప్రతినింద చేసినాఁడుసుమా యని విజ్ఞులు వివేకించి తెలిసికొనుటకో యన్నట్లున్నది. కుటుంబరక్షణకై ప్రాల్మాలి తెక్కలికవులు ప్రాచీనగ్రంథార్థముల హరించి రాజులదగ్గఱ వెల్లడించుకోఁబోయి కొఱఁతఁబడుదు రని పెద్దనగా రనఁగా, నీతఁడు "కుటుంబరక్షణకై ప్రాల్మాలియే సుమండి సత్కవులుగూడఁ గొందఱు మూఢు లయిన (స్వయము రచింపను, ఒండె అన్యులు రచించిన గ్రంథముల సారస్యము గ్రహింపను నేరని) రాజులకు స్వరచితకృతులను (కృతికర్తృత్వ రూపముననో, కృతిపతిత్వరూపముననో) అంటఁగట్టి (ఈలోకమున భోగభాగ్యములతో నందలాలంబారీలు నెక్కి యూరేఁగిన నేమి) పరలోకమున బాధలు

పఱుదురు" అని పెద్దనగారి కెదురుదెబ్బ కొట్టినాఁడు. ఇట్లు నిబ్బరించి చెప్పిన మొనగాఁ డెవ్వఁ డనఁగా బైచరాజు వెంకటనాథకవిరాజు. ఈతని కృతి పంచతంత్రము. తెలుఁగున దేశిరచనాచమత్కారము గల గ్రంథ మీతని గ్రంథమును బోలునది వేఱొకటి గానరాదు. "ఈ రాచ కవిత్వబాధ పడరాదు పరామరిసింపు దైవమా" యని 'శారద నీరూప' మనఁబడిన గడుసరి కవిచేఁగూడఁ బలికించినవాఁడు. ఈతఁడు తన కృతిని తిక్కన, నాచన సోమనలవలె హరిహరార్పణము చేసినాఁడు.

"ఏ చనవు గలదు హరిహర
సాచివ్యము నొంద నన్యజనులకు మది నా
లోచింపఁ దిక్కయజ్వకు
నాచనసోమునకు నింక నాకుం దక్కఁ ?"

ఇతర రాజులతోపాటు కృతికర్తృత్వమును సొమ్మిచ్చి తనపై వేయించుకొన్నవాఁడే యీ రాజుగూడ నని లోకు లనఁబోవుదు రన్న భయమునఁ గాఁబోలు, స్పష్టముగా నీతఁడు —

"అసహాయసరసకవితా
రసికుఁడ వేంకటధరావరప్రభుఁడ, గుణ
ప్రసరప్రకాండమదవ
ద్బసలాయితవిద్వదఖిలబంధువ్రజుఁడన్."

అని చెప్పికొన్నాఁడు. మఱియు గద్యమున "నిస్సహాయకవితానిర్మాణభోజభూదార" అని తనకు విశేషణముఁ జేర్చుకొన్నాఁడు. "నిస్సహాయకవితానిర్మాణ చతురుఁ డానాఁటికి భోజదేవుఁడు, నీనాటికి మరల నేను" అని యాతఁడు గుండె నఱచికొని చెప్పుకొన్నాఁడన్నమాట.

౧౨. కొఱుత

పెద్దనగారి పయిపద్యమున 'కొఱఁతక బదుక' అనుచో 'కొఱఁతక = న్యూనతను' అని యొక యర్థము, 'కొఱుతక = కొఱ్ఱున' అని యింకొక యర్థము రావలెను. ఒక యర్థమున నా పదమున 'ఱ' అకారవిశిష్టము, సార్ధానుస్వారము; ఇంకొక యర్థమున ఉకారవిశిష్టము, నిరనుస్వారము. ఒక యర్థమున నా పదమున నరసున్న గలదు; వేఱొకదాన లేదు. "శ్లేషే సఖండనిర్బిందోర్శ్లేషణం కుత్రచి న్మతమ్" అన్నశాస్త్రము చొప్పునను, "లడయో ర్ణణయో శ్చైవ........స్యా దభేదేన కల్పనమ్" అన్న శాస్త్రము చొప్పునను అఱసున్న కలిమిలేములు శ్లేషార్థమునకు బాధకములు గావుగాని, అకారోకారభేదము బాధకమనియు, ఇక్కడ శ్లేషార్థము దుస్సాధ మనియు పెద్దలందఱుఁ జెప్పుచున్న చొప్పునే నే నెప్పుడో వెల్లడించితిని. గుంటూరి విద్వాంసులొకరు ఈ భేదముకూడ పాటింపరానిదే యని, శ్లేషము చెల్లు నని కావ్యాలంకారసూత్రాంధ్రీకరణమునఁ గాఁబోలును వ్రాసిరి. తలుపు, తలఁపు ఇత్యాదులకు శ్లేష సంగతి చెల్లుననుట గదా యిది! విజ్ఞులు ప్రమాణము.

## ౧౩. శ్రీ కృష్ణదేవరాయాగ్రగణ్యుఁడు

"ప్రబల రాజాధిరాజ వీరప్రతాప
రాజపరమేశ బిరుదవిభ్రాజి యెవ్వఁ
డట్టి శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁ
డొక్కనాఁడు ..."

ఇందు "శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁ" డనుచోట "కృష్ణరాయవీరాగ్రగణ్యుఁ" డని పాఠ మున్నది. "శ్రీకృష్ణదేవరాయ" పదము సంజ్ఞావాచక మనుకొనుచో "అగ్రగణ్యుఁడు" అన్నపదముతో సమాసము నసిపడదు. శ్రీకృష్ణరాయ వీరాగ్రగణ్యుఁ డను పాఠము సుందరమయినది. తొలిపాఠమునే యభిమానించువారు 'కృష్ణదేవ' నామము గల రాజాగ్రగణ్యుఁ డని పొసఁగించుకొనవలసియుందురు.

## ౧౪. పాలింపఁగాను

"......భూవిభుని కృష్ణరాయఁ డభ్యుదయ మంది-పెంపుమీఱంగ ధాత్రిపాలింపుచుండ" నని యచ్చుప్రతులలో నున్నది. ప్రాఁత ముద్రణమునందును, వ్రాఁతప్రతులలోను "పెంపు మీఱంగ ధాత్రిఁ బాలింపఁగాను" ఉన్నది. ప్రాచీన కవులు కొందఱు 'పాలించుచు' అనియేకాని, 'పాలింపుచు' అని ప్రయోగము చేయరయిరి. పెద్దన యాత్రోవవాఁడు గావచ్చును.

## ౧౫. వామనస్తుతి

"ప్రత్యూషపవనాంకురములు పైకొనువేళ వామన స్తుతిపరత్వమున లేచి"—ఇక్కడ 'వామనమూర్తి స్తోత్రము

నందలి యాసక్తిచేత విష్ణుమూర్తి స్తోత్రపారాయణముతో ననుట' అని వాఖ్య. కాని యిక్కడ వామనస్తుతి యనఁగా 'దధివామనస్తోత్ర' మను సంస్కృతస్తోత్రగ్రంథ మగును శ్రీకృష్ణదేవరాయలవారు తెల్లవారుజామున నిద్ర లేవఁగానే యీ దధివామనస్తోత్రమును పారాయణముచేయుట పరిపాటి. రాయవాచకమునఁ జూచునది. దధివామనుఁ డనఁగా 'వెన్నముద్ద బాలగోపాలకృష్ణమ్మ'. ఆంధ్రదేశ మంతటను సామాన్యముగా స్త్రీపురుషులు తెల్లవారుజామున నిద్ర లేచి భూపాలరాగముతో 'గుమ్మఁ డేఁడే గోపిదేవి' ఇత్యాదిగా దధివామనస్తుతినే చేయుచుందురు.

### ౧౬. మండలిక తపన

" మండలికతపన శోభిత !

కుండలిపతిశయన కర్ణకుండలిత రసా
ఖండకవికావ్య ! దిగ్వే
దండశ్రుతిదళనకలహతాడితపటహా ! "

"మండలికతపనుఁ డను బిరుదుచే శోభిల్లువాఁడా! కుండలిపతిశయనునికిఁ గర్ణకుండలములుగాఁ జేయఁబడిన రసాఖండములగు కవికావ్యములు గలవాఁడా!"అని వ్యాఖ్య.

'మండలికతపనశోభిత' అని సమాసముగుచో 'మండలికతపనుఁడు అను బిరుదుచే శోభిల్లువాఁడా' అని యర్థము నీయఁగల శక్తి దాని కుండదు. ప్రాఁతప్రతిపాఠమి ట్లున్నది: "మండలికతపన! పూజితకుండలిపతిశయన!"

'మండలికతపన !' బిరుదాంకసంబోధనము. ఇఁక పద్య మిట్లు క్రింది తీరు సంబోధనములతో నుండును:

> "మండలికతపన ! పూజిత
> కుండలిపతిశయన! కర్ణకుండలితరసా
> ఖండకవికావ్య ! ... ..."

రసాఖండములగు కవులకావ్యములను కృష్ణరాయలే కర్ణకుండలములుగాఁ జేసికొనుచుండువాఁ డని యర్థమగును.

## ౧౭. చతుర్విధ కవితలు

"శఠకోపప్రసాదాసాదితచతుర్విధకవితామతల్లి కాల్ల సాని" అని యాశ్వాసాంతగద్యమునఁగలదు. 'చతుర్విధ కవిత లనఁగా, బంధము, చిత్రము, గర్భము, ఆశువు' అని వ్యాఖ్య. ఇది సరిగాదు. ఆశు, మధుర, చిత్ర, విస్తరము లన్నవి చతుర్విధకవితలు.

## ౧౮. రాచవారు

"వలరాచరాచవాఁ డలికాక్షు కనువెచ్చఁ గరఁగిన యలకనికరపుఁ జోటు." (౨-౧౦)

పైపాఠ మచ్చులో నున్నది. 'రాచవాఁడు' అని యేకవచనాంతముగా నా పదమున కెక్కడను బ్రయోగము గానరాదు. 'రాచవారు' అన్నపదము 'దొరవారు' అన్నపదమువంటిది.

"ఒక చపలాక్షి లేఁజిగురుటూయెలఁ గోయలరాచ వారి నిక్కకు నెలయింపవచ్చు..."

(ఉత్తరహరివంశము)

"వనికమోముతా ల్వెలుకనెక్కినరావుతు రాచవారు"

(భీమఖండము)

కనుక నిక్కడఁగూడ 'వలరాచరాచవా రలికాత్ము కనువెచ్చ 'ననియే యుండవలెను.

౧౯. అనుకూలగతి

"అనుకూలవతి నాదు మనసులో వర్తించు కులకాంత మది నెంత గుందునొక్కొ."—ఇక్కడ 'అనుకూలవతి' యన్న పదము క్లేశపడి సమర్థింపవలసినది. అనుకూలపదమున కానుకూల్య మర్థముచెప్పుకోవలెను. 'అనుకూలగతి' యన్నపాఠము వ్రాఁతప్రతులలో నున్నది. దీని గ్రహించిన నే యసందర్భము నుండదు.

౨౦. కుఱుంగలి, ఓసరించక

"గొంటుఁదనం బెఱుంగక కుఱుంగటనున్న యమ్మహీసుర ... గదురు మనంబున నోసరించక చంచల దృగంచలప్రభలు......"

(౨-౬౧)

పయివచనమున అనుప్రాసనంగతిని బట్టి 'కుఱుంగట కంటె 'కుఱుంగట' యుండఁదగు ననిపించును. శబ్ద నిష్పత్తి కూడ (కుఱు+కలను) 'కుఱుఁగలి' యగుటకే నసిపడును. వ్రాఁతప్రతులలో 'కుఱుంగట' అన్న రూప మున్నది. మఱియు నీ పదము సోమనాథుని యుత్తరహరివంశమునఁ

గూడ ' కుఱుంగలి ' యని యనుప్రాససంగతితోనే కలదు.

"చక్రంబు మొదలగు కైదువలు మెఱుంగులు గుఱుంగ లించిన రవిమండలంబు తెఱంగున."

(ఉ. హరి. ౮ ఆశ్వా.)

ఇట్లు చూడఁగా ' కుఱుంగలి ' రూపము సాధు వని యేర్పడినది. ' కుఱంగలి ' రూపపు సాధుత్వము చింత్యమే. మఱియుఁ బహువచనమున ' ఓసరించక ' పెద్దన సమ్మతించినది.

## ౨౧. ఉపాధ్యాయి

"ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱి యెందేఁ గంటిమే" అన్న పద్యములో 'కామశాస్త్రోపాధ్యాయివి" అనఁగా ఉపాధ్యాయుని పత్ని అనికాక, స్వయము వ్యాఖ్యానము చేయనేర్చిన యుపాధ్యాయురా లని యర్థము. వరూధిని యుపనిషన్మంత్రమునకు స్వయము క్రొత్తయర్థము కల్పించినది గదా!

## ౨౨. బాహుమూలరుచి

ప్రవరుఁడు రోఁతచెంది 'చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మాసాలపైఁ దేనియల్' అని తెగడఁగా వరూధిని హృదయాబ్జము జల్లన, నీవిబంధ మూడఁగా, కొప్పు వీడఁగా, రతిసంరంభము మీఱఁగా, పైపాటున—

"ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లుపొంగారఁ బైయంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింప..."

ఈ పద్య మిట్లు ముద్రణములందున్నది. వ్యాఖ్యాతలు "ప్రాంచ ద్భూషణములయొక్కయు, బాహుమూలముల యొక్కయుఁ బ్రకాశముతో పాలిండ్లు పొంగారఁగ = ఉబ్బఁగా, పైయంచుల్ = చనుమొనలు, మోవఁగఁ = ఆనునట్లుగా, కౌఁగిలించి" అని వ్యాఖ్య వ్రాసిరి. కాని వ్రాఁత ప్రతులలో 'పాలిండ్లు పొంగారి పైయంచుల్ మోవఁగ' అని పాఠ మున్నది.

ప్రాంచద్భూషణములగు (ప్రాంచద్భూషణపదము బాహులకుఁగాని, తన్మూలములకుఁగాని విశేషణము) బాహుమూలముల కాంతితో (ఆ కాంతి యలముకొనె ననుట) పాలిండ్లు పొంగారి, పై యంచుల్ మోవఁగ = దోర్మూలకూలంకషములుకాఁగా ('ప్రతిక్షణవిజృంభణా దుభయబాహుకూలంకష స్తనత్రుటితకంచుక' మిత్యాది ప్రయోగముల ననుసంధించునది.) అధరం బాసించినది. ఇక్కడ పై యంచుల్ = చూఁచుకములు అని వ్యాఖ్యానము సుందరము గాదు. రతిసంరంభము మీఱి పైపాటునఁ జేసిన కౌఁగిలింత యట్టిదిగా నుండదు. ఈసందర్భము నింకను వెలిఁగించుట బాగుగాదు. కళాప్రపూర్ణులు శ్రీశేషాద్రి శర్మగా రిక్కడ నిట్లు వ్రాసిరి: "బాహుమూలరుచితోఁ = భుజశిఖరముల కాంతితో,......మూలమనఁగా మొదలు, బాహుమూలము లనఁగా భుజశిఖరములు అను నర్థ మేర్పడును. బాహుమూలములందు కేయూరము లను భూషణము లుండును. స్త్రీలకు నుండునా యని ప్రశ్నింతు

రేమో ! స్త్రీపురుషసాధారణములగు భూషణములే యవి యని యేర్పడును. కేయూరచతుష్టయము పరమేశ్వరికి భూషణములుగాఁ జెప్పఁబడినవి. కావున నా పేరుగల భూషణములతోఁ గూడిన బాహుమూలముల కాంతితోఁ బాలిండ్లు పొంగార, అనఁగా నా కేయూరరత్నకాంతులు వక్షోజములపై వ్యాపింపఁగా నని యర్థము సిద్ధమగును...... కంచుకము సడలించిన దని యంగీకరించినను రాధ్యర్థమగు బాహుమూలకాంతి యసంగత మనవలయును. వీనికిఁ బ్రోద్బలముగాఁ బై పద్యమున 'నీవీబంధ మూడఁగ' అను మొదలగు రతిసంరంభచిహ్నములు చెప్పఁబడినవి. కనుక రాధ్యర్థ మంత సరసము గాదని తోఁచెడిని."

విమర్శమిది యేమో నేఁ దెలియఁజాలకున్నాఁడను. సంస్కృతాంధ్రకవులు పలువురు భుజయుగము పయికెత్తిన సందర్భములందు స్త్రీ'బాహుమూలద్యుతుల' వేలమువెఱ్ఱిగా వర్ణించిరి. ఆంధ్రమున నిట్టి సందర్భము వర్ణింపని యర్వాచీన కవి యుండఁ డనవచ్చును. వరూధిని భుజము లెత్తినప్పుడు వర్ణ్యము భుజశిఖరము లగునో, యిం కేమగునో చర్చ యెందుకు? పెద్దనామాత్యుఁడే తెనాలిరామలింగఁ డన్నట్టు లీ 'బాహుమూలరుచి' వర్ణనాభిమానము విడువఁజాలక కాఁబోలు మరలమరల నీ తీరుననే పంచమాశ్వాసమున వర్ణించినాఁడు:

" ... ... ఉత్కంఠాగ్రమై నిక్కి నా

థుని మూళిఁ దల్రబాలువోసె నవలాదోర్మూలకూలంకష

స్తనవిస్ఫూర్తికి సందిదండలధళళల్ సాహోనినాదం బిడన్.
ముడివడు కంకణప్రభల ముత్తెపుసేసలు దోయిలించి యె
త్తెడు తఱి బాహుమూలకుచదీప్తులపైఁ బతిదృష్టి పర్వినన్
జూడమిన లజ్జఁ బాణియుగమున్ వెసవంచియు మౌళిమీఁదికై
పొడవునఁ జల్లె— ”

(మనుచరిత్ర, ౫ ఆశ్వా.)

రంగనాథరామాయణమందును ఇట్టి వర్ణన ఉన్నది, యిదిగో :

“ పొంగారు కుచకుంభములు పదార్వన్నె
బంగారుపాడి రాలు బాహుమూలములు. ”

పెద్దనామాత్యుఁడు తాను తొలుతఁ జెప్పిన పద్యము లోని ‘ ప్రాంచద్భూషణము ’లను స్పష్టముగాఁ బంచమా శ్వాసపద్యమున ‘సందిదండ’లని తెలియఁజెప్పినాఁడు గదా!

౧౧

# అవీ - ఇవీ

---

## చెవపు

హారవిలాసమున 'చిఱుబంతిపసుపుతోఁ జెవపు నలఁది' అని యున్నది. పసిబాలుర మేననుండు నెఱ్ఱ మచ్చలకుఁ దెలుఁగున 'చెవ, చెవ్వ' అని వాడుక. ఇక్కడకూడ నదే యర్థము కాఁదగునుగాని, 'చెవపు' వ్రాఁత ప్రతులలో నున్నది. అఱవమున ఎఱ్ఱఁదనమునకు 'శివప్పు', 'సెగపు' అని వ్యవహారము. అఱవపు 'శివప్పు' తెలుఁగున 'చెవపు' అయినది కాఁబోలును.

## చిగురుఁగొమ్మ

మనుచరిత్రములోని పద్యములకుఁ గొన్నింటికి నా కంటికిఁ గానవచ్చిన పాఠభేదములను, నా బుద్ధికిఁ దోఁచిన యర్థవిశేషములను ఇక్కడ వెల్లడించుచున్నాఁడను:

అరుణాస్పదపురవర్ణన మిట్లు గలదు:

"అచటి విప్రులు మెచ్చ రఖిలవిద్యా ప్రౌఢి
ముది మదిదప్పిన మొదటి వేల్పు
నచటి రాజులు బంటు నంపి భార్గవునైన
చింకానఁ బిలిపింతు రంకమునకు
నచటి మేటి కిరాటు లలకాధిపతినైన

మును సంచి మొద లిచ్చి మనుప దక్షు
-వటి నాల్గవజాతి హలముఖాత్తవిభూతి
నాదిభిక్షువు భైక్షమైన మాన్పు
నచటి వెలయాండ్రు రంభాదులైన నొరయఁ
గాసెకొంగున వారించి కడపఁగలరు
నాట్యరేఖాకళాధురంధరనిరూఢి
నచటఁ బుట్టిన చిగురుఁగొమ్మైన జేవ."

పై సీసపద్యము తొలి నాల్గు చరణములలో నాల్గు వర్ణములవారి వర్ణన మున్నది. ఎత్తుగీతి మూఁడుచరణములు వెలయాండ్ర వర్ణనముగాను, నాల్గవ చరణము "అయూరఁ బుట్టినది సర్వమును సారవంతమే" యని సర్వవస్తుసామాన్యవర్ణనాత్మకముగాను ప్రాచీనవ్యాఖ్యాతలు వ్యాఖ్యానించిరి. కాని యిట్టి యన్వయమునఁ గూర్పుసొంపు గొంత కొఱవడును. సీసచరణములు నాల్గింట వేర్వేఱుగా నాల్గు వర్ణ్యము లున్నట్లు, ఎత్తుగీతి నాల్గు చరణములను నాల్గువర్ణ్యములు వేర్వేఱుగా నుండుట గాని, రెండేసిచరణముల కొక్కటిచొప్పున నాల్గుచరణములకు రెండు వర్ణ్యము లుండుట గాని, లేక నాల్గింట నొక్కటే వర్ణ్య ముండుట గాని నేర్పుగల కూర్పనిపించును. ఎత్తుగీతి రెండవ చరణము తుదిని సమాపకక్రియ గలదు. వాక్య మక్కడికి సమాప్త మైనది. వ్యాఖ్యాతల వ్యాఖ్యానరీతికి మూఁడవచరణము నా సమాప్త వాక్యములోని కీడ్చుకొనిపోయి యన్వయింపవలెను. పెద్దనామాత్యున కిట్టియన్వయ మభిప్రేతమయ్యేని అతఁ డా మూఁ

డవ చరణమును రెండవచరణముగానే నిలిపియుండఁగలఁడు. అప్పు డన్వయసారళ్యము పొసఁగును. పెద్దన పయిపద్య మున నొక్కొక్క వర్ణ్యమును 'అచటి' ఇత్యాదిగా వేర్పఱిచి వర్ణించినాఁడు. ఈ తీరును గుర్తింపవలసినదే.

ఇవి యెల్లఁ బర్యాలోచించినపై నాకుఁ దోచిన య న్వయపద్ధతి నిదె తెల్పుచున్నాఁడను: ఎత్తుగీతి నాల్గుచరణము లందును వర్ణ్యమొక్కటే—వెలయాండ్రే. కాని నాల్గుచర ణములలోను తొలి రెండుచరణములు నొకవాక్యము; తుది చరణ మింకొక వాక్యము. మూఁడవచరణము దేహళీదీప న్యాయమున రెండువాక్యములందును బొందుపడును. తొలి రెండు చరణములు వేశ్యాసామాన్యవర్ణనము; తుది చర ణమునందుఁ దద్విశేషవర్ణనము. తొలివాక్యమునకు— అచటి వెలయాండ్రు (దేవలోకమునుండి దిగివచ్చి) రంభా ద్యప్సరసలనయినను వంతున కెక్కఁజూచినఁ దమ పృష్ఠభా గపుఁ గోఁక (గోచి) కొంగుతో వెనుకకుఁ దొలఁగఁద్రోచి తాము ముందడుగు వేయఁగలరు: కడవఁగలరు=ముందడుగు వేయఁగలరు. ఇక్కడ 'కడప', 'కదుమ', 'కడవ'- పాఠము లున్నవి. ముద్రణమున 'కడప' గలదు. నేను 'కడవ' గైకొంటిని. ఇట్లీ రెండుచరణములందును వేశ్యా సామాన్యవర్ణనముచేసి పెద్దన కడపటి చరణమునఁ దద్విశేష వర్ణనము చేయుచున్నాఁడు. 'నాట్యరేఖాకళాధురంధర నిరూఢి'ని'అచటఁ బట్టినఁ జిగురుఁగొమ్మైనఁ జేవ'అచటన్= ఆయూర, పట్టినన్=పరీక్షింపఁగా—నాట్య మాడించి

చూడఁగా—వంచిపట్టి చూడఁగా, చిగురుఁగొమ్మైనన్ = పుష్పితకాని, అంగసౌష్ఠవ మింకను సరిగా విరియని పసి తనపు (వెల)కొమ్మ = అదుదికూడ (కొనసాగుచున్న తలిరుఁ (లేఁత) గొమ్మకూడ), చేవ = చేవగలదే, గట్టితనము కలదే.

ఇంచుక వివరణము: ప్రౌఢలగు నాయూరి వెల యాండ్రు రసికుల కలయికలం దాఱితేఱి యనుభవజ్ఞానము గడించినవారు గాన రంభాదులతో నొరసి శృంగారరససంప్ర దాయవిశేషములను నాట్యాభినయములందుఁ జూపి నేర్పు మెఱయింపవచ్చును. అది విశేషము గాదు. రసానుభవము నకుఁ దగ్గ వయసింకను రాకముందే—పసిప్రాయమందే— ఆయూరి వెలకన్నెలు నాట్యాదులందుఁ గడు చతురలు. అర్థాంతరన్యాసముగా నాల్గవచరణము మాత్రము నేర్పఱి చిన నాయూరఁ బట్టి (వంచి) చూచిన లేఁతకొమ్మలుగూడఁ జేవగలవే. పసివారుగూడఁ గడుఁబ్రోడలే యనియు నేర్ప డును.

ఈ పద్యమున 'కాసెకొంగున వారించి కడవఁగలరు' అన్న పాఠము 'గదుమఁగలరు' అన్న పాఠముకంటెను, 'కడ వఁగలరు' అన్న ముద్రితపాఠముకంటెను సుందరతమము. మఱియు 'అచటఁ బట్టిన చిగురుఁ' అను పాఠముకంటె 'అచటఁ బట్టినఁ జిగురుఁ' అన్న పాఠము సుందరతరము. తెనుఁగున 'పట్టిన...కొమ్మ' పలుకుబడికల్మికి 'నేపట్టింది మునగకొమ్మ కాదు లే' అని రామదాసుకీర్తన తార్కాణ.

ఈ పద్యమునుగూర్చి కడపవాస్తవ్యులు, కళాప్రపూర్ణులు శ్రీ శేషాద్రిశర్మగారు కడపమండలమున సిగర చెట్లని చెట్లు కలవనియు, వానికిఁ జేవ యుండదనియు, ఆ సిగర చెట్లకొమ్మలే చిగురుకొమ్మ లనఁబడెననియు, పెద్దన కడప మండలమువాఁడు గాన, తదనుస్మరణమున వరణానదీతీరపు టరుణాస్పదపురవర్ణనమున వానిఁ బేర్కొనెననియు ననిరి. ఈ పద్యమున వేళ్యలుగూడఁ గడపమండలమువారు గావచ్చును. 'కడపఁగలరు' పాఠమున్నది గదా !

'ఆనందో బ్రహ్మ'

"ఎందే డెందము గందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్
జెందున్, గుంభగతప్రదీపకళికా శ్రీ దోఁప నందిందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబు గను, నా యింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న ప్రాఁజదువు నంతం బర్థ మూహింపుమా!"

నాకు నచ్చిన పాఠప్రకారమునఁ బైపద్యము నుదాహరించితిని. అచ్చులోను, వ్రాఁతలోను దీన మఱికొన్ని పాఠాంతరములుగలవు. 'కందళింప', 'నేకాంతతన్', 'నెందెందుఁ బోక', 'సుఖంపఁగను', 'అంతర్బుద్ధి' అనునవి యా పాఠాంతరములు.

ఇందు 'ఎందే డెందము' - ఆదిగా 'సుఖంబుగను' వఱకు రెండు వాక్యములు. తొలి వాక్యమున 'కందళించు'కు శ్రీ జయపురాధీశ్వరులు పొసఁగించిన ధాతుజవిశేషణత్వము సుందరము. ఈ విషయము కాదు ప్రధానముగా నే నీ పద్యమునఁ జెప్పఁబూనినది.

'ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా' అన్న పాఠముకంటె 'ప్రాఁజదువు నాంతం బర్థ మూహింపుమా' అన్నపాఠము చాల సుందరమయినది. ఎట్లనఁగా: పయి పద్యోపన్యాసముఁబట్టి ఆనందమే బ్రహ్మమన్న యర్థము వ్యక్తపడును. కాని యింతమాత్రమున వరూథినివాదము నెగ్గదు. ప్రవరుఁ డనఁగలఁడు: 'ఇది యథార్థమే. ఆనందమే బ్రహ్మము. ఆ యానందము నాకు గృహ్యాచారధర్మానుష్ఠానమువలన లభించును' అని. అట్లనుటకు వీలులేకుండ 'ఆనందమే బ్రహ్మము. ఆ యానందము సంభోగరూపము.' అని నిరూపించుటకు 'ఆనందో బ్రహ్మ' అన్న యుపనిషన్మంత్రప్రతీకము నిచ్చి యా మంత్రమును కడముట్టఁ జదువు కొని యర్థ మూహించిచూడు మనుచున్నది. ఆ మంత్ర మిది:

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్,
ఆనందాద్ధ్యేవ ఖ ల్విమాని భూతాని జాయన్తే,
ఆనందేన జాతాని జీవన్తి,
ఆనందం ప్రయ న్త్యభిసంవిశ న్తీతి."

దీనికి వరూథినితలఁపులో నున్న యర్థ మిట్టిది :

"ఆనందమే బ్రహ్మమని తెలిసికొనెను. ఆనందమున నుండియే (సంభోగానందమున నుండియే) భూతములు జనించుచున్నవి. పుట్టిన యా భూతములెల్ల నా (సంభోగా) నందముచేతనే వర్ధిల్లుచున్నవి; ఆ యానందములోనికే ప్రవేశించుచున్నవి. ఆ యానందమునకే యభిముఖస్థితిని

బొందుచున్నవి.' ఇంత కింకను బచ్చిగా వివరించి చెప్పఁదగి నట్టిది వరూథినితలఁపులోని యర్థము.

వరూథిని యచ్చరపువ్వుఁబోఁడి; స్వాధ్యాయానుష్ఠాన పరులగు విప్రవర్యు లెందఱో స్వర్గమునకు రాఁగా వారితోఁ బ్రసంగములు గావించి ప్రౌఢి కెక్కినది. అద్వైతులు జీవ బ్రహ్మైక్యప్రతిపాదకశ్రుతులను, ద్వైతులు జీవబ్రహ్మ విభేద ప్రతిపాదక శ్రుతులను, ఇంక నాయా వైదిక మతములవారు తమతమ మతముల కనుకూలములగు శ్రుతులను సేకరించి యుంచుకొనునట్లు, వరూథిని తృతీయ పురుషార్థమే పరమార్థమని నిరూపించుటకుఁ దగ్గ శ్రుతులను గూర్చికొని నేర్చుకొనియున్నది గావలయు. పయి శ్రుతికి వరూథిని నిర్ణయించుకొన్న యర్థముచొప్పుననే నన్నిచోడ మహాకవి యొక పద్యము రచించినాఁడు.

"పృథులవిశ్వంభరా రథమున కదురుగాఁ
బూన్పించె నెవ్వాఁడు పువ్వుఁదేరు,
కాంచనాచలకార్ముకమునకు సాటిగాఁ
జేపట్టె నెవ్వాఁడు చెఱకువిల్లు,
అవిరళ(తథ?) పాశుపతాస్త్రమ్మునకు వాఁడి
మిగిలించె నెవ్వాఁడు చిగురుఁదూపు
అతులితామరదానవాదిబలంబుల
గెలిపించె నెవ్వఁ డయ్యాలిబలము
నట్టి జగజెట్టి మన్మథుఁ డఖిలలోక
ములకు వెఱఁగొంగ దేవులమూలకంద

మతని యిలుసొచ్చి వెడలనియతఁడు గలఁడె
యతని యమ్ముల( బడకున్న యదియుఁ గలదె?"

వరూథిని యుపనిషన్మంత్రమునకు గోచరింపించిన శ్రౌత్రయర్థమును బర్యాలోచింపఁగా బ్రవరునకు సిగ్గును, వెగటును బొడమినవి. సంభోగవిషయ మని సిగ్గు; పవిత్ర మైన మంత్రార్థము పాడుపడిన దని వెగటు.

పాఠ్యాగమసూక్తపంక్తి

"ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱి యెం
దేఁ గంటిమే కామశా
స్త్రోపాధ్యాయివి నా వచించెదవు మే
లోహో త్రయీధర్మముల్
పాపంబుల్ రతి పుణ్య మంచు నిఁక నే
లా తర్కముల్ మోక్షల
క్ష్మీపథ్యాగమసూత్రపంక్తి కివె పో
మీ సంప్రదాయార్థముల్."

అన్నాఁడు. ఈపద్యమున "మోక్షలక్ష్మీపాఠ్యాగమ సూక్త (త్ర) పంక్తి కివివో మీ సంప్రదాయార్థముల్." అన్న పాఠముసుందరము. మోక్షలక్ష్మిని (అచ్చరపూఁబోఁడినికాదు) బడయుటకుగాను పాఠ్యమయిన యుపనిషన్మంత్రక్రమ మునకు మీ సంప్రదాయమువారు (తృతీయపురుషార్థమే పరమార్థమనువారు) చెప్పెడు నర్థ మిట్టిదియా యనుట నేఁ జూపిన పాఠమున కర్థము.

## కృష్ణదేవుఁడు గాదు, బాలకృష్ణుఁడు

తెలుఁగు సకలకథాసారసంగ్రహము అయ్యలురాజు రామభద్రవిరచితము "శ్రీకృష్ణదేవరాయప్రేరణమున తదంకితముగా రచితమయ్యె" అని వెనుక నొకప్పుడు వ్రాసితిని. అది కృష్ణరాయప్రేరణముననే రచింపఁబడెనుగాని శ్రీకృష్ణదేవరాయనికిఁ గాక శ్రీకృష్ణదేవుని కంకితముసేయఁబడినది. అం దిట్లు గలదు:

"కనకవస్త్రంబుగల మృదుతనువువాఁడు
భర్మనూపురయుతపదాబ్జములవాఁడు
మించి వేదాంతముల సంచరించువాఁడు
ప్రౌఢి శ్రీ కృష్ణుఁ డను పేరఁ బరగువాఁడు.

మదీయభాగ్యవశంబున స్వప్నకాలంబునఁ బ్రసన్నుండై పరమమంత్రోపదేశపూర్వకంబుగా సకలకథాసారసంగ్రహంబునకుఁ గృతినాయకునిఁ దన్నుఁ గావింపు మని హితోపదేశంబు చేసి యంతర్హితుం డయ్యె."

స్వప్న వృత్తాంతమును గవి కృష్ణరాయల కెఱిఁగించెను. ఆ రాజముఖ్యుం డి ట్లనియె:

"నీవును బాలకృష్ణపదనీరజభక్తుఁడ వార్యచిత్తమోదావహసద్గుణుండవు రమాధిపునిం గలలోనఁ గాంచి య
ద్దేవు హితోపదేశమునఁ దేజము నొందినవాఁడ విన్నిటం
గావున నీ ప్రబంధము ప్రకాశముగా హరి కిమ్ము నావుడున్."

ఇందు పురాణాదులనుండి పుణ్యకథలను రామభద్రకవియే సేకరించిన ట్లున్నది. రాయలవారి సంస్కృత

గ్రంథానుస్మరణము లేదు. ఉపలభ్యమానమగు గ్రంథము తుది పద్య మిది:

కడు వచియింపరాని ఘనకష్టము లెల్లను గృష్ణ సత్కృపన్
గడచితి మింకమీఁదను ఘనస్ఫుటరాజ్యరమాభివృద్ధిచొ
ప్పడు నని మీరు గోరుటలు బాపురె వ్యర్థము లాయెఁ; నింక నే
నుడువఁగ నేల మృత్యు వెపనూల్కొని కానఁగవచ్చు చోటులన్.

ఈ తుదిపద్యము కృతికర్తదో, కాదేని కృతిప్రేరకు నిదో యవసానమును దెలుపుచున్న ట్లున్నది.

శ్రీకృష్ణదేవరాయలవారి కడపటికాలపు కడగండ్లకే యీపద్యము కడుంగడు సరిపడునదిగా నున్నది. ఏక పుత్త్రుఁడు చనిపోవుట, తిమ్మరుసుకన్నులు తీయించుట, తత్పుత్త్రుని తిరుగఁబాటు, తగవులు, ఈ సంక్షోభములో రాయల మరణము—ఇన్నింటి నీ పద్యము ధ్వనించుచున్నది.

శ్రీకృష్ణరాయఁడు రామభద్రకవిని 'నీవును బాల కృష్ణపదసీరజభక్తుఁడవు' అన్నాఁడఁట. ఇక్కడ విశేష మేమనఁగా, నుదయగిరిని జయించినప్పు డక్కడనుండి మిక్కిలి చక్కని బాలకృష్ణవిగ్రహమును శ్రీకృష్ణదేవరాయలు విద్యానగరమునకుఁ గొనివచ్చి దేవళము కట్టించి యందుఁ బ్రతిష్ఠించి పూజించుచుండువాఁడఁట.

ఆయన బంగరునాణెములందుఁగూడ నాబాలకృష్ణుని విగ్రహము ముద్రితమయియున్నది. కృష్ణరాయలతోపాటు రామభద్రకవియు నా బాలకృష్ణమూర్తిని గొల్చుచుండు

వాఁడు గాఁబోలును! దివ్యసుందరవిగ్రహమగు నాబాల కృష్ణమూర్తి యిప్పుడు మద్రాసు మ్యూజియములో పూజా పురస్కారములు లేకున్నను దర్శనీయమై యున్నది.

దొరకినవఱకు శ్రీకృష్ణరాయకృతమగు సకలకథా సంగ్రహ శ్లోకము లివి:—

క్షీరాంభోధితపఃఫలేన మహతా నీరాజితోరఃస్థల
స్తారాధీశదినాధినాథనయనో ధారాధరశ్యామలః
యో వేదాంతగిరా మలక్ష్యమహిమా దేవేశముఖ్యైస్స్తుతః
సోఽయం తిష్ఠతు మామకీనహృదయే శ్రీవేంకటాద్రీశ్వరః.
సాంద్రానందఘన స్సమగ్రకరుణాసంపూర్ణనేత్రాంచలః
మందాకిన్యధివాసమంజులజటాజూటో......

కల్యాణాచలకార్ముకః కలయతాం కల్యాణ మవ్యాహతం
చంద్రాలంకృతమౌళి రద్రితనయాశృంగారితాంగ శ్శివః.

శ్రీమా నభూ త్తుర్వసువంశమౌళి శ్శ్రీతిమ్మభూపో జగదేకవీరః,
స దేవకీనామ్ని కళత్రరత్నే ప్రాసూత ధీరం సుత మీశ్వరాఖ్యమ్.

స బుక్కమాంబాం పరిణీయ తస్యా మౌదార్య గాంభీర్య వివేక శౌర్యైః,
దాక్షిణ్య కారుణ్య నయైశ్చ యుక్తం లేభే తనూజం నరసక్షితీశమ్.

స బాల్య ఏవావని మర్ణవాంతా మత్యర్థశౌర్యేణ నిరంకుశేన, [న్యజైషీత్.
మాంధాతృముఖ్యాన్ మహితాన్ మహీపాన్ యశోవిశేషై రఖిలా

బాహోర్బలే నార్జితవిత్తజాలైః కృతార్థయి త్వాఖిల మర్థిసార్థమ్,
కాశీప్రయాగాది మహార్హతీర్థే మహాంతి దానాని ముహు శ్చకార.
కులేన శీలేన గుణేన భక్త్యా ప్రేమ్ణానుకూల్యేన చ సంయుతాయామ్,
నాగాంబికాయాం నరసక్షితీశః ప్రాసూత మాం న్యక్కృతవైరివర్గః.

సోఽహం సుతం శ్లాఘ్యగుణాన్వితాయాం తిమ్మాంబికాయామిహ తిమ్మ
భూపమ్,
ఉత్పాద్య నామాస్య సహోర్థజాతై స్సమార్పయం వేంకటశైలభర్త్రే.
ఏవం చ చేత స్యనవాప్య తృప్తిం వాచాపి పూజాం కలయే కథం వా,
శ్రీవేంకటాధీశితు రి త్యుదారం చిత్తే విచారం కలయ న్నజస్రమ్.
ఉత్సాహం మమ వీక్ష్య మద్గురు రథ శ్రీవ్యాసతీర్థో మునిః
పర్యాలోచ్య పురాణశాస్త్రవివిధామ్నాయేతిహాసాదికాన్,
లబ్ధ్వా తత్ర కథా హరేః పశుపతే స్సామ్యం నిరూప్యా(రస్యా?)ధికం
విష్ణుం కీర్తయ సర్వథే త్యుపదిశన్ మహ్యం ముదా దత్తవాన్.

ఆహివెట్టు :

"ఆహివెట్టిరి జొన్నగడ్డాగ్రహార వృత్తి యేనూటిరూకల వృత్తమునకు"
(క్రీడాభిరామము, పా. ౧౦)

ఆక్షేపము :

"ఇందు 'ఆహివెట్టు=తాకట్టుపెట్టు' అని శ్రీ శాస్త్రిగారు (పీఠిక పా. ౧౨౩) అర్థము వ్రాసినారు. ౧౦ పొరటలో మూలమునఁగూడ నిట్లే యున్నది. కాని 'ఆహివెట్టు' అను పదమే యెక్కడను గాన్పింపదు. కావున నిట 'ఆధివెట్టు' అని యుండవలయును. ఆధి శబ్దమునకుఁ దాకట్టు అను నర్థము గలదు.

ఈ క్రింది ప్రయోగములోఁగూడ 'ఆధివెట్టు' పదము గలదు.

"గ్రహణసంక్రమణాదుల రాచనగరఁ-గానుకిసంబు వెడలమి గ్రాసమునకు
నాధివెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని-లెస్సయుండును గృహభర్త లేని
బ్రదుకు." (మనుచరిత్ర, ౩-౩౮)

దీనికి నేఁ జెప్పు సమాధాన మిది:

నిఘంటువులలో ఏకమాత్రప్రయోగముతో ఎన్నో పదములు పరిగృహీతము లయినవి.

వ్రాఁతప్రతిలో నున్న 'ఆహివెట్టు' ప్రయోగము సరికా దన్న యపనమ్మకము నాకు లేదు. కాన దానిని నే దిద్దలేదు. 'ఆధి' పద మొకటి 'తాకట్టు' అర్థముగలది ఉన్నంతమాత్రాన 'ఆహి' ఉండ దనవచ్చునా?

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమున ఎల్ల వ్రాఁతప్రతులలో 'ఆహికంబులు వెట్టి' అన్న ప్రయోగము గానవచ్చుచున్నది-'ఆహికంబులు వెట్టి యవి దక్కఁ—మితులు సాహసంబునఁ బల్కి—' (చూ. ఉత్తరభాగము). బ్రౌనుదొరగారి పండితులు ఇందు 'తాకట్టుపెట్టి' అని యర్థము వ్రాసిరి. తేవప్పెరుమాళ్లయ్యగారు వ్రాఁతప్రతులను, బ్రౌనుదొరగారు వ్రాయించిన టీకను బరిశీలించి 'ఆహికము' తాకట్టు అను నర్థముతో ప్రకటించిరి (చూ.౧౯ రపుట). పిదప శ్రీ వేంకటరాయశాస్త్రిులుగారు మరల నాగ్రంథమును బ్రకటించుటలో ఆహికము శబ్దరత్నాకరాదినిఘంటువాద్ధృతము గాకుండుటచేఁ గాఁబోలును 'ఆహితము' అని దిద్దిరి (చూ.౧౫౧ పుట). తాకట్టు అనియే యర్థము వ్రాసిరి. ఆ పాఠము వ్రాఁతప్రతులలో లేదు. తెలుఁగున 'ఆయకము' అను పదము తాకట్టు అను నర్థమున వ్యవహారమునఁ గలదు. 'ఆయకము' రూపాంతరము 'ఆహకము' అని యుండునని కాఁబోలును బ్రౌను, సీతారామాచార్యులు తమ నిఘంటువులలో గౌరనప్రయో

గమును 'ఆహాకము'గా గ్రహించిరి. వ్రాతప్రతులలో లేని 'ఆహాకము' రూపము గ్రాహ్యము కాదు. కారణ నవనాథ చరిత్రమునఁగూడ 'ఆహికము' కలదు — 'ఆహికంబులు వెట్టి యప్పులువార, వృద్ధి కొసంగుదు...' (చూ.౧౫౩ పుట). ఆహి, ఆహికము రూపభేదములు కాఁబోలును. ఆహిపద ప్రయోగము ఇంత సాధకసామగ్రి కలది. శ్రీనాథప్రయుక్తమయిన యీ 'ఆహి' ప్రయోగము విడనాడి యీ యర్థమున శ్రీనాథరచనముల నారగించి జీర్ణించుకొని కవితాబలము గడించినవాఁడు పెద్దనామాత్యుఁడు 'ఆధివెట్టిగి' అని ప్రయోగించుట యేల యని పరిశీలింతును గదా, మనుచరిత్రమునఁ గూడ 'ఆహివెట్టిరి' అనియే యుండుట కానవచ్చెను. ప్రాచ్యలిఖితపుస్తకశాలలో మనుచరిత్ర వ్రాతప్రతులు ౧౫ ఉన్నవి. అందు ౧౧ ప్రతులలో 'ఆహివెట్టిరి' ఉన్నది. తక్కినవి కొన్ని కాగితపుఁ బ్రతులు, ఇటీవలివి. అందు 'ఆధివెట్టిరి' ఉన్నది.

ఆహివెట్టు=తాకట్టుపెట్టు అనునర్థముననే ప్రయోగాంతరము:

> అప్పుడే గోవిందునికి-నహివెట్టితిఁ జిత్తము.
>
> (తాళ్లపాకవారి యధ్యాత్మ సంకీర్తనములు, పుట.౬౫)

ప్రాకృతమున గాథా, కథా శబ్దములకు 'గాహా', 'కహా' రూపములు కలవు. 'ఆధి' శబ్దమునకు 'ఆహి' ప్రాకృతరూపము కాఁబోలును! థ, ధ లకు హకారాదేశము కొన్ని ప్రాకృతములందు గానవగును.

### తేఁడు:

“వీఁడిదె తెల్లనాకులను వీడెము సేయుచు వీథి వచ్చుచు
న్నాఁడు మదించి తిండి తినినాఁడుసుమీ యిటమీఁద నెక్కడో
తేఁడఁగఁ బోయెడిన్ గరణదేశపుజాణఁడు గాఁగనోపు నీ
వాఁడు పణోపహారపరిపాటి రయిఱుంగఁగవచ్చు వీనిచేన్.”
(క్రీడా. ౫౩ పా.)

### ఆక్షేపము:

“ఇట ‘తేఁడు = వెదకు’ అని (పీఠిక, ౧౨౧ పా.) శ్రీశాస్త్రిగా రర్థము వ్రాసినారు. కాని తేఁడుధాతువున కీ యర్థమును, తన్నిర్ణాయక ప్రయోగములును గాన్పింపవు. ఇదియేగాక యీ పద్యమునఁగూడ వీరు వ్రాసిన యర్థ మేమాత్రమును సందర్భోచితముగా లేదు. శబ్దరత్నాకరములో నీపదమునకు ‘తెండు, తెయనించు’ అనునర్థము వ్రాసి,

‘అతివ పూర్ణేందుభీతిఁ దదశ్మశాలఁ
దేఁడి యతఁ డందు నినుమడి తీండ్ర దోఁప
మింటిపై నుంట కా దని యింటిపైకిఁ
దెచ్చుకొంటి నటంచుఁ బెన్ లెచ్చ వెడలు.’ (ఆముక్త. ౫–౧౪౬)

ఉదాహరణముగా నీయఁబడినది. ఈయర్థమే క్రీడాభిరామప్రయోగమునఁగూడ నెంతయు సమంజసముగా నున్నది. ఈ బ్రాహ్మణుఁడు పూఁటకూటింట భుజించి తాంబూలము వేసికొనుచు నెక్కడకో తెయనింపఁబోవుచున్నాఁ డని యిట భావము. మఱియు,

అనలునిఁ గాఁడుచుం జముని నాడుచు రాక్షసుఁ బాడుచుం గప
ర్దినొసలు చూఁడుచుం దనుజప్రేవులు దోడుచు గాడ్పు కడ్పులో

గునుకులు గోడుచుఁ బరుణు గుండియఁ దేఁడుచు వాహనేంద్రు నం
దిని జన వేఁడుచుఁ నృపతి నేర్పులు దీడుచు నెండి వాఁడిగన్.
(కళత్. స్థ. ౫-౧౨౩)

'గుండియఁ దేఁడుచున్ = గుండియయందు శయనించుచు'—ఇత
రులను బెదరించునప్పుడు 'నీగుండెలలో నిద్రపోవుదును' అనుట వ్యవహార
మునఁ గలదు. దానినే యీ కవి యిట గ్రహించినాఁడు. మఱియు 'తేఁడు'
ధాతువు సమానార్థక మగు 'తెండు' ధాతువునకుఁగూడ 'శయనించు' అను
నర్థమే సప్రమాణముగాఁ గాన్పించుచున్నది. పైవిషయములన్నియుఁ బరి
శీలించి చూడఁగాఁ గ్రీడాభిరామప్రయోగములో శ్రీ శాస్త్రిగారు వ్రాసిన
యర్థము సమంజసముగా లేదని తోఁపకపోదు."

ఇందుకు నా సమాధానము:

'తేఁడు' కు 'వెదకు' అను నర్థముకూడఁ గల
దనుటయే నా యాశయము గాని 'శయనించు' అను నర్థము
లేదనుట గాదు. 'వెదకు' అర్థమున 'తేండుదల్, తేడుదల్,
తేడి తేడి' ఇత్యాదులు తమిళమున సర్వసామాన్యముగా
వాడుకలో నుండును. 'తెండు తేఁడులు' రూపాంతరము
లగుట అంగీకరించిన విషయమే కదా. తెలుఁగునఁగూడ
"వాఁడు తెండుకు తెండుకు అవస్థపడుచున్నాఁడు నే నన్న
మాటకు" ఇత్యాదివ్యవహారము నా జన్మదేశమగు కృష్ణా
మండలమున నున్నది. 'తెండు'కు "తిరుగఁదోడు, కలఁబెట్టు,
పెనఁగులాడు, వెదకు, తదేకవిచారముతో నుండు"
ఇత్యాదివిధముల నర్థము సంగత మయియున్నది.

ఆముక్తమాల్యదా, కకుత్స్థవిజయ ప్రయోగములు నేఁ జెప్పిన యర్థమునకుఁ గూడఁ బొసఁగునవియే—"చంద్ర కాంతశిలాశాలలోఁ దాపము గొల్పని పట్టు వెదకి" అనియు, "వరుణుని గుండెల వెదకుచుఁ (గలఁబెట్టుచు)" అనియు మీఁదిపద్యములలో నేఁ జెప్పిన యర్థము సరిపోవుచునే యున్నది. మఱియు నాముక్తమాల్యదాపద్యమున ప్రాచీన ప్రతులలోఁ గొన్నింట—

"అతివ పూర్ణేందుభీతిఁ దదశ్మశాలఁ
త్రేణి యతఁ డందు నినుమడి తీండ్రఁ దోఁప"

అని కలదు (ఓరియంటల్ లైబ్రరీ ౧౦-౨-౧ వ్రాఁతప్రతి). దీనికి శ్రీనివాసీయవ్యాఖ్యలో "యువతి పూర్ణ చంద్రునిమీఁద భయపడి చంద్రకాంతశాలలో ప్రవేశించి, ఆ చంద్రకాంతశాలయందు చంద్రుడు మిక్కిలి వేండ్రముగా కానవచ్చేటప్పటికి" అని కలదు. సి. పి. బ్రౌనుదొరగారు కూడఁ దమ నిఘంటువున నీపట్టున ప్రయోగమును 'త్రేణి' యనియే గ్రహించిరి. బ. సీతారామాచార్యులవారేలాకో, బ్రౌనుదొరగారి పాఠమును గ్రహించినవారు గారు. మఱియు, బ్రౌనుదొరగారు 'త్రేణి' కి ఆముక్తమాల్యదనుండియే ప్రయోగాంతరమును గూడఁ జూపిరి. అది యిది:

"హత్తుకొని యొక్క కొండలు
నత్తెరువుంగట్టఁ బనిచి యందఱ క్రియఁ దాఁ
దిత్తి యొకటి గొని త్రేణి మ
ఱుత్తర ముత్తరమటంచు నొకప్రొద్దుకడన్."

శ్రీ వేంకటరాయశాస్త్రిలవారీ పాఠమునే గ్రహించిరి. మఱియు వ్యాఖ్యలో నిట్లు వ్రాసిరి:

"'తేండి' దొరికిన వ్రాఁతప్రతు లన్నింటను 'త్రేణి' అని యున్నది. 'త్రేణి' అని 'తెండి'(=శయనించి)అనుటకు ఈ వ్రాఁత పుస్తకములలో తఱచుగఁ గలదు. 'తేఁపు' ధాతువు 'తెండు' ధాతువునకు రూపాంతరముగా శ. ర. లో నున్నది. కొన్ని దేశ్యశబ్దములందు తొలియక్కరమునందలి రకార వపు లు అంతరించుట ప్రసిద్ధమే. డకారము తావున ణకారము నిలుచుటయు సిద్ధమే. ఉ: అణఁగు-అడఁగు, పోణిమి-పోఁడిమి ఇత్యాదులు. కావున నిట కవి ప్రయోగించిన పదము 'త్రేణి' అని యుండునని యూహింపఁబడినది. ఆ వ్రాఁతపుస్తకములలో టీకయుఁ గలదు. అందు 'త్రేణిమఱి' 'నిద్ర మేల్కాంచి' అని యర్థమును వ్రాయఁబడినది".

'తేఁపు'కు 'వెదకు' అర్థమును నిరాక్షేపముగా నిరూపించు ప్రయోగ మిది యొకటి గలదు:

"జూదంబుఁ బన్నిదంబును
వాదునుఁ బతితోడఁ దేఁప వలవగు కడుఁ బో
రా దయ్యోకని భృత్యులు
భేదము గాకుండు గెలుపు పెనుపఁగవలయున్." (భోజరాజీయము)

ఆముక్తమాల్యదపీఠిక ౫౧-వ పుటలో శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిలవారీ ప్రయోగమునుగూడఁ జూపి యిట్లు వ్రాసిరి: "తేఁడు అనఁగా వెదకుట అని యరవమునఁ బ్రసిద్ధము. ఆ యర్థమున శ. ర. లేదు."

'తేఁడు'కు 'వెదకు' అర్థము స్పష్టమగుచుండఁగాఁ, దదనుసారిగా క్రీడాభిరామపద్యమునకు నేఁ జెప్పిన యర్థము "ఏమాత్రము సందర్భోచితముగా లేదు". "సమంజసముగా లేదు" అఁట! ఏలో?

ఆ బ్రాహ్మణుఁ డోరుఁగంటికి వేడుకలమీఁద వేడుకలు దిలకించుటకు, విహరించుటకు వచ్చినాఁడు గాని యారగించి నిద్రించుటకుఁ గాదు. దిట్టముగా తిండి దిని తాంబూలచర్వణము సేయుచు వేడుకపట్టులు వెదకఁబోవుచున్నాఁ డను నర్థ మేల సమంజసముగాదు?

బెడంగు:

బసవపురాణమున—

"కూర బెడంగనో కుంచెఁడు లేవో,
ఆరగింపఁగఁ బెట్ట నేరకుండితినో"

అని గొడగూచికథలో ద్విపద గలదు. ఇందు 'బెడంగనో' కు అర్థము కుదురక తంటాలు పడితిని. శ. ర. బెడఁగు = అందగించు ఇత్యాద్యర్థములు పొసఁగవు. వెడఁగు = వికారము అర్థముగల దగుటచే, పాలగిన్నె పాలు త్రాగుట కనువుగా లేక, మూతి వెడలై్ప వికారముగా నున్నదని త్రాగవైతివా అని యర్థము కుదురుట గుర్తించి, 'అని + ఓ (అనియో)' ఉండక, 'అనో' ఉండుట అతృప్తి గొల్పఁగా, సందేహచిహ్నముతో నా యర్థము పీఠికలోఁ దెల్పితిని. ఆ నడుమ శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగా

సొకనాఁడు సంభాషణలో భీమకవి కన్నడగ్రంథమున 'గిన్నె తోమనైతినా' అని పరివర్తన ముండుటను దెలిపిరి; తెలుఁగున బెడఁగు = శుభ్రపఱచు అనుటకు ప్రయోగాంతరము లున్నఁగదా యా యర్థము చెప్పఁగుదురుట అనిరి. శబ్దరూపనిష్పత్తిరీతిని పూర్వాపూర్వము గుర్తించిన, వెలుఁగు, బెడఁగు పదము లొక్కదాననుండి యేర్పడినవే యగు ననుకొంటిమి. కాని భాషలో ప్రయోగము లుండ వలదా? కొన్నాళ్లకు భారతిలో ప్రకటితమయిన త్రాళ్లి ప్రొద్దుటూరిశాసనమున "తెలుపెక్కఁ గఅవోవ బెళగిన పునుక మించిన వెండికోరగాఁ జేతఁ బట్టి" అని ప్రయోగము గానవచ్చినది. ఇందు 'బెళగిన' అనుచో 'ళ,గ'ల నడుమ సున్న లేదు. బెళగు, బెడగు రూపభేదములే. సోమనాథుఁడీ ధాతువును సానుస్వారముగాఁ బ్రయోగించెను. శాసనము ననుసరించి, 'కోంను బెడగనో' అని సోమనాథుని పాఠము సంస్కరించుటా? అర్థము కుదిరినదిగాని అది సానుస్వార పదమా, నిరనుస్వారపదమా? సందేహమే.

దోహరి:

క్రీడాభిరామమున "... దాత్యూహవ్యూహంబులుం గలిగిన మోహరివాడయందు..." —"కొలుచును జేనవెట్టి" ఇత్యాదిపద్యము కుట్రపువాని వర్ణనముతో నున్నది. దానిఁ బ్రకటించునాఁడు మోహరివాడ యనఁగా నా కర్థము తెలియదయ్యెను. "యుద్ధభటు లుండు వాడ యనుకొందును"

అని పీఠికలో వ్రాసితిని. మోహారము = యుద్ధవ్యూహము అని అర్థముండుటనుబట్టి య ట్లనుమానించితిని. ఇటీవలఁ దెలియవచ్చిన క్రొత్త యర్థము :

కాశీఖండము సప్తమాశ్వాసమున-

"ప్రార్థింప నున్నాఁడు పాదాగ్రముల వ్రాలి
వెలివాడవాఁడు తద్విప్రకులుని"

ఇత్యాదిపద్యమున,

"దీవింప నున్నాఁడు తెలిసి దోహరిబంటుఁ
జెవి నత్తుమాలికఁ జెరివి ద్విజుఁడు"

అన్నచోట 'దోహరిబంటు' ఉన్నాఁడు. ఈతఁ డిక్కడ మఱియు చండాలుఁడు, మాల, వెలివాడవాఁడు అనియుఁ జెప్పఁబడినాఁడు.

మఱియు నాముక్తమాల్యదలో, "అనినఁ గహకహ నవ్వి యద్దోహారికి సురద్రోహి యిట్లనియె" (౬-౭౧వ చనము) అని కలదు. ఇక్కడ 'దోహరి' యనఁగా మాల(దాసరి), చండాలుఁడు - వెలివాడవాఁడే. అచ్చుపుస్తకములలో "అ ద్దాసరికి సురద్రోహి యిట్లనియె" నని కలదు కాని, ఓరియంటల్ లైబ్రరీలోని వ్రాఁతప్రతులలో ఒక్కదానఁ దక్కఁ దక్కిన యన్నింటను 'దోహరి' అనియే కలదు. బ్రౌనుదొరగారును, సీతారామాచార్యులవారును 'దాహరి' యని గ్రహించి నేఁ జూపిన యాముక్తమాల్యదాప్రయో

గమునే యుదాహరించిరి. 'దాహరి- దాసరి' రూపభేదము లని వారి తలఁపు. కాని యా పదము 'దోహారి' యే. ఆముక్తమున 'దోహారికి సుర-ద్రోహి' యని 'దో- ద్రో' యతిసంగతి యుండుట, వ్రాఁతప్రతు లన్నింట దోహారి యనియే కానవచ్చుట, కాశీఖండమునను 'దోహారి బంటు' ఉండుట— అది 'దోహారి'యే యనుటకు సాధకములు. మఱియు, బసవపురాణమునను, పండితారాధ్యచరిత్రమునను 'దోహారి కక్కయ్య' యను శివభక్తుని చరిత్ర మున్నది.

శివభక్తులయిన మాలలతో ద్విజులు సరిగా రని చెప్పు కథాసందర్భములలో—

"ముక్కంటిగణము దాఁ గక్కయ్య నాఁగ—
నీ ద్విజులకు సైరి...

( విష్ణుమాహాత్మ్యము పఠించు పురాణభట్టును ముక్కలుగా నఱికి చంపెను. )

దోహారి కక్కయ్య మాహాత్మ్య మెఱిఁగి
యూహింప భక్తుల నొం డనఁ దగునె" (బసవపురా. ౭ ఆశ్వా.)

అని కలదు. పండితారాధ్యచరిత్రమున—

"కలసె నంత్యజుఁ డనఁగా నెట్లు వచ్చు-
నిక్క మట్లునుగాక కక్కయ్యగణము, (బసవపురాణకథయే)
అటు గాన దోహారు లన నెటు వచ్చు,
పటుతరంబగు భక్తిపరుల వెండియును" (ప్రథమప్రకరణము)

అని కలదు. ఇన్నింటినిబట్టి 'దోహరి' మాల యని యెఱుఁగనగును.

మఱి యీయన్నింటికంటె వ్యక్తమగునట్లు ఓరియంటల్ లైబ్రరీ ౧౮-౮-౩౮ నెంబరు పుస్తకమున—

"కళ్యాణమందు దోహర కక్కయ్య అనే భక్తుడు తోళ్ల తిత్తులు కూర్చేవాడు, దోహరుల కులంయందు జనియించి తన పూర్వాశ్రమం ఖండించి వీరశైవదీక్ష..." ఇత్యాదిగాఁ గలదు.

దీనిఁబట్టి దోహరిపదము 'గొడారి'కి పర్యాయపదమని స్పష్టపడినది. గొడారులు తోళ్లతో చెప్పులు, తిత్తులు కుట్టుచుందురు. వారు మాలవారిలో నొక తెగవారు. 'మాలకు మాంసంబు, మఱి గొడారికిని దోలును' నన్నట్టు— బసవపురాణము. ఈ ద్విపద శ. ర. లో భాగవతమున నున్నట్టున్నది సరిగాదు. క్రీడాభిరామమునఁగూడ 'మోహరివాడ'ను 'దోహరివాడఁ'జేయవలెనేమో! 'దోహరులు' చెప్పులు మొదలగు తోళ్లకుట్టమేకాక వెలివాడవారికి 'రవికలు' మొదలగు బట్టల కుట్టముకూడఁ జేయువారు గాఁబోలును! ఇట్టి యాచారము తెలుఁగునాఁటఁ గొన్నియేండ్ల క్రిందటి దాఁక సాగుచున్నట్టు వినికి.

౧౨

# తెలుఁగున ప్రథమావిభక్తి 'ండు' ఎట్లు పుట్టినది?

---

తెలుఁగుభాషలో నేఁడు ప్రాయికముగా మహద్వాచకము లయిన శబ్దముల తుద ప్రథమావిభక్తిప్రత్యయముగా 'ండు' గలదు. ఇది దీర్ఘపూర్వ మగునేని యరసున్నగా మాఱును. హ్రస్వపూర్వ మగునేని యరసున్నగాఁగూడ మాఱును. మఱియుఁ బ్రాయికముగా ప్రాతిపదిక మది తత్సమమో, తద్భవమో యగునేని 'ండు'కుఁ బూర్వమున్న హ్రస్వాకారమునకు ఉకారముగూడ వచ్చును. వాఁడు, మగండు, మగఁడు, రాముండు, రాముఁడు అనునవి యుదాహరణములు. కాని యీ రూపము లర్వాచీనకాలము నాఁటివి. ప్రాచీనకాలమున నివి 'వాణ్డు, మగణ్డు, రాముణ్డు' అను విధమున నుండెడివి. లిపి యిట్లే యున్నను ద్విత్వశైథిల్యముచే నివి తేలఁబలుకఁబడుచుఁగూడ నుండెడివి.

ఇఁక వీనిలో 'ణ్డు' ఎట్లు వచ్చినదో కనుఁగొనఁ బ్రయత్నింతును. ప్రాయికముగా తెలుఁగుపదములు పెక్కులు ప్రథమావిభక్తిబహువచనరూపములను ముందు పడసి వాని ననుసరించి తర్వాత నేకవచన రూపములఁ బడయుట

కానగును. ఈఁగలు, చిలుకలు, అడుగులు, చెఱువులు ఇత్యాది బహువచనరూపములు ముందు పుట్టిన పిదప వీని ననుసరించి ఈఁగ, చిలుక, అడుగు, చెఱువు ఇత్యాద్యేక వచనరూపములు తర్వాత పుట్టినవి.

ద్రావిడభాషా కుటుంబమున ప్రథమనిష్పన్నమైన యఱవమున అవన్, మగన్, రామన్ అనునవి ప్రథమా విభక్త్యంతపదములు, అఱవముతర్వాత పుట్టిన తెనుఁగున కీపూర్వభాషలోని ప్రథమావిభక్త్యంతపదములే ప్రాతిపది కము లయినవి. ఇట్లగుటసంగతమే. ఇట్లు అవన్, మగన్, రామన్ అనియున్న ప్రాతిపదికములకు బహువచనప్రత్యయ మగు 'ఱు' (ఇది బండి ఱ గా ప్రాచీన శాసనలిపి గలదు) పరము కాఁగా అవన్ఱు, మగన్ఱు, రామన్ఱు అను రూపము లేర్పడవలసి యుండెను. కాని యేకపదమున 'న' కార 'ఱ' కారములకు సంయుక్తత అఱవముననే కాని తెలుఁగున నెక్కడను లేదు. తెలుఁగుభాషాస్వభావమున కట్టి యుచ్చారము విరుద్ధము. అట్లగుటచేఁ దెలుఁగున నకార ఱకారములు సంయుక్తములుగా నేర్పడవలసినచోట్ల నకార ఱకారములకు నడుమ, బహుప్రాచీనకాలమునఁ దెలుఁగున లిపియు నుచ్చారమును గలిగినట్టియు, క్రమముగా నా లిపియు నుచ్చారమును 'డ'గా మాఱిపోయినట్టియు నొక వింత హల్లు ఆగమమై వచ్చుచుండెను. అదియే నేను అహదనకరశాస నము, సత్యాదిత్యచోడమహారాజుశాసనము మొదలగు వానిలోఁ గుర్తించిన వింత లిపి గల హల్లు. అది

బండి ఱ కాదు. ధ కాదు. ఆ వింత లిపియొక్క ప్రాచీన కాలోచ్చారము కొంత టవర్గాక్షరముల యుచ్చారమునకుఁ జేరికగలదై యుండవచ్చును. అది పెక్కుచోట్ల 'డ' గా మాఱినది. కొన్ని చోట్ల 'ట'గాఁగూడ మాఱియుండునట్లు నే ననుమానించుచున్నాను.

ఇప్పుడు 'న'కారము, 'వింతహల్లు', 'ఉ' స్వరయుక్తమైన యక్షరముతో శబ్దరూపము లేర్పడఁగా, బహువచన ప్రత్యయమగు 'ఉ' లోపింపఁగా హలంతము లయిన పదముల చివర 'ఉ' చేరఁగా, నేకవచనమున అవన్ఱు, మగన్ఱు, రామన్ఱు (న క్రింద నున్నదే వింతలిపి గల వింతహల్లు.) ఇత్యాదిరూపములు కలిగెను. ఈ హల్‌రూపములే సత్యాదిత్యచోళమహారాజాదుల శాసనములందు లెక్కలేనన్ని యున్నవి. క్రమముగా నీ వింతహల్లు 'డ'గా మాఱఁగా, 'డ'కుఁ బూర్వమున నున్న 'న' 'ణ'గా మాఱఁగా, 'అవణ్డ్రు, మగణ్డ్రు, రామణ్డ్రు' ఇత్యాదులు బహువచనరూపములును, 'అవణ్డు, మగణ్డు, రామణ్డు' ఇత్యాద్యేకవచనరూపములును నేర్పడినవి. ఉరల్ పోలుగా మాఱినట్లు 'అవణ్డు' 'వాణ్డు'గా మాఱినది. తర్వాత వాణ్డు వాఁడుగాను, మగణ్డు మగఁడుగాను అర్వాచీనభాషలో మాఱినవి. ఇట్లే నేటి ప్రథమావిభక్తి 'ండు' ప్రత్యయములకెల్ల సమన్వయము గుదురును.

తెలుఁగుబాసలో నకార అకారములకు సంయుక్తత ప్రసక్తించునపుడు నడుమ వింత హల్లాదేశము వచ్చుననుటకు 'పణ్డ్రెణ్డు, ఎనుబణ్డ్రు' ఇత్యాదిపదములఁ గూడ నుదాహరణముగాఁ జూచుకొనవచ్చును. తెలుఁగున పది పఁ అయి, ఇరండు రెండు అయి సంధి యేర్పడినది. అఱవమునఁగూడ పత్తు పఁ అయి ఇరండుతో సంధిపఁగా పన్నిరండు అని రూప మేర్పడినది. తెలుఁగున పఁ + రెండులో నడుమ వింత హల్లు వచ్చి, అది డగా మాఱి,'న''ణ'అయి 'పణ్డ్రెణ్డు' అను రూప మేర్పడినది. కాని 'పణ్డ్రెన్డు' అను రూపము తెలుఁగున నెన్నఁడు నున్నట్టు కానరాదు. వాణ్డ్రు(ణ్ డ్ లు), పణ్డ్రెణ్డు (ణ్ డ్ తె) అను పదములలోని రెండవ సంయుక్తాక్షరములలో రెండవ యక్షరము డకారము, డకారపుఁ బూర్వరూప మగు వింతహల్లు కాఁదగునే కాని బండిఱ ఎన్నఁటికిని గానేరదు. ఏలనఁగా మూఁడుహల్లుల సంయోగములో రెండు బండిఱలుండవు. అట్టి యుచ్చారణ ముండదు.

సరికాని, యింతవఱకును జెప్పిన ప్రక్రియ చొప్పున రామణ్డు-రామఁడు, కొణ్డణ్డు-కొండఁడు ఇత్యాది రూపములు సిద్ధించును గాని రాముణ్డు - రాముఁడు, పుత్తుణ్డ్రు-పుత్రుఁడు, చందురుణ్డు ఇత్యాదివిధముల రామ, పుత్త్రి, చందురేత్యాది ప్రాతిపదికముల తుదియకారమునకు ఉకారాదేశము కలదుగదా, ఇది యెట్లు సమర్థిత మగును? అను ప్రశ్న మున్నది. దీని కిట్లు బదులు :

సంస్కృతభాషలో అకారము రెండు దెఱఁగులు గలది. 'అ అ' అను సూత్రమున పాణిన్యాచార్యులు సంవృతము, వివృతము అని అకారము రెండు విధము లనియు, ప్రక్రియాదశలోని అకారము వివృతమనియు, ప్రయోగదశలోని అకారము సంవృత మనియుఁ జెప్పిరి. తెఱపినోటితో నుచ్చరించిన అకారము వివృతము. ఆంధ్రద్రవిడకర్ణాట దేశములందు అకారము ప్రయోగదశలోఁగూడ నిట్లు తెఱపి నోటితో వివృతముగానే ఉచ్చరింపఁబడుచున్నది. ఈ యుచ్చార మపాణినీయము. ఆంధ్ర ద్రవిడ కర్ణాటభాషల సంప్రదాయము సంస్కృతప్రాకృతభాషల సంప్రదాయ మునకంటె వేరయిన దనుట కిదియు నొక సాధనము. ఓఢ్రదేశము మొదలగు నుత్తర దేశములందు హ్రస్వాకారము సంవృతముగానే ఉచ్చరింపఁబడును. వారు నోరిని గొంత ముడిచియే అకారోచ్చారము జరుపుదురు. ఆ సంవృతోచ్చారము మనకు ఉకారమునకు, ఒకారమునకు నడిమిదిగా వినవచ్చుచుండును.

సంస్కృతప్రాకృతసమములు, తద్భవములు నగు పదముల తుది హ్రస్వాకారము ఇక్ష్వాకులు మొదలగు నౌత్తరాహరాజుల శాస్త్రీయసంవృతోచ్చారణరీతి ననుకరించుటలోఁ దెలుఁగున కా రీతి యపరిచిత మగుటచే ఉత్వముగా మార్పు చెందినది. ఈకారణముచేతనే విభక్తి 'ండు'కు పూర్వమున నున్న అకారమునకు ఉకారాదేశము

వచ్చుట ప్రాయికముగా సంస్కృతప్రాకృతసమభవ శబ్దములకే కానవచ్చుచున్నది. దేశి తెలుఁగుశబ్దముల కట్టు లేదు. కొండఁడు, తిక్కఁడు, మారఁడు, రేచఁడు ఇత్యాది శబ్దముల కుత్వము రాలేదు గదా? ఇది ద్రావిడభాషా కుటుంబసంప్రదాయోచ్చారము గల శబ్దము లగుటచే వీనికి సంవృతోచ్చారము లేదయ్యెను. ఉకారాదేశము రాదయ్యెను.

---

# ౧౩
# ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము

చదలువాడ యెఱ్ఱాప్రగ్గడ భారతారణ్యపర్వశేష మును, రామాయణమును, నృసింహపురాణమును, హరి వంశమును రచియించెను. హరివంశమున నిట్లున్నది :

శా. నాతమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁజేసి యొలమిన్ జేపట్టి మా కిచ్చుటన్
జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం జెందితి నింకనుం దనియ నేఁ గావ్యామృతాస్వాదనన్.

దీనిఁబట్టి రామాయణము హరివంశమునకుఁ బూర్వ కృతి యనియు, నది ప్రోలయ వేమారెడ్డిగారి ప్రేరణముననే రచితమయ్యె ననియుఁ దెలియనగును.

"వల్మీకభవు వచోవైఖరి రామాయణంబు సాంధ్రప్రబంధంబుఁజేసె"

నని యెఱ్ఱాప్రెగ్గడ వంశమువాఁడిటీవలివాఁడు చదలు వాఁడ మల్లయకవి చెప్పినాఁడు. దీనిఁబట్టి యీ రామా యణము సంగ్రహరూపమయినదిగాక సకల వర్ణనాపూర్ణ మయిన, సంస్కృతరామాయణానుసారియయిన ప్రశస్త ప్రబంధముగాఁ దెలియనగును.

ఇట్టి యెఱ్ఱాప్రెగ్గడరామాయణ మిప్పుడు గాన రాదు. లక్షణ గ్రంథములలో నెఱ్ఱాప్రెగ్గడరామాయణ పద్యములు పెక్కు లుదాహృతము లయియున్నవి.

## ౨

కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహమున ఎఱ్ఱాప్రెగ్గడరామాయణములోనివని యీ క్రింది పద్యముల నుదాహరించినాఁడు:

ఉ. అంగముతోడఁ గట్టు మిట యజ్ఞవిఘాతకచోరు లెందు వో
వంగలవాఁడ వింక నిటు వైళమ తాపసవేషధారివై.

ఉ. పందడి యధ్వరక్రియ కసంగతమేని బలంబుతోడఁ బెన్
గ్రం దదియేల యేన తగఁ గార్ముకహస్తుఁడనై కడంగి మీ
ముందఱ నిల్చెదన్ గ్రతువు ముట్టకయుండఁ బ్రచండదైత్యరా
జిం దగ దవ్వుదోల వెసఁ జించెదఁ బెంచెద మీకు మోదమున్.

చ. అనుటయు మంత్రిమాటకుఁ బ్రియంపడి యాతని నాదరించి య
మ్మనుజ కులేంద్రుఁడు...

ఉ. నూర్వురు నొక్కచందము మనోగతి సైరణచేసి నన్ను నా
పర్వకులంబు నుత్తమయశంబున నుంచితి రమ్మలార, మీ
కుర్విని సాటి యే యబల లొండొరు దేవతలున్ బటుత్వమా
నిర్వహణం బొనర్చుటకు నేరరు మర్త్యులఁ జెప్ప నేటికిన్ ?

చ. అనఘ యకంపమై విమలమై పరిపూర్తియు లోఁతుఁ దియ్యమున్
ఘనతయుఁ గల్గి సజ్జనమనస్సదృశస్థితిఁ జాల నొప్పు మీ
వినయది యన్నదీజలము జీవును మంచిది...

ఉ. కోలలు నుగ్గునుగ్గయిన క్రూరఫణీంద్రు గతిన్ దరంగముల్
మాలిన భూరివారిధిక్రమంబున రాహుకరాళవక్త్రిమున్
దూలిన తీవ్రభానుక్రియ దుర్బల సైన్యతఁ బుత్రహీనతన్
గీలి పరాభవాభిగతిఁ గీడ్పడి భూపతి సెమ్మనంబునన్.

శా. తాఱం గ్రాఁగిన నేల తంపఱఁ బాతాళంబు దాఁకన్ జనం
దూఱం జల్లిరి మిన్ను దాఁకి తరఁగల్ తోరంబులై నల్గడల్
పాఱం జెల్లుగ నేఱు లుబ్బఱముగాఁ బైపైన నీరెక్కి దై
వాఱన్ జెర్వులు చెన్నుమీఱె నఖిలప్రాణుల్ ముదంబందఁగాన్.

క. నూఱు దెఱంగుల నెఱసులు
మీఱఁగ నీవిభ్రమములు మెఱయించి మునిం
గాఱఁగఁ జేయుము మేనక
చూఱకొనదె యతని తెలివిసొమ్ములు మున్నన్.

మ. చెఱకుందోఁటలఁ బెంచి శాలిమయసుక్షేత్రస్థలుల్ నించి య
క్కఱలేకుండఁగఁ బూగనాగలతికా కాంతారముల్ ప్రోచి యే
డ్తెఱ నంతం గుముదోత్పలాళివనవాటీకోటిఁ బాటించి పె
న్జెఱువుల్ వొల్చెఁ బురంబునద్దెసలఁ బ్రస్ఫీతాంబుపూర్ణస్థితిన్.

కూచిమంచి తిమ్మకవి గోదావరిమండలమున పిఠాపురమునకు చేరువను కందరాడ, చంద్రమపాలెము అను గ్రామముల వసించెను. ఈ గ్రంథమును క్రీ. శ. ౧౭౪౦ సంవత్సర ప్రాంతమున రచించెను. ఆతఁ డుదాహరించిన యెఱ్ఱాప్రెగ్గడ రామాయణ పద్యములు ఇతరలక్షణ గ్రంథములనుండి సేకరింపఁబడినవి కావు. ఆతఁడు స్వయము గ్రంథమును బరికించి యుద్ధరించినవే. ఇన్ని పద్యముల నితరలాక్షణికు లెవరు నుదాహరింపలేదు. ఇప్పటికి సుమారు ౧౫౦ ఏండ్లనాఁడు గోదావరిమండలమున, కూచిమంచి తిమ్మకవియింట ఎఱ్ఱాప్రెగ్గన రామాయణము సురక్షితమై యుండెనని దీనివలనఁ దెలియఁగలదు.

చదలువాడ యెఱ్ఱాప్రెగ్గడ రచనముగా నీ కవిస్తుతి పద్య మొక ప్రాచీనపద్యసంకలనమునఁ గానవచ్చినది.

శా. సారోదార సమంచిత స్ఫురదురుస్ఫాయల్లసల్లాలిత
(స్ఫారంబుల్ వ?)గఁ ద్రిప్పిచెట్టుమను శబ్దద్రవ్యహీనుల్ సదా
తారుం జెప్పితి మంచుఁ జెప్పికొనుటల్ తప్పే నిరాఘాటవా
క్సారభ్యప్రతిభా విజృంభితులు మెచ్చన్ గాక యాచందముల్.

ఇది యెఱ్ఱాప్రెగ్గడ రామాయణ కృత్యవతరణిక లోనిది గావలెను.

ఈ క్రిందిపద్యము 'ఎఱ్ఱన రామాయణము లోనిదా?' అని యెప్పుడో నోటుబుక్కులో వ్రాసికొంటిని. ఎక్కడనుండి యుద్ధరించితినో యిప్పుడు గుర్తింపఁజాలను.

ఉ. చువ్వన మేను వంచి రవి సోఁకఁగఁ దోఁక విదల్చి పాదముల్
నివ్వఁగఁ బట్టి బాహువులు వీచి మొగంబు బిగించి కొండ జౌ
జవ్వన నూఁగి ముందటికిఁ జాఁగి పిఱిందికిఁ దూఁగి వార్ధిపై
ఱివ్వన దాఁటె వాయుజుఁడు ఱెక్కలతోడి సురాద్రియో యనన్.

కూచిమంచి తిమ్మకవిగాక మఱికొందఱు లాక్షణికులును ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణములోని పద్యములను తమ లక్షణగ్రంథములం దుదాహరించినారు. అట్టివి మఱి కొన్ని యీక్రిందివి:

గణపవరపు వేంకటకవి ప్రయోగరత్నాకరము—

క. ధాత్రీ సురసేవారతి-భ్రాతృ భృతి సుహృత్కృపాలబంధురమతి దు
శ్శాత్రవహరణచణస్థితి మిత్రానందకర విహృతి మీయందమరున్.

సీ. బాలసుధాంశునిటాలుని నవసుధాలాపముల్ వినవలె ననెడు నాస...

క. ఆదశరథ సూనుండు పయోధిజలం బింకఁజేసి యొకశరమునఁ బ్ర
వ్యాదవిభుఁ దునిమి సీతను మోదంబునఁ జేకొనె నికపిపుంగవుతోడన్.

(ఎఱ్ఱాప్రెగ్గడ సంక్షేపరామాయణము)

గణపవరపు వేంకటకవి ఎఱ్ఱాప్రెగ్గడ సంక్షేప రామాయణము లోనివిగా నుదాహరించిన పద్యములు ప్రశస్తరచనము కలవి కావు. అతఁడు ప్రబంధరత్నాకర మున కొన్ని లక్షణములను గల్పించి వానికి లక్ష్యపద్యము లను ప్రసిద్ధకవుల గ్రంథములలోనివిగాఁ గొన్నింటిఁ గల్పించి యుదాహరించినట్లున్నాఁడు. ఈతఁ డుదాహరించిన ఎఱ్ఱా ప్రెగ్గడ రామాయణపద్యములు కల్పితము లైనను గావ చ్చును; లేక, ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణములో గ్రంథా రంభభాగమగు సంక్షేపరామాయణములోని వయినను కావచ్చును. అంతేకాని ఎఱ్ఱాప్రెగ్గడ సంక్షేపరామాయణ మని వేఱొక గ్రంథమును రచియించియుండఁ డనుకొనం దను. ఎఱ్ఱాప్రెగ్గడ తనతండ్రి సంస్కృతాంధ్రకవితా విశారదుఁడు సూర్యసుకవి యని తనగ్రంథములఁ జెప్పి కొన్నాఁడు సూర్యకవికృతము సంస్కృతమున సంక్షేప రామాయణ మొకటి యముద్రితము కలదు. ఆ సూర్య సుకవి మన యెఱ్ఱాప్రెగ్గడ తండ్రియగునేమో! ఆ సంస్కృత సంక్షేపరామాయణమునకు, ఎఱ్ఱాప్రెగ్గడరామాయణము నకు సంబంధ మేమైనఁ గలదేమో-ఎఱ్ఱాప్రెగ్గడ రామాయ ణము దొరకినప్పుడు తెలియవలెను.

## 3

ఇప్పుడు సుముద్రితమై వెలసియున్న భాస్కర రామాయణమునఁగూడ ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణపద్యము లనేకములు చేరియున్నట్లు తెలియవచ్చుచున్నది. పెక్కేండ్లకు పూర్వము ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున తెలుఁగు గ్రంథములకు డిస్క్రిప్టివ్ క్యాటలాగు (Descriptive Catalogue) వ్రాయునపుడు భాస్కరరామాయణమును సామాన్యదృష్టిని పరిశీలింపఁగా పాఠభేదములు, గ్రంథభేదములు చాలఁగాఁ గానవచ్చినవి. ఆ విషయ మప్పుడందు వెల్లడించితిని. ఆనందముద్రణాలయమువారి భాస్కరరామాయణముద్రణమునకు వారియొద్ద పండితులుగా నుండిన కీ. శే. తంజనగరం తేవప్పెరుమాళ్లయ్యగారు ఆరణ్యకాండమున రెండు భిన్నరచనము లుండుటను గూర్చి కొంత నాతోఁ జర్చించిరి. భాస్కరరామాయణమునందలి యారణ్యకాండమున ప్రధానపాఠముగా గ్రహింపఁబడిన పద్యము లనేకములు ఏ తాళపత్రప్రతిలోను గానరాకుండెను. పాఠాంతరములుగా పుటలయడుగున చిన్న టైపుతో ముద్రింపఁబడిన పాఠములే తాళపత్రప్రతులలో నున్నవి. తొలుఁదొలుత భాస్కరరామాయణమును ముద్రించినవారు కరాలపాటి రంగయ్యగారో, నిశ్చింత తేవప్పెరుమాళ్లయ్యగారో యని మే మప్పుడు గుర్తించితిమి. వా రే ప్రతులను చూచి అట్లు ముద్రించిరో యెఱుఁగ

రాదు. కరాలపాటి రంగయ్యగారు గొప్పకవి. ఆయన కొన్ని ప్రౌఢగ్రంథములను రచించెను. ఆరణ్యకాండమున ప్రధానపాఠముగా గ్రహించిన పద్యముల నాతఁడు రచించి చేర్చెనేమోయని కూడ మే మప్పు డనుకొంటిమి—తాళపత్రప్రతులలో నా పద్యములు కానరాలేదు గాన.

ఇటీవల భాస్కర రామాయణమును పరిశీలించుచుండఁగా వావిళ్లవారి ముద్రణమున యుద్ధకాండములోని యీ క్రిందిపద్యము 'ఎఱ్ఱాప్రెగడవారి పద్యమని ప్రతీతి' అను అధోజ్ఞాపికతో కానవచ్చెను.

ఉ. త్రెవ్వెడు గంటులం గురువు దేఱెడు నెత్తురు రాకమున్న యే
నొవ్వియు నేవికారము మనోగతిఁ జెందకమున్న సాయకం
బవ్వలఁ బోకమున్న మకుటాగ్రవిఘట్టనరావ మొప్పఁగా
నువ్వున నుప్పతిల్లె నసురోద్వహ మూర్ధచయంబు గ్రక్కునన్.

అది చూచి వ్రాఁతప్రతులను పరిశీలింతును గదా ఉదాహృతమైన యీ పద్యము ఎఱ్ఱాప్రెగడవారిదని యుండుట మాత్రమే కాక దీని పూర్వపద్యము—

ఉ. ఉన్నవి యున్నయట్ల తల లుర్వికి డిగ్గ శిరఃప్రవాహముల్
మున్నొకసారె నిండుదెగ మోపినసాయక మట్లె యుండఁజాఁ
గ న్నెతిఁదూపువెల్లియని ఖేచరకోటి నుతించె నంచితో
త్పన్నదశాస్యరాఘవతపఃకరలాఘవచిత్రసంపదల్.

అను పద్యము 'భాస్కరుని వారి' దని కూడఁ గండు. ఈ పద్యములు పెక్కుప్రతులలోఁ గానరావు. కొన్నిప్రతుల

లోనే కలవు. ఇవి రాముఁడు రావణుని తలలు తెగఁగొట్టు ప్రకరణమునందలివి. యుద్ధకాండములోని యీ భాగము పెదవేదగిరి నాయనింగారి ప్రేరణమున అయ్యలార్యుఁడు పూరించినది. ఈ భాగమునకు భాస్కరరచనము నేఁడు కానరాదు. భాస్కరుఁడు కడముట్ట నారణ్యకాండము రచించినట్టు ప్రతీతియు లేదు. ఇందు భాస్కరరచనముగ పద్యముండుటను బట్టి చూడఁగా భాస్కరుఁడు యుద్ధకాండమును కడముట్ట రచించెనని యేర్పడుచున్నది ఇవే కాక, యుద్ధకాండమున మఱికొన్ని పద్యములు కొన్ని ప్రతులలో మాత్రమే యధికముగాఁ గానవచ్చుచున్నవి. దొరకిన యుద్ధకాండప్రతులనెల్ల పరిశీలించినయెడల నట్టివి మఱికొన్ని పద్యములు గూడ భాస్కరునివిగనో, ఎఱ్ఱాప్రెగ్గడవిగనో వేర్పఱుపఁగల వనుకొందును. యుద్ధకాండ విషయ మిట్లుండె.

ఆరణ్యకాండమున ముద్రణములందు ప్రధాన పాఠముగ గ్రహింపఁబడిన గ్రంథభాగములు తాళపత్రప్రతులలో సాధారణముగా దొరకుచున్నవియు, పాఠాంతరముగా నధఃకరింపఁబడినవియు నగు గ్రంథభాగములకంటెఁ బ్రశస్తరచనము కలవి. ఒకవేళ నవియెల్ల ఎఱ్ఱాప్రెగ్గడ రచనమేమో యని యొక సందేహము నాకుఁ గలిగెను. ఆ గ్రంథభాగములలో వాల్మీకిరామాయణానుసారులు కానివి కొన్ని రచనములు కలవు.

చ. తపనుఁడు వేపఁజొచ్చె ననుఁ దమ్ముఁడ, వృక్షముక్రిందఁ బెట్టు; నాఁ
దపనుఁడు రేయి లేఁడు వసుధావర, చంద్రుఁడుగాని; చంద్రునిన్
నృపసుత, యెట్లెఱింగితివి నీవు; మృగాంకము చూడ నున్కి; హా
చపలమృగాక్షి, చంద్రముఖి, జానకి, యెక్కడ నున్నదానవే!

"సౌమిత్రే, నను సేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే
చండాంశోర్నిశి కా కథా రఘుపతే, చంద్రోఽయ మున్మీలతి,
వత్సైతద్విదితం కథన్ను భవతా ధత్తే కురంగం యతః
క్వాసి ప్రేయసి, హా కురంగనయనే, చంద్రాననే, జానకి"

(ప్రసన్నరాఘవము)

ఇత్యాదులు.

ఇట్టి యీ ప్రధానపాఠరచనముకూడ ప్రాచీనకవి కృతమే కావలెను. కాని, యిది భాస్కరరామాయణ మనుపేర లభ్యమగుచున్న గ్రంథములోనిది కాదు—భాస్కరరామాయణ తాళపత్రప్రతులలోఁ గానరాదు కాన. ఇట్టి సందేహములతో నేను చీకాకుపడుచుండఁగా డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు తమ కానెగొందిలో నొక భాస్కరరామాయణపుఁ దాళపత్రప్రతి దొరకె ననియు, అందారణ్యకాండమున ఎఱ్ఱాప్రెగ్గడకృతము లుగా కొన్ని పద్యములు గానవచ్చె ననియు తెలిపి ఈ క్రిందిపద్యములను నాకుఁ జూపిరి:

ఉ. ఆ నెఱజోదు కేలు దొనఁ కై నిగుడించుట యమ్ము మార్వి సం
ధానము సేత నింపఁ దెగఁ దార్కొని లక్ష్యమునీయు జేయుడున్
గాన నజస్రమంచలితకార్ముక మొక్కటి గంటిఁ గంటి న
ద్దానవదీర్ఘదేహసముదాయనిరంతరపాతవేగముల్.

స్రగ్ధర. కరిణీయానంబు నవ్వ్రాక్ గతి నవలతికాకార మంగంబు చంద్రుర్
బుగుణింపఁగ ముగ్ధమౌ మంబురుహదళములంబోలుఁ గన్నుల్ విపంచీ
స్వరసంకాశంబు పల్కుల్ జలదళినిచయస్పర్ధియై యుండు వేః
భర మాతన్వంగి కింద్రప్రముఖ నిఖిలదిక్పాలకాభీలశౌర్యా.

చ. అలినిభ వేణి చంద్రసదృశానన యుత్పలపత్రనేత్ర కో
మలలతికాభిరామభుజ మంజులవృత్తలస త్కుచద్వయీ
కలిత సుమధ్య హృద్యకటి కామ్యతరోరువు గమ్యజంఘ యు
జ్జ్వలచరణాబ్జ తద్వనిత జానకినా విలసిల్లు రావణా.

వారిందుకై మదరాసులోని యితర తాళపత్రప్రతుల నెల్లఁ బరిశీలించిరట! ఆవిషయము నిట్లు చీటిలో వ్రాసి పంపిరి:

"ఈపద్యాలు నేను ఆనెగొందినుంచి తెచ్చిన ప్రతిలోనివి. అందు 'ఎఱ్ఱాప్రగ్గడ పద్యాలు' అను శీర్షికతో గూర్చియున్నవి. ఇదిగాక అడయారు లైబ్రరి G. No XXXII T. 13G. 'యెఱ్ఱప్రగడవారి పద్యం' (తాళ. ప ౧౭ పం. ౧)అను మాటకు తరువాత పైమూడుపద్యాలు కలవు. ఇంకను మద్రాసు యూనివర్సిటీ కలెక్షన్ (ఎఱ్ఱాప్రగ్గడ పేరులేకున్నను) ౧౯౦నంబరు ప్రతియందు మూడుపద్యములును గానవచ్చుచున్నవి. అట్లే ౪౭౬లో కూడా పద్యాలు పేరులేకుండా కాన్పించుచున్నవి. G.Or. Mss. Madras. 14-10-7 దీనిలో 'ఎఱ్ఱాప్రగడ పద్యాలు' అన్నమాటలేదు కాని ఆపద్యాలలో "కరిణీయానంబు", "అలినిభ వేణి"అన్న పద్యాలు కాన్పించుచున్నవి."

ఈ మూఁడు పద్యములతోపాటు తక్కిన ఆరణ్యకాండ రచనాభేదము లెల్లఁగూడ ఎఱ్ఱాప్రగ్గడ రచన

ములు కావచ్చునేమో యనికూడ నే ననుమానించు చున్నాను.

అయోధ్యాకాండమునఁగూడ రచనా భేదములు చాలఁగాఁ గలవు. అందుఁగూడఁ గొన్ని యెఱ్ఱాప్రెగ్గడ పద్యము లుండునేమో! ఇట్లు భాస్కరరామాయణగ్రంథ భాగము కొన్ని చిక్కులతో నున్నవి. అవి యెల్ల జాగ్ర త్తగాఁ బరిశీలించి యిదమిత్థమని నిర్ణయింపవలసియున్నది. భాస్కరరామాయణమున ఎఱ్ఱాప్రెగ్గడ రచనములు గొన్ని చేరియుండుట తథ్యము.

౪

ఆ నడుమ నేను ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోని యొక సంకీర్ణపద్యముల తాళపత్ర సంపుటమును పరిశీలించు చుండఁగా అందు రామాయణయుద్ధకాండమున పద్య ములు ముప్పది కానవచ్చినవి. చదువఁగా నవి ప్రసిద్ధము లైన భాస్కరరామాయణాది గ్రంథములలోనివిగా తోఁచ లేదు. భాస్కర రామాయణమును, భారతారణ్యపర్వాం తర్గతరామాయణమును, భాగవతాంతర్గతరామాయణ మును, మొల్లరామాయణమును, రామాభ్యుదయమును, ఘనగిరి రామకవి సకలవర్ణనాపూర్ణ రామాయణమును పరిశీలించి చూచితిని. ఆ కానవచ్చిన ముప్పది పద్యములు నం దేందును గానరాలేదు. ఆ పద్యములు గూడ ఎఱ్ఱా ప్రెగ్గడరామాయణములోనివి కావచ్చు ననుకొను చున్నాను. వానిలో—

మ. నిను సేవించినఁ గల్గు మానవులకున్ వీటీవధూటీఘటీ
ఘనకోటీశకటీకటీతటిపటీ గంధేభవాటీపటీ
రనటీహాటిపటీ సువర్ణమకుటీ ప్రస్ఫోటికా పేటికల్
కనదామ్నాయ మహాతురంగ శివలింగా నీలకంఠేశ్వరా!

ఈ ౨౮-వ పద్యము నీలకంఠేశ్వరస్తుతిరూప మయినది. ఇది వేఱొక గ్రంథములోనిది యయినను గావచ్చును. కాని, యీ సంకీర్ణ పద్యసంపుటమున నుదాహృత రామాయణ పద్యములతో నున్నది కాన రామాయణములోనిదియే కావచ్చుననుట సంగతమగును. ఎఱ్ఱాప్రెగ్గడ నెల్లూరు మండలమందలి గుడ్లూరి నీలకంఠేశ్వరస్వామిభక్తుఁడు. ప్రోలయ వేమారెడ్డిగారి ప్రేరణమున నాతఁడు రామాయణము నా నీలకంఠేశ్వరస్వామి కంకితముగా రచించెనేమో! ఈ పద్యము గుడ్లూరి నీలకంఠస్వామి స్తుతిసందర్భములోనిదిగావచ్చును!

ఆ పద్యములలో ఎఱ్ఱాప్రెగ్గడ రచనాగౌరవము కానవచ్చుచున్నదా యని సందేహము తోఁచును. పద్యము లన్నియు సలక్షణములై యున్నవి. గొప్ప రచనాప్రౌఢిమ కానరాకున్న దనవచ్చును కాని యెఱ్ఱాప్రెగ్గడ తొలుతటి కూర్పు కాన యిందు రచనమునఁ గొంత వెన్పాటు గల దేమో!

౫

శ్రీనాథుఁడు 'పరిఢవింతుఁ బ్రబంధ పరమేశ్వరుని దేవ సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు' అని తన యెఱ్ఱాప్రెగ్గడ

రచనానుకరణాభిమానమును వెల్లడించుకొన్నాఁడు. ఈక్రింది పద్యద్వయమున ఎఱ్ఱాప్రెగ్గడ సూక్తివైచిత్రియు, శ్రీనాథుని తదనుకరణమును గానవగును :

ఉ. కందక గాజువాలిక మొగంబు వికాసమునొందఁ జేతు లీ
యందములైన కాళ్లు నరుణాంబురుహంబులలీలఁ గాంతిఁ జె
న్నొందెడు జీవహీను లిటు లుండరు ప్రాణముతోడనున్నవా
డిందు సహోదరుండు ధరణీశ్వర నీకు విషాద మేటికిన్?

ఉ. కందక గాజువాలిక వికాసము డిందక మందహాసని
ష్యందము చెక్కుటద్దముల నాటక నెమ్మది నిద్రవోవున
ట్లందమునొంది ధాత్రి సిరియాలకుమారకు వక్త్రచంద్రుఁ డా
నందము నొందె నప్డు డెలనాఁగమనంబును భర్తచిత్తమున్.

(శ్రీనాథుని హరవిలాసము)

ఎఱ్ఱాప్రెగ్గడ 'సూక్తివైచిత్రి' శ్రీనాథుని సమకాలపుఁ బ్రసిద్ధకవి జక్కనకూడ—

ఈత్రయిఁ దాఁ బ్రబంధపరమేశ్వరుఁ డై విరచించె శబ్దవై
చిత్రి నరణ్యపర్వమున శేషము... ...

అని ప్రశంసించెను.

సంస్కృత వాల్మీకిరామాయణమునకును, ప్రాచీనాంధ్రరచనములగు రంగనాథ భాస్కరరామాయణములకును జాల భేదములు గలవు. రంగనాథ భాస్కరరామాయణములుగూడఁ గొన్ని కాండములందుఁ బోలికలు గలిగి, కొన్ని కాండములందు లేకయున్నవి. రంగనాథ

రామాయణమున విశిష్టాద్వైత విషయములు గొన్ని యాధిక్యముగాఁ జేరినవి. కొన్ని కథాభేదము లున్నవి; అధికకథ లున్నవి. అందుఁ గొన్నిటికి సంస్కృతమూలము గానరాదు. దేశికథాసంప్రదాయముల ననుసరించి వానిని కవి చేర్చియుండవచ్చును. ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణాంధ్రీకరణము హరివంశాంధ్రీకరణమును బోలియుండు ననఁదగును. ఇప్పు డుపలబ్ధము లయిన పద్యములు సంస్కృతానుసారు లుగా నున్నవి. ఆయాపద్యముల పట్టులను సంస్కృత వాల్మీకి రచనలతోను, తెలుఁగు రంగనాథ భాస్కర రామాయణ రచనాభాగములతోను బోల్చి చూచిన నీ యెఱ్ఱాప్రెగ్గడ పద్యములు సరిగా సంస్కృతానుసారులుగా నుండుట వ్యక్తమగును.

రంగనాథ భాస్కరరామాయణములు ఎఱ్ఱాప్రెగ్గడ రచనమునకంటెఁ బూర్వము వెలసిన వనఁదగినవి. ఎఱ్ఱాప్రెగ్గడ కించుక తర్వాతికాలమువాఁ డగును భాస్కర రామాయణయుద్ధకాండశేషమును బూర్తిచేసిన అయ్యలార్యుఁడు. ఇంచుమించుగ నాతని కాలముననే తెలుఁగున మఱొక రామాయణాంధ్రీకరణము వెలసినది.

క. రామాయణకృతికృతియై-తా మెఱయుచు నాంధ్రకవిపితామహుఁడనఁగా
భూమిం బినభీమన యను-నామంబున వెలసె సత్యనారన ఘనుఁడై.
(సింహాసనద్వాత్రింశిక)

'పిన్నభీమన్న', యని 'ఆంధ్రకవిపితామహుఁ' డని పేరందిన. రామాయణకృతికర్తయైన యీ సత్యనారన

అనపోతకుమార సింగభూపతి (వెలుగోటి వెలమరాజు) కాలమువాఁడు. అయ్యలార్యుని కీర్తించుటచే నితఁడు నా సమకాలమువాఁడగును. ఈ రామాయణముగూడ నిపుడు గానరాదు. ప్రాచీన లక్షణగ్రంథకారులుగాని, యితరప్రాచీనకవులుగాని యీ సత్యాంశమును స్మరించినట్లు గానరాదు.

ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము ఎఱ్ఱాప్రెగ్గడ నాఁట నుండి కూచిమంచి తిమ్మకవినాఁటిదాఁక సుప్రచారము గలదిగాఁ దెలియవచ్చుచున్నది. నూటయెనుబదియేండ్ల క్రిందటిదాఁక సురక్షితమై యున్న యీ గ్రంథ మీనాఁడు గూడ నెక్కడనేని అపరిజ్ఞాతముగా నుండవచ్చును. గోదావరీమండలమున కందరాడ, చంద్రమపాలెము (కూచిమంచి తిమ్మకవి యూళ్లు) చుట్టుపట్టులఁగాని, కృష్ణా గుంటూరు నెల్లూరు కడప కర్నూలు మండలములలోఁగాని అది దొరకఁదగు ననుకొందును. నెల్లూరు కర్నూలు కడప మండలములలో ప్రాచీనగ్రంథపరిశీలన మింకను సరిగా జరుగవలసియున్నది. ఆయా చోట్ల నపరిచితముగా నున్న తాటియాకుకట్టలను పరిశీలించి యెఱ్ఱాప్రెగ్గడ రామాయణము నే పుణ్యాత్ముఁడేని యుద్ధరింపఁగల్గునని విశ్వసించుచున్నాను. ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహపురాణము తప్పులతో నొక్క ప్రతిమాత్రమే ప్రాచ్యలిఖితపుస్తకశాలలోఁ గలదు. దానికిని మంచి ప్రత్యంతరము కావలెను. ఆంధ్రవిశ్వవిద్యా

లయోపాధ్యక్షులగు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణమును సంపాదింపఁగల్గితిమేని యది మన లోక భాగ్యవిశేష మనియు, దాని నార్జింపఁగలవారి కెంత సాహాయ్యమేని చేయ నుత్సహింతు మనియు ఆ నడుమ రాజమహేంద్రవరమున జరిగిన రెడ్డిసామ్రాజ్యవర్ధంత్యుత్సవమునఁ జెప్పిరి. శ్రీ రామలింగారెడ్డిగారి పవిత్రాశయము సఫలమగుట కపేక్షించుచున్నాను.



౧౪

# కవితాపారమ్యము

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు 'యేకాంతసేవ'ను, దాని యనుకార్య మగు 'గీతాంజలి'ని బురస్కరించుకొని 'కవితాపారమ్య' మను విషయమును గూర్చి నేను తల పోయుచుండు విషయముల నిక్కడ నించుక ప్రస్తావింతును.

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు రచియించిన యేకాంతసేవాకావ్యము రవీంద్రనాథటాగూరు గారి 'గీతాంజలి' చ్ఛాయగఁ దిగా విఖ్యాతి గాంచినది. 'గీతాంజలి'యు, 'నేకాంతసేవ'యు వ్యంగ్యప్రధానకావ్యము లనియు, అవాఙ్మనసగోచరమైన యీశ్వరతత్త్వమునుగూర్చి యన్వేషము జరుపువారి కవి యొకానొక యవ్యక్తానుభూతికి దార్పఁగలిగి యున్నవనియు వాకొనుట సహృదయులకు ననుభవపునరుక్తి.

వ్యంగ్యప్రధాన మైన కావ్య ముత్తమకావ్య మని యాలంకారికుల నిశ్చితనిర్వచనము. విరిసినపూవు సువాసనను, పుప్పొడిని, మకరందబిందువులను తన నెలవునకుఁ బైపడి యివి యింతవఱకే యని గీటుగీయ నలవికానంత వింతగా చుట్టుపట్టుల కెంతదాఁకనో ప్రసరింపఁజేసి వేడుక గొల్పినట్లు, వ్యంగ్యవైభవముగూడ నిది యింతే యని గ్రుద్ది హద్దుగీటు గీయరానంత వింతగా వాచ్యలక్ష్యముల

కంటె మించిన యర్థవిశేషముల నెన్నింటినేని జలజల
రాల్చుచు నానందము గొల్పును. వ్యంగ్యవైభవము
వాచ్యాతిశాయి గనుక వాచ్యమున నిర్వహింపఁదగని
వియుఁ, దరము గానివియు నగు నర్థముల ననుమితపఱచు
నదై సామాజికులను విశాలయోచనమునకుఁ బొల్పఱచి
యనిర్వచనీయానందమునకుఁ దార్చును.

లోకానుభూయమానములగు సామాన్యవిషయములు
లోనే వ్యంగ్యవైభవ మింత చమత్కారజనక మగు ననఁగా,
నిఁక నవాఙ్మనసగోచరము, సర్వజగద్వ్యాపారమూలాధా
రము నగు నీశ్వరతత్త్వమును నిర్వచించుటకో, నిరూపించు
టకో పూనినపుడు దాని చిద్విలాస మిఁక నెంతేని వింత
గొల్పునదై. యుండితీఱునుగదా! క్రాంతదర్శి యైన సుకవి
తనలో దృశ్యాదృశ్యముగా వెలుఁగులు గొలుపుచున్న
తత్త్వమును వ్యక్తావ్యక్తవాక్కులతో వ్యంగ్యమర్యాదతోనే
సామాజికులకు పరిస్ఫురింపఁజేయవలసినవాఁ డగును. ఉత్తమ
గాయకుఁడుగూడ నొక్కొకపు డంతరంగమున గానా
మృతము పొర్లువాఱుచుండఁగా నుచ్చస్థాయికిఁ బోయిపోయి
కంఠశక్తి వెనుబడఁగా శిరఃకంపహస్తచాలనభ్రూభంగా
దులచే గేయావశేషము నవగతపఱుచువాఁ డగును.

కవి తనలో నెక్కడో యనభివ్యక్తముగా నెప్పుడో
గోచరించిన పరతత్త్వము నాలంబముగాఁ గొని దాని యను
భూతివాసనచొప్పునఁ దన నేర్పుకొలఁది భావతో నొక ప్రతి

కృతిని గల్పించి, సామాజికులకు దానిని బ్రదర్శించి పరమా ర్థానందచ్ఛాయ ననుభవింపఁజేయును. కవీశ్వరునట్లు సామాన్యజనుఁ డట్లు దాని దర్శింపనేని, ప్రదర్శింపనేని చాలఁడు. అట్లే చిత్రకారుఁడును తన కెక్కడో - లోపలనో వెలుపలనో గోచరించిన దృశ్యమును దేశకాలాంతరములందు తన భావవాసనాసంస్కారమువలనఁ గొనివచ్చి తన నేర్పున కనుగుణముగా వన్నెచిన్నెలతో రూపు గల్పించి చూపి సామాజికుల నానందపఱచును.

ప్రకృతిపుష్పము వెలార్చు సౌందర్యసౌరభ్యాదులు చిత్రపుష్పమున లేవు; అయినను సామాన్యమానవు లీ చిత్ర కారుని పుష్పము నధికానందముతో నాలోకింతురు. ప్రతికృతి కంటె సాక్షాత్సత్యవస్తు వధికహృద్యము కావలయుట విస్పష్ట విషయమే కాన, చిత్రపుష్పముకంటె మూలపుష్ప మధిక హృద్యమే కావలెనుగదా! అయినను మూలపుష్పమున నెప్పుడో యెక్కడో కొంతసేపే దృశ్య మగుట, దాని రచ యితయు, రచనాప్రణాళియు నదృశ్యము లగుట యన్న కొఱఁత లుండుటవలనను, చిత్రపుష్పమున సదా సర్వత్ర దృశ్య మగుట, చిత్రకారుఁడును దద్రచనాప్రణాళియు ప్రత్యక్ష మగుట యన్న గుణము లుండుటవలనను, అంతే కాక, మానవత ప్రాయికముగా మాయాజ్ఞానావృతమై సత్యానుభూతిదూరమై తానే సత్యప్రతిబింబభూతమై యుండుటవలనను, సులభమగు సత్యప్రతికృతికే మానవ ప్రకృతి మెచ్చుటపడును.

సామాజికాభిరంజనమునకై కవియు తాను కల్పించిన సత్యప్రతికృతికి వస్త్వలంకారశిల్పము, భాషాపరివేషము, శయ్యావైయాత్యము, ఛందస్సందర్భము పొసఁగించి స్వారస్యాతిశయము సంపాదింపఁజూచును.

సృష్టివ్యాపారకార్యమును స్పష్టముగా, సర్వదృశ్యముగా సాగించుచుఁగూడఁ దత్కర్త యీశ్వరుఁడు తన్ను దాచుకొని తన కార్యములచేతనే తన్ననుమానింపించుచున్నట్లు ఉత్తమకవియు సత్యప్రతికృతి యగు తన కవితాకల్పనలోఁ దత్సారమార్థమును గర్భీకరించి వ్యంగ్యగోచరము గావించును. కల్పితకవితలో నేదో పరమార్థ మంతర్లీనమై వ్యక్తావ్యక్తముగా ధ్వన్యర్థవేద్యము కాలేకపోయినచో నట్టి కవి వట్టి యబద్ధాలకోరుగానే గ్రాహ్యుఁ డగును.

అనఁగా, కవిత యొకవిధముగా నసత్యకల్పనమే యైనను, కవితలో నన భివ్యక్తముగా సత్యానందము వ్యంజనావృత్తిగోచరమై సందర్భిత మయి యుండఁబట్టియే యది హృద్య మగుచున్న దన్నమాట.

ఈశ్వరతత్త్వము అవాఙ్మనసగోచర మగుట తథ్యము. అట్లయ్యు దాని నాకళించుటకై లోక మెల్ల నటతటపడుచు ముందు కడుగువేయుచున్న దనుటయుఁ దథ్యము. అది యనివార్య మగుటయుఁ దథ్యము. మానవయత్నము లెల్ల సత్యార్థములు, జ్ఞానార్థములు, నానందార్థములు నగుటను బట్టియు, నీశ్వరుఁడు నిరతిశయసత్యజ్ఞానానందాత్మకుఁ

డగుటను బట్టియు నిది యిట్లే యనవలెను. ఉపనిషత్తు "అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మామృతం గమయ" అని భగవత్ప్రాప్తిని ప్రతిపాదించుచున్నది.

కాంగా, ఎఱింగియో, యెఱుంగకయో యెటుపోయి నను ఘుట్టకుటీప్రభాతన్యాయమున నెల్లమానవగతియు, అంతే యేమి-సర్వప్రాణిగతియు నీశ్వరాభిముఖమే యగు చున్నది. కాన ఈశ్వరప్రాప్తి ప్రాణికోటి కెల్ల నని వార్యమేకదా!

సదసత్తులతో, జ్ఞానాజ్ఞానములతో, ఆనందదుఃఖము లతో, అపాయతన్నివృత్తులతో కలగలుపయి గజిబిజిగా నున్న ప్రపంచప్రవృత్తిలో తాముపద్రష్టలై లోకసామాన్య మున కీ యీశ్వరప్రాప్తియత్నమున తాత్త్వికులు, శాస్త్ర కారులు, చిత్రకారులు, కవులు పురోగాములై యుందురు.

తాత్త్వికులు, శాస్త్రకారులు ఘోరదీక్షతో నంత రంగసముద్రమును మథించియు, బాహ్యామాయావరణారణ్య మును జీల్చికొని బాటలు త్రొక్కియు గుర్తించి తెచ్చిన దివ్యవిజ్ఞానపదార్థములను పరికరములుగాం గొని వారివెనుక నడచువాం డగు కవీశ్వరుండు వానిలోనే లేర్చి వారు గుర్తించిన మార్గములలోనే చలువపందిళులను, రసామృత ప్రపలను గల్పించుచు, నింకను వెనుక నడచు మానవ

సామాన్యమునకు వేడ్కఁగొల్పుచు వారి పయనము సుఖమయము గావించును.

తాత్త్వికునిలోఁ బరమార్థసాక్షాత్కార ముండును. కవిలోఁ దదనుసారిగా బ్రసన్నమధురాంశచ్ఛాయాకల్పనము లుండును.

తాత్త్వికునిలో కవితాంశములును, కవిలో తాత్త్వికతాంశములును గూడ ననుగతములై యుండవచ్చును.

తాత్త్వికుల తత్త్వజ్ఞానము పెరుగఁగా పెరుగఁగా తన్మూలమున కవితలో తాత్త్వికతాంశములు పెరుగఁగా పెరుగఁగా సంఘమున తాత్త్వికతాశ్రద్ధ పెచ్చుపెరుగును. అప్పుడు కవిత తేటదేరి క్రమపరిణామముతోఁ బరమార్థపరాయణ మగును. కృత్రిమకవితావిడంబనము లకపుడు తావుండదు. కవి కపుడు సత్యప్రతికృతికల్పన మనావశ్యకమగును. సౌందర్యసముచితమయిన యా పరమార్థమే, అనఁగా సత్యమే యప్పుడు వాఙ్మయాకృతిఁ దాల్చును. పదునాఱువన్నె బంగారమును మించిన మేనిసొరు గల శుద్ధసాత్త్వికతేజోవిరాజితునకు బంగారపు టలంకారములతోఁ బనియేమి?

శాస్త్రకారులు శారీరకపదార్థవిజ్ఞానరసాయనాది శాస్త్రప్రజ్ఞాతిశయమున గులాబిపువ్వును సువాసనతో, సౌకుమార్యముతో, పూవుదేనెతో, పుష్పాడితో సర్వసుల

భముగా శాస్త్రప్రక్రియచే ప్రపంచ మనుకరింపఁ గల్గినపుడు గులాబిచిత్రకల్పనప్రయోజనము నశించిపోవును. శాస్త్రజ్ఞులు శబ్దస్పర్శరూపరసగంధములను జ్ఞానేంద్రియవ్యాపారములతో నిప్పటికి శబ్దరూపములను సర్వత్ర సర్వదా సులభములు చేయఁగల్గినట్లు తక్కిన మూడింటినిగూడ చేయఁగల్గవచ్చును. అనఁగా మదరాసు రేడియోలో పాడఁగా నపుడే గ్రామఫోనులలో నెక్కించిన పాట, యెక్కడఁబట్టిన నక్కడ, ఎప్పుడు పట్టిన నప్పుడు వినఁదగినట్లు, చెన్నపురిలోనే రేడియోస్థానమునఁ బెట్టిన భక్ష్యభోజ్యముల చవియు, పూల వాసనయు, వస్తువుల స్పర్శయు సదా సర్వత్ర యాస్వాదింపఁదగినవి, యాఘ్రాణింపఁ దగినది, స్పృశింపఁదగినది కావచ్చును గదా!

ఇట్టివి జరిగినచో ఇఁక ననుకరణములయు, ప్రతికృతి కల్పనములయు, కవితాకల్పనములయు ప్రయోజన మేముండును? సత్యజగదానందమే కాని కవికల్పితజగదానందమప్పు డక్కఱలేక పోవును. కవి యపుడు దన కనుకార్యుఁడగు నీశ్వరునికిఁ దాను బ్రతిబింబతను గాక తాదాత్మ్యమునే పొందును. ఇట్లు మానవతలో నీశ్వరతాదాత్మ్యము గోచరింపను గోచరింపను వాఙ్మయముకూడ నకృత్రిమమయి తాత్త్విక మగును. తాత్త్వికులయు, సాత్త్వికులయు దివ్యవిజ్ఞానము లిందుకు తార్కాణము. "తత్త్వ మసి" యిందుకు ప్రమాణము.

---

## ౧౫

# ఆంధ్రలిపిసంస్కారము

నేఁడు వాడుకలో నున్న మన తెనుఁగులిపి మనకు మిక్కిలి చిక్కులు గలిగించునదిగా నున్నది. పసిబాలురకు లిపి నేర్పుటలో క్లేశము గలదు. గ్రంథములు నచ్చొత్తించుటలో క్లేశము గలదు. టైపురైటింగు నిర్మాణమున కసౌకర్యము గలదు. అంతేకాక వర్ణోచ్చారణరీతికిఁగూడ విరోధము గలదు. ఇవి యెల్లఁ జిన్న చిక్కులు కావు. వీనిని గొంత వివరింతును:

౧ బాలురకు నేర్పుటలో క్లేశము :

అచ్చులలో హ్రస్వదీర్ఘములగు అ, ఆ లు ఈషద్భేదము గల సమానలిపులై యుండఁగా ఇ, ఈ లు పోలికయే లేనివిగా నున్నవి. అందు ఇ చవర్గాంత్యానునాసికమగు ఞ-తో పోలిక గలది. ఋ, ౠలు బు, బూల పోలిక గలవై రెండు కొమ్ములు గలిగి పొందిక లేక మోటుగా నున్నవి. ఒ, ఓ, ఔ లు జ-తో పోలిక గలవి. ఇఁక హల్లులలో కవర్గ మెల్లఁ బోలికయే లేని భిన్నభిన్నలిపులతో నున్నది. ఖ-కు తలకట్టు లేదు. ఘ 'ఫ, ఫు, ష, షు' అక్షరముల పోలిక గలది. చవర్గమున చ ఛ లు పోలిక గలిగియున్నవి. కాని జ ఝ లు భిన్నములుగానే యున్నవి. జ-కు తలకట్టు లేదు. అది ఒ ఓ ఔల పోలిక గలది. ఝ రు, ఉ వర్ణముల పోలిక

గలిగి రెండు కొమ్ములు గలిగి యసందర్భముగా నున్నది. ఞ ఇకారముతోఁ బోలిక గలది. టవర్గమున ట, ఠలు పోలిక లేనివి. డ ఢ లు చ ఛ ల వలెఁ బోలిక గలవి. ణ తలకట్టు లేనిది; క, చవర్గముల యంత్యానునాసికములు ఙ, ఞ లు తలకట్టు లేనివి. అవి చిహ్నము గలవై యుండఁగా ణ-కు అది లేదు. దీనితర్వాతి వర్గానునాసికము లగు న, మ లకును నా చిహ్నము లేదు. తవర్గమున త మాత్రము భిన్నమై, తర్వాతి మూఁడక్షరములగు థ ద ధ లు పోలిక గలిగి యున్నవి. న స-తోఁ బోలిక గలది. పవర్గమున ప ఫ లు, బ భ లును బోలియున్నవిగాని బ-కు తలకట్టు లేదు. మ-కు కొమ్మున్నది. ఇది వ-పోలిక గలది. దీనితో భేదము గల్పించుటకుగాను వ-కుఁ గొమ్ము ముడ్డిక్రింద ఈయవలసెను. ప ఫ లకుఁ గూడఁ గొమ్మిచ్చుటలో నిట్టి చిక్కు కలదు. య కొమ్ము గలది. ర ఱ లు, ల ళ లు, శ ష లు పోలిక లేనివిగా నున్నవి. స స-తోఁ బోలిక గలది. హ వతో బోలికగలది.

ఉచ్చారణమునఁ బోలిక యుండుటను బట్టి లిపిలోఁ గూడ బోలిక యుండఁదగిన యక్షరములు క ఖలు, గ ఘలు, జ ఝలు, ట ఠలు, త థలు, రఱలు, శ ష సలు పోలిక లేనివై, పూర్వోక్తవిధమున నుచ్చారణమున నేమాత్రమును బోలిక లేని యక్షరములు గొన్ని పోలిక గలవై యుండుట చేతను, వర్గాక్షరాదులు సరియయిన నిర్మాణక్రమము లేనివిగా నుండుటచేతను బాలురకు లిపిని నేర్పుటలో మిక్కిలి చిక్కు గలదు. చ-కు ముడ్డిక్రింద ఒత్తిచ్చినచో ఛ అగునని చెప్ప

టకు వీలులేదు. క ఖ, ట ఠ, త థ, లు అట్లులేవు గాన సాజాత్య బోధము కుదురదు. ఇంత వరుస, వావి లేని లిపిరూప ములను భిన్నభిన్నముగా నేర్చుకొనఁ గష్టమే కాదా? మఱియు నిపుగాక అజ్గుణితము వేఱు చిహ్నములతో నేర్చుకొనవలెను: హల్గుణితము వేఱు చిహ్నములతో నేర్చుకొనవలెను. ఈ గుణితములలోఁగూడఁ బెక్కు చిక్కులు గలవు. ఇవి కొంత ఉచ్చారణరీతికి విరుద్ధముగాఁగూడ నున్నవి. హల్లుపై అజ్గుణి తమును జేర్చునప్పుడు తలకట్టు అకార మున్నప్పుడు మాత్రమే ఉండఁదగును. తక్కిన యచ్చులు చేరునప్పు డుండరాదు. క, కా, కి, కీలు సరిగా నున్నవి కాని, కు కూలు తప్పుగా నున్నవి. తలకట్టు, కొమ్ము రెండును ఉండఁగూడదు. 'కృ కౄ' లకును ఇట్టి చిక్కే కలదు. ప్రైమరీ స్కూళ్ల పంతులవార్లు కొందరు 'కృ'కు కకార అకార ఋకారములు 'కృ' అని వర్ణక్రమము చెప్పుటను వింటిని. వా రట్లు చెప్పుట వింతగాదు. వట్రువ సు డి ృ, ౄ ఒత్తులవలె హల్లుగాఁ దలఁపఁబడు ననియేకదా కొందఱు లాక్షణికులుగూడ అది యున్న హల్లు తక్కిన యచ్చులతో నున్న యా హల్లుతోఁ బ్రాసమునఁ జెల్లు నని చెప్పిరి! కనుక కొమ్ము, కొమ్ముదీర్ఘము; వట్రువసుడి, వట్రువ సుడిదీర్ఘము ఉన్నప్పుడుహల్లుకు తలకట్టు ఉండుట అక్రమము.

ఇక హల్గుణితములో 'వాక్స్వాతంత్ర్యము' అను పదము వ్రాయునప్పుడు 'క్స్వా'లో కకార సకారములు

హల్మాత్రములు. వకారము ఆకారముతో గూడినది. క్స్వా
ను విడఁదీసినచో 'క్, స్, వా' అగును. కాని మనము
లిపిలో ఆకారమును కకారముమీఁదనే ఉంచుచున్నాము.
సకారవకారములను క్రింద ఒత్తులనుగా ఉంచు
చున్నాము. బడి పంతుళ్లును, కొందఱు పండితులునుగూడ
'క-కు దీర్ఘమిస్తే కా, కా-కింద సావత్తిస్తే క్సా, క్సా-కింద
వావత్తిస్తే క్స్వా' అనియు, 'కకార ఆకార సకార వకార
ములు క్స్వా' అనియు వర్ణక్రమము చెప్పుచున్నారు. ఇది తప్పు
గాదా! నాగరాక్షరములు ఈ విషయమున ఉచ్చారణ రీతి
ననుసరించి సరిగా నున్నవి. ఆ లిపిలో సంయుక్తాక్షరమునఁ
గడపటి హల్లుమీఁదనే య చ్చుండును. తత్పూర్వము గల్గు
హల్లులు అర్ధాక్షరచిహ్నములు గలవిగానే యుండును. బాలు
రకు లిపి నేర్పుటలో నిట్టి చిక్కులు గలవు. అలవాటుపడి
యుంటిమి గనుక నేఁడు మన కివి యంతగాఁ జిక్కు గూర్చు
నవిగాఁ దోఁపకపోవచ్చునుగాని బాల్యమునఁ దొలుత
నేర్చుకొనునప్పుడు మనల నెల్లరనుగూడ నీ చిక్కులు బాధిం
చియే యుండుట వాస్తవము. ఎంత యలవాటయినను
ప్రౌఢులనుగూడఁ గొందఱ నీ చిక్కులు బాధించుచునే
యున్నవి. తొలుత నేర్చుకొనునప్పుడు బాలురెల్లరును బాధ
పడుచునే యున్నారు. ఈ బాధ సరకుగొనరాని దనరాదు.
అక్షరములు వడిగా రాకపోవుటచే బాలురెందఱో బండవాఱి
చదువున సన్నగిలుచున్నారు; బడి యన్న భయపడు
చున్నారు. ఈ లిపిక్లేశములు వారి హృదయప్రసాదమును

తెలుచుచున్నవి. అక్రమపు క్లేశములకుఁ బాల్పఱచి వారిని బాధింపరాదు.

౨ అచ్చులో కష్టములు:

ఇప్పు డున్న లిపిరీతినిబట్టి ముద్రణమున వేఱువేఱు లిపిసంకేతములు ఇంచుమించుగ అయిదునూఱులు కావలసి యున్నవి. వాని నీ క్రిందఁ జూపుచున్నాఁడను:—

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ - ఇవి ౧౬.

క కా కి కీ కు కూ కె కే కొ కో కౌ క్ ఇవి ౧౨.

ఇట్టివి క మొదలు క్ష వఱకు గల ౩౬ అక్షరములకు మొత్తము ౪౩౨.

ం ౘ ఎ బ ఠ ఏ ౨ ౧ లా వె ౨ శ ౯ ౯ ఫ భ ళ ఛ ఉ గ ల డ ౼ ద ౼ ౧ ౼ ఖ ఘ వా ఎ ఱ ఱ ఱ ఞ జ ఝ ఞా ఢ ణ థ ధ క్షుఃఅఃజ గ ( ం-ఇవి-౪౯.

సంకేత బాహుళ్యముచే సాధారణముగా డెమ్మీ సైజులో నాల్గు ఫారములకు సరిపడు మైపును గూర్చవలె నన్న అగు విలువకు ద్రవిడ లిపిలో ౮ డెమ్మీఫారముల మైపు వచ్చును. ఇట్లు ధర తక్కువ యగుటకుఁ గారణము అఱవ లిపి సంకేతముల సంఖ్య మిక్కిలి తక్కువగా నుండుటే. అందు ౨౪౬ మాత్రమే లిపిసంకేతములు. క్రొత్తగా కంపోజి టరు తెలుఁ గచ్చుకూర్పును నేర్చుకొనుట కాఱు నెలలు

పట్టును. అఱవపు టచ్చుకూర్పు ఒక నెలలో నేర్చుకొనవచ్చును. ౫౦౦ గళ్లలోనుండి సంకేతములు నేర్చవలసియుండుటచే తెలుఁగులిపిని కూర్చుటలోఁగూడఁ జాలజాగగును. గంటకు ఒక గాలీ అఱవము కూర్పఁగలుగఁగా, తెలుఁగున అర గాలీ మాత్రమే కూర్పఁగలుగుదురు. ఇట్టి కారణములచే తెలుఁగు కంపోజిటర్లు విరివిగా దొరకరు. తక్కిన భాషల కంపోజిటర్ల కంటె వీరికి జీతము హెచ్చు. ఇదిగాక అచ్చుకూర్పులో సౌందర్యము తక్కువ. ఒత్తక్షరమున ౨, ౩, ౪ లిపిచిహ్నములు ఒకదానిక్రింద నొకటిగాఁ జేర్పవలసియుండుటచే బంతులు తీర్చినట్లు సాగవు. 'వాక్స్వాతంత్ర్యము' అను పదము అచ్చుకూర్పున అందముగా నుండదు. అక్షరముక్రింద నక్షరముఁ జేర్పవలసియుండుటచే 'ఫుల్ బాడీ, ఆఫ్ బాడీ' యను భేదములతో వేఱు తీరుల యక్షరములు నెక్కువగాఁ జోఁత పోయవలయును. ౫౦౦ లిపిసంకేతములను నిర్మింపవలసియుండుటచే వ్రాఁతమోడి, పరిమాణము భిన్నభిన్నములుగా నుండునట్లు అనేకవిధములగు లిపిభేదములను గల్పింప సాధ్యపడకున్నది. (మాటవరుసకు) మద్రాసులో అఱవమున డెమ్మీఫారము ముద్రణమునకు నాలుగురూపాయలు ఛార్జి చేయఁగా తెలుఁగున నదేమాదిరి ఫారమునకు ఆఱు, ఎనిమిది రూపాయలు ఛార్జి చేయుచున్నారు. ఇట్టి వింక నెన్నో చిక్కులు తెలుఁగు ముద్రణవిధానమునఁ గలవు. ఇంతకుముందు మొదటి ప్రకరణమునఁ జెప్పిన వ్రాఁతచిక్కులెల్ల నీ ముద్రణమునకును గలవు.

• టైపురైటింగు

అచ్చునకే యిన్ని చిక్కు లుండఁగా నిఁక టైపు రైటింగు కుదురునా? ఇంగ్లీషున, అఱవమున ఉన్నట్లు లిపి సంకేతములు ప్రక్కప్రక్కనే (ఒకదానిక్రింద నొకటి యుండ రాదు) యుండుట, ఆ సంకేతములుగూడ నలువదింటికంటె మించకుండుట ఉన్నఁగాని టైపురైటింగు సాధ్యము గాదు. కాన ఇప్పటి లిపిరీతికి టైపురైటింగు కుదురనే కుదురదు.

• సంస్కార మెట్లుండవలెను?

మీఁద వివరింపఁబడిన చిక్కులెల్లఁ దొలఁగునట్లు, అనఁగా బాలురకు సులభముగా నేర్వఁదగియుండునట్లు, అది విస్పష్టముగా నొక నిర్మాణవిధానముతో నుండునట్లు, ఉచ్చారణరీతికి భిన్నము గాకుండునట్లు, అచ్చులో సౌకర్య మేర్పడునట్లు, టైపురైటింగుకుఁ గుదురునట్లు సంస్కరించుట సాధ్యమేని యది యవశ్యకర్తవ్యము గాదా? తాతలు త్రవ్విన నూయిగదా యని యందుండి యుప్పునీటినే యెప్పుడును ద్రాగుచుండఁదగునా-దగ్గఱనే మంచినీటిబావి త్రవ్వఁదగి యుండనేని? అదిగాక, నేఁటి లిపిరీతిమాత్ర మే మంత నిశ్చలము? అయిదువందలయేండ్ల పూర్వమునఁ గల లిపికిని, మననాఁటి లిపికిని నెంతేని భేదము గలదు. నేఁటిలిపికూడ బహుపరిణామములఁ బొందుచు వచ్చుచున్నదే.

లిపిలో నిప్పు డున్న కీళ్లను దొలఁగించుకొనుట అవశ్యకమే కాని, వానిఁ దొలఁగించుకొనుటకై చేయు మార్పు

లలో నున్న వేళ్లఁగూడఁ గొన్ని యీడుట యగునేని
యీ విధాన మంగీకారార్హము గాఁగూడదు. మఱియు నా
మార్పులు సులువుగా జరపఁదగినవై యుండవలెనుగాని
మూలచ్ఛేదులుగాను, సర్వము తార్మారుపఱచునవిగాను,
అమితవ్యయాపాదులుగాను, జనసామాన్యమునకు ఆరంభ
మున నేని ఉక్కిరిబిక్కిరిగా అర్థముగానివిగా నుండునవిగాను
గారాదు. అట్టివానివలన అలజడి, అశాంతి యేర్పడును.
నేఁటి తెలుఁగక్షరములనే తీసివేసి వానికిబదులు ఇంగ్లీషక్షర
ములనో, నాగరాక్షరములనో పెట్టుద మనువారు కొందఱు
గలరు. ఈ సూచన లనర్థదాయకములు. ఆ మార్పులు
సులువైనవి గావు. ముత్తెపుసరులను జాచి పట్టినట్లు తెలుఁగు
వ్రాఁతబంతులు గుండ్రని వ్రాలు గలవై యందముగా
నుండును. ఇది మన లిపి కున్న యున్నతసుగుణము. దీనిని
గోల్పోరాదు. ఇంగ్లీషునాగరలిపుల కీ యందము లేదు.

మఱియు, చేసిన సంస్కారము. ఇప్పు డున్న లిపికి
అలవాటు పడియున్నవారి కెల్లరికి క్షణములో గుర్తింపఁ
దగినదై, యనుకరింపఁదగినదై యుండవలెను. అది
వ్రాఁతలో, అచ్చులో, టైపులో మూఁడిటను భేదము లేక
ఒకే తీరుగా నుండవలెను. వ్రాఁతలిపి వేఱు, అచ్చులిపి వేఱు,
టైపులిపి వేఱు అన్న ట్లుండరాదు. మహారాష్ట్ర గుర్జర
దేశములందు నాగరిలిపి కిట్టి చిక్కు గలదు. అందు వ్రాఁత
మోడిలిపి వేఱు; అచ్చులిపి వేఱు. అట్టి విభేదము మనకుఁ
గల్గరాదు.

* సంస్కారవిధానము :

క్రింద విచారించిన దోషము లెల్లఁ దొలఁగునట్లును, గుణములెల్లఁ గూడియుండునట్లును గుదిరియున్నదని నేను విశ్వసించిన సంస్కారవిధానము నిక్కడ చూపుచున్నాఁడను.

అచ్చులు:

అచ్చులలో అకార మొక్కటి తక్కఁ దక్కిన యక్షరములనెల్ల విడిచిపెట్టవలెను. అకారముమీఁదనే దీర్ఘము, గుడి మొదలగు అజ్గుణితచిహ్నములను (చిత్రము చూచునది.) జేర్చినచో అచ్చులెల్ల సర్పడును. అకారమును మాత్ర మట్లే యుంచునది. హల్లులమీఁద నీ అకారము '✓' తలకట్టు రూపమును బొందును. ఆకారాది స్వరములు హల్లుల మీఁద నున్నప్పుడే గుణితము లగునుగాని అకారముమీఁద నున్నప్పుడు గావు—అచ్చులకు గుణితము లేదుగాన.

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ ఓ, ఔ అను విధములఁ గల బదునాఱులిపులకును చిహ్నములనుంచవలెను. (చిత్రము చూచునది.)

ఇట్లు మార్పఁగా, బాలురకు ఒక్క అకారము మాత్రము నేర్పి తర్వాత దీర్ఘము, గుడి మొదలగు అజ్గుణితపు చిహ్నముల నేర్పినచో నచ్చులెల్ల వచ్చును. కకారాదుల మీఁద నిఁక వేఱుగా అజ్గుణితమును నేర్పఁ బనియుండదు. ఒక్క తలకట్టు మాత్రమే నేర్పవలసియుండును. దీర్ఘము,

గుడి కొమ్ములగు నజ్గుణితపు చిహ్నములు అచ్చులలో చేర్పుటచే నా చిహ్నములే హల్లులపై నుండును. కావున పదునైదు భిన్నాక్షరముల నేర్చుకొనవలసిన బాధ తగ్గినది. ముద్రణమునం గూడ అచ్చులలో పదునైదు చిహ్నములు తగ్గిపోయినవి.

అ ఆ ఇ ఈ ఉ ఊ

ఋ ౠ ఎ ఏ ఎ ఏ

ఐ ఒ ఓ ఔ

(మరొక తీరు)

ఁ, ం, ః. అరసున్న, నిండుసున్న, విసర్గము పూర్వము వలెనే ఉండవలెను.

**హల్లులు:**

హల్లులలో క, చ, ట, త, ప- వర్గములు సమాన లిపినిర్మాణముగలవిగా నిట్లు మాఱవలెను. వర్గప్రథమాక్షరమునకు ప్రక్కను ఒత్తిచ్చినచో ద్వితీయాక్షరమగును. వర్గతృతీయాక్షరమునకు ప్రక్కను ఒత్తిచ్చినచో వర్గచతుర్థాక్షర మగును. వర్గతృతీయాక్షరమునకే తలమీఁద అనునాసికచిహ్నము చంద్రకళ (ఇప్పటి 'జ ఞ'ల కున్నది ఁ) ఉంచినచో వర్గపంచమాక్షరమగును. అకారముతోఁగూడిన హల్లులకెల్లఁ దలకట్టుండవలెను. తలకట్టు అక్షరమునంటియే యుండవలెను. అనఁగా, ష, స-లు తలకట్టుతో నంటియుండవలెను. ఇట్లు తీర్చఁగా వర్గాక్షరము లిట్లేర్పడును. (చిత్రము చూచునది)

ఇందు బాలురకు వర్గ ప్రథమతృతీయాక్షరములను బదిఁటిని మాత్రమే వ్రాయనేర్చుకొనుటలోఁ బ్రయత్నమగును. ఒత్తుగల యక్షరములను ఒత్తి పలుకవలెనన్న విషయము త్వరలో బాలుర హృదయమున నాటి నెలకొనును. క నేర్చినవానికి, దాని ప్రక్కనే ఒత్తుగీత గల యక్షరమును ఖ నుగా గుర్తించుట, ఉచ్చరించుట కడు సులభము. వర్గద్వితీయచతుర్థాక్షరములెల్ల నిట్లే సులువుగా నేర్వఁదగినవగును. భిన్నభిన్నరేఖలతోఁ గ్రొత్త లిపులను దిద్దుట, యుచ్చారణమును జ్ఞప్తియందుంచుకొనుట యును కష్టము

లుండవు. వర్గతృతీయాక్షరము ముక్కు మూసికొని యుచ్చ
రించినచో వర్గపంచమాక్షరమగుట నుచ్చారణశక్త్యనుసార
ముగా బాలురకు నేర్పుటగును. దీనినిబట్టి యిరువదియైదు
వర్గాక్షరములలోఁ బదిమాత్రమే దిద్దికొనవలసినవి; తక్క
నవి కడుసులభముగా జ్ఞాపకమునఁ బెట్టుకొని రెండు ఒత్తు
గీఁతల భేదముతో, తలమీఁది చంద్రవంకతో వ్రాయఁదగినవి
యగును. వర్గాక్షరములెల్ల నొక్క నిర్మాణక్రమము గల
వగును.

ఇట్లు మార్పఁగా ముద్రణమునఁగూడ నిర్వదియైదు
వర్గాక్షరములలోఁ బదునైదక్షరములు తగ్గిపోవును. వర్గ
ద్వితీయచతుర్థాక్షరముల నచ్చుఁ గూర్పవలసినపనియు,
వర్గప్రథమతృతీయాక్షరములఁ గూర్చి వాని ప్రక్క నంటి
యొక్క నిలువుగీఁత (।) అంకెను జేర్చిన సరిపడును. వర్గ
పంచమాక్షరమునకు వర్గతృతీయాక్షరము తలకట్టు నొట్టు
నట్టు చంద్రకళ చేర్చినఁ జక్కఁబడును.

**అంతస్థములు: ఊష్మలు:**

య-కుఁ గల కొమ్మును దొలఁగింపవలెను. ర-కే
ప్రక్కను ఒత్తిచ్చినచో బండి ఱ అగును. ల-కు తలకట్టుండ
వలెను. ల-కే ప్రక్కను ఒత్తిచ్చినచో ళ అగును. వ-ను ప-ను
గాఁ జేసితిమి గాన వ స్థానమునఁ గ్రొత్త యక్షరము వ్రాసి
'వ' చేర్పవలెను. శ యథాపూర్వమే. శ-కు ప్రక్కను ఒత్తిచ్చి
నచో ష అగును. సస్థానమున స యుంచునది. హ స్థాన

మున నేఁటి శను, అనఁగా కర్ణాటకపు హాకారమును ఉంచు నది. హా తలకట్టు, దీర్ఘము గలిగియున్నదిగాన దానిని దొలఁగింపఁదగును. క్షకారము కష సంయుక్తాక్షరము గాన దానికి వేఱురూప మనావశ్యకము. ఇట్లు తీర్పగా నంతస్థములు, ఊష్మలును నిల్చెడును. (చిత్రము చూచునది.)

ఈ మార్పువలన యాదిశాంతమగు పది యక్షరములలో మూఁడక్షరములు తగ్గినవి. ఒక నిర్మాణక్రమ మేర్పడినది.

గుణితము:

అజ్గుణితము: అజ్గుణితచిహ్నము లెల్ల అచ్చులు నేర్చుకొనుటలోనే వచ్చినవిగాన బాలురకుఁ హల్లులలోఁ దలకట్టు అకారస్థానీయ మగుటయు, తక్కిన యచ్చులకెల్ల అకారముమీఁదఁ బెట్టిన గుర్తులే పెట్టిన సరిపడు ననియుఁ జెప్పి క్షణములో అజ్గుణితమును నేర్పవచ్చును.

ముద్రణమున తలకట్టు, దీర్ఘాదిస్వరచిహ్నములు వేఱువేఱుగా నిర్మించి (కన్నడలిపిఁబోలె) చేర్పవలెను. దీనిచే ఒక్కొక్క హల్లునకును అజ్గుణితముక్రింద నిప్పుడు పోయఁబడుచున్న ప్రత్యేకాక్షరములు పదేసి పదేసి తొలఁగి పోవును. దీనిచే అచ్చుపోఁతలోఁ గల యమితభారము తప్పి పోవును.

హల్గుణితము:—ఉచ్చారణరీతికి విరుద్ధముగాకుండ లిపిరీతి యుండవలెను గాన, హల్సంయుక్తాక్షరములందు కడ

పటి హల్లుమీఁదనే అచ్చు ఉండవలెను. కడపటి హల్లేపూర్ణాక్షరముగా నుండవలెను. తత్పూర్వపు హల్లులు తలకట్టు లేనివిగా (అనఁగా హల్మాత్రములుగా) నుండవలెను. (తలకట్టు తొలఁగిన హల్లులు హల్మాత్రములు.) ఒక యక్షరముక్రింద నొక యక్షరము నిఱికించుట యను విధానము మానవలెను. లిపులెల్లఁ బ్రక్క ప్రక్కలనే ఉండవలెను. అనఁగా నిట్లు. దివ్యధ్వని—అను పదమును 'దివ్యధ్వని' అని వ్రాయవలెను. రెండిటికంటె హెచ్చుగా హల్లులు సంయుక్తములై యున్నప్పుడు మాత్రము, కడపటి హల్లుగాక తత్పూర్వపు హల్లులు, తలకట్టు లేనివిగా నుండునుగాన, ఒకదాని క్రింద నొక దానిని బెట్టినను బెట్టవచ్చును. ఎట్లనఁగా—'వాక్స్వాతంత్ర్య' అను పదమును 'వాక్స్వాతంత్ర్య' అని వ్రాయవచ్చును. ఇట్టి మార్పువలన బాలురకు హల్లుగణితపు ఒత్తులను నేర్చుకొనవలసిన శ్రమము తొలఁగును. ఉచ్చారణరీతి ననుసరించి లిపిరీతిని నేర్చుకొనుట యగును.

ముద్రణమున నీమార్పు బహుసుఖావహము. బంతిలో నక్షరము లెల్లఁ దీర్చినట్లుండును. ప్రతిపదము అక్షరము క్రింద నక్షరము వచ్చి బంతి వంకరపోదు. 'హాఫ్ బాడి, ఫుల్ బాడి' టైపుల గజిబిజి యుండదు. సమ్మతిమగుచో రెండింటికంటె నెక్కువ హల్లులు సంయుక్తమైనప్పుడుమాత్రమే తలకట్టు లేని హల్లులు అక్షరము క్రింద నక్షరముగా నేర్పడును. అది యసాధారణముగా నెక్కడనో వచ్చును. కాన యంతచి

క్కుండదు. కాని యిక్కడ నసౌకర్యమున లేఁ దోఁచఁదగిన
విషయమొకటి యున్నది. ఏదనఁగా—సంయుక్తాక్షరములు
హల్లు క్రింద హల్లుగాఁ గాకుండ ప్రక్కప్రక్కగాఁ గూర్చుట
చేత నిప్పటి లిపి యాక్రమించుకొను స్థలముకంటె నీ మార్పు
లిపి హెచ్చుస్థల మాక్రమించుకొనును గదా అనునది. ఇది
యోచింపఁదగినదే. ఒకానొక యాంగ్లాభిమాని ప్రము
ఖుఁడు ఆంధ్రలిపిని దొలఁగించి తత్స్థానమున నాంగ్ల
లిపిని జొప్పింతుమేని నూఱుపుటలాక్రమించుకొను గ్రంథ
మును ఏఁబదిపుటలలో సమకూర్పవచ్చునని కొన్ని యేండ్ల
క్రిందట వాదించుట వింటిని. ఇంగ్లీషక్షరములు నిలువునిలువు
గానుండు గీఁతలగుటచే స్వల్పస్థలమునఁ బెక్కక్షరములను
కూర్పనగునని యా లిపిజ్ఞులనిరి. అట్లు తలఁచువారుండఁగా
నే నిపుడు పేర్కొను లిపిసంస్కారము ఇప్పటి లిపికంటె
హెచ్చుస్థల మాక్రమించునదిగా నుండునేని యది ప్రాజ్ఞసమ్మ
తము గాకపోవచ్చును. కాని యీ సంస్కారము నిజముగా
నట్లు హెచ్చు స్థల మాక్రమించుకొనదు. వ్రాఁతలో నించు
కంత స్థలము హెచ్చుతగ్గులగుటలోఁ జిక్కుండదు.
అచ్చులో స్థలము పెరుగుటమాత్రమే చిక్కు. అచ్చులో
లిపి క్రింద లిపి నుంచి కూర్చినట్లు కన్పట్టుచున్నదే కాని,
వాస్తవమునకు (హాఫ్‌బాడీతప్ప) ప్రక్కనే ఉండును.
వానిని గూర్చుటలోఁ గొంచె మించుమించుగా విడఁబఱచి
వ్రాసిన నెంతస్థల మాక్రమించుకొనునో యంత స్థలమును
వెనుక ముందుల ఆ 'స్పేసు' ఆక్రమించుకొనుచున్నది.

పైఁగా బంతి వంకరవోవుచున్నది. అట్టి సంయుక్తాక్షరములు గల బాతికొఱకయి కొన్ని 'లెడ్డు' ఎక్కువ వేయవలసివచ్చుచున్నవి. కాన వీనిని గలిపి కట్టకొని వచ్చో నంతగా నీ మార్పు హెచ్చుస్థల మాక్రమించుకొనునది గాదని యేర్పడును. మఱియు ఋ, ౠ, ఘు, ఝు, మ, య, ఱ, హ- లలో జరుపఁబడిన మార్పులవలని స్థలలాభము కొంత గలదు. కావున నిది యంత యనర్థావహము గాదని నా తలంపు. అఱవలిపి యీవిధముననే కలదు. అందు లిపిక్రింద లిపి చేరదు. దానివలన వారి కెట్టి యసౌకర్యమును లేదు.

ఈ మార్పుచే హల్లుల యొత్తులు ్గ, ్వ, ్న, ్ర మొదలగునవి అక్కఱలేకపోవును. ఈ గుణితచిహ్నములను వేఱుగాఁ బోఁతపోసి తలకట్టు లేకుండఁ బోసిన హల్మాత్రములమీఁదఁ జేర్చుటకు వీలు గలుగును. సంయుక్తాక్షరముందలి హల్మాత్రములు తలకట్టు లేకుండఁ బూర్వమువలెనుండి కడపటి హల్లు అచ్చుతోఁ గూడియుండుట గుదురును.

మొత్తము లిపియెల్ల నిట్లు మార్పఁగా నచ్చుకై పోఁత పోయవలసిన రేఖాచిహ్నములు ముప్పదియైదు మాత్రమే యగును. వర్గద్వితీయచతుర్థములకు, శ, ఱ, ష- లకుఁ బెట్టవలసిన ఒత్తుగీఁత యొక్కటి, వర్గానునాసికములకుఁ బెట్టవలసిన చంద్రకళ ఒక్కటి గలవు. ఈ రెంటిని జేర్చుకొనఁగా ముప్పదియేడగును. ఇప్పుడు ముద్రణమునకై యుప

యోగింపఁబడుచున్న చిహ్నములు ౫౦౦లో ౨౬౩ తగ్గిపోయినవి. ముద్రణమునకీ మార్పు అమితోపకారకము గదా!

ఈ మార్పునుబట్టి టైపు మిషనును సృష్టించుట కడు సుకరముగదా!

దంత్యములగు చజ లకు వేఱు లిపు లక్కఱ లేదు. ఇప్పుడు వాని భేదము నెవ్వరును లిపిలో పాటించుట లేదుగాని కావలెనని యభిమానించువారికై ప్రత్యేకలిపి కల్పించితిని. రేఫమునకుఁ బూర్వపు లిపిలో వలపలిగిలక -ఁ అను చిహ్నమును, నకారమునకు ఁ అను చిహ్నమును గలవు. ఈ లిపు లభిమానింపఁదగినవి. కాని వలపలిగిలక 'వర్గము' అను విధమున వ్రాయఁబడును. ఇది 'వర్గము' అనువిధమున మార్చుట ఉచ్చారణానుగుణము. అప్పు డది డ వలిగిలక యగును. ఇష్టమేని వీని నుంచుకొనవచ్చును. అనిష్టమేని మానవచ్చును. కర్ణాటాంధ్రలిపులకుఁ జాల సాన్నిహిత్యమున్నది గాన, ఉభయలిపులకు నైక్యము కలుగుట యుభయదేశములవారికిని జాల లాభకరమని నా యీ సంస్కారములో కర్ణాటలిపిరీతిని కొంత చేకొనుటయ్యెను. ఉభయలిపులకు నైక్యము పొసగుట నాకోరిక.

---

# పరిశిష్టము

వెనుకటి వ్యాసములందుఁ గలిగిన కొన్ని చ్యుతులను —ఆ వ్యాసములు ముద్రితమైనపిమ్మట స్ఫురించినవాని నిప్పు డీ దిగువ క్రమముగాఁ బొందుపఱచుచున్నాను.

[83 పుటలో ౧౬ బంతితర్వాత నిది చేరవలెను.]

"వ......అనేకపురుషరత్నాకీర్ణంబై వెలుంగుచున్న—
సభలో దానవదూత గాంచె విలసజ్జాజ్వల్యమానంబులై......"

(కుమార సం. ౧౦ ఆశ్వా.)

'వెలుఁగుచున్న సభలో' అన్న సమానపదము-సంహితఁ గలిగియుండవలసినది- వచనావసానమునఁ గొంత గాను (వెలుంగుచున్న), ఉత్పలమాలాపద్యారంభమునఁ గొంతగాను (సభలో) విడఁబడియున్నది.

*　　*　　*　　*

[౧౦౯ పుటలో, 'వింతనిఘంటువులు'లో దీని నొక వింతనిఘంటువుగాఁ జేర్పనది.]

మదిరాక్షి, మదిరాయతలోచన ఇత్యాదివిధముల సంస్కృతాంధ్రములలో స్త్రీవర్ణన ముండును. దీనికి 'మద్య పానము చేయుటచే నెఱ్ఱవారిన కనులవంటి కనులుగలది' అని కొంద ఱర్థము చెప్పుదురు. 'మదిరో మత్తఖంజనః' అని ఒక నిఘంటువు నుదాహరించి, మదిరశబ్దమునకుఁ బాగ రెక్కిన కాటుకపిట్ట యనియు, దానివంటి కనులు గలదిగాన మదిరాక్షి యయ్యె ననియు పలువు రర్థము చెప్పుదురు.

'మదిరో మత్తఖంజనః' ఎక్కడిదో తెలియదు. కొన్ని వ్యాఖ్యానగ్రంథములలోఁ గూడ నిది గలదు. ఇటీవల ఉద్యానపత్రికాధిపతులు శ్రీ తాతాచార్యులుగారు శృంగార దృష్టులలో నొక దృష్టివిశేషమునకు 'మదిర' యని పేరుండుటను నాట్యశాస్త్రమునుండి యుద్ధరించి చూపిరి. కాన 'మదిరో మత్తఖంజనః' అన్నది అప్రౌఢకల్పితనిఘంటు వగుట వ్యక్తమయినది.

*   *   *   *   *

[౨౧౪ పుటలో ౧౦ బంతిక్రింద 'కనుమారి' అన్న ప్రకరణమునకు అనుబంధముగా ఇది చేర్చునది.]

శ్రీశైలముపై కర్మారీశ్వర మని యొక పుణ్యస్థల మున్నది. అది కొండకొమ్ము. అక్కడనుండి భక్తులు పుణ్యలోకప్రాప్త్యర్థమై నేల కుఱికి ప్రాణత్యాగము చేయుదురు. క్రిందఁ బడుచున్నవాఁడు, అంతరాళమున నున్నవాఁడు, ఉఱుక నున్నవాఁడు అన్న క్రమమున ఎడతెగకుండ శివరాత్రినాఁ డక్కడ భక్తులు ఉఱుకుచునే యుండెడివారు.

"కరముష్టిఁ జేసి యా కర్మారి నుఱుకు
ననఘుల భవపరిత్యక్తమానసుల
నతి ముఱి నవలి కర్మారీశ్వరమున
నుఱుకు పుణ్యులఁ జూచి—
పడియెడు దేహంబు పడిన దేహంబు
పడెడు దేహంబు లెన్నంగఁ జొక్కాడు"

(పండితారాధ్యచరిత్ర)

ఈ కర్మారియే తెనుఁగున 'కనుమారి' యయినది. ప్రాకృతమున ర-లు న-లుగా మారుట కలదు.

*　　　　*　　　　*　　　　*

[కోహళికి అనుబంధము. ౧౨౧ పుట చూడు]

శక ౧౨౧౪ నందనపుష్య శు ౫ సో... నాడు శ్రీమన్మహామండలేశ్వర శ్రీవిక్రమోత్తుంగ రాజేంద్రచక్రవర్తి స్వస్తిశ్రీ త్రిపురాంతక శ్రీమన్మహాదేవరకుం బెట్టించిన పహిండిచతుర్ముఖకోహళి. దోర్దండద్వయ నిర్మదీకృత చతుర్ద్వీపాధిపస్థపనాచార్య స్సూర్యసమప్రతాపమహిమా శ్రీ విక్రమోత్తుంగరాట్, ప్రాయచ్ఛ త్త్రిపురాంతకాయ వసునాథర్త్తాప్రహర్తా [　　　] హేమమయం చతుర్దశ పలోనాభ్యాం తులాభ్యాం మితమ్. (మార్కాపురం తాలుకా త్రిపురాంతకేశ్వరాలయ శాసనము)

శక ౧౩౪౪ - శుభకృత్కార్తిక కృష్ణ తృతీయ — శ్రీ విష్ణువర్ధనమహారాజు లయిన శ్రీ నరసింహదేవర చక్రవర్తులు......... ధర్మలింగానకు పంచవక్త్రకోహళి భంగారానం జేయించి సమర్పించిరి. (విశాఖపట్నం జిల్లా-పంచదారులో ధర్మలింగేశ్వరాలయశాసనము.)

ఈ రెండు శాసనములవలనను, శివలింగమునను అయిదు ముఖములతోఁ జేయించిన 'టోపి'-'కుళ్ళా' - శిర ఆచ్ఛాదనము కోహళి అగుట స్పష్టపడినది. తొలి శాసనము సంస్కృతశ్లోకమున ప్రధానభాగము స్పష్టముగా లేకయున్నను. అచ్చో ఉష్ణీషపు దమ్ము ననుకొనెదను. శాసనప్రతిబింబము సరిగాఁ బరిశీలింపవలెను.